ఆంధ్రకవి నక్షత్రమాలిక – ౨

# ఎఱ్ఱాప్రెగడ



రచయిత్రి:

డాక్టర్ పి. యశోదారెడ్డి, ఎం. ఏ., పిహెచ్. డి.,

తెలుగుశాఖ

ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.

1972

యూనివర్సిటీ గ్రాంట్సు కమీషన్‌వారి

ఆర్థిక సాహాయ్యముచే ముద్రింపఁబడినది.

# సంపాదకీయము

—:o:—

ఆంగ్లమున 'English men of letters' అను పేర ఆ వాఙ్మయము నందలి మహాకవులయు రచయితలయు జీవితవిశేషములను రచనాసౌందర్య విశేషములను విశదీకరించు విమర్శగ్రంథపరంపర యొకటున్నది. అట్లే ఆంధ్రవాఙ్మయమునందలి ప్రముఖ కవిపుంగవుల జీవితరచనా విశేషములను సులభసుందరముగ వెల్లడించు గ్రంథపరంపర నాయా కవుల [illegible]లను గూర్చి విశేషముగ పరిశ్రమ కావించిన విజ్ఞులచే రచింపఁజేసి విశ్వ[illegible] పక్షమునఁ బ్రచురింపవలెనని నాకొక యభిలాష చిరరూఢమైయుండెను. విశేషము ఆ అభిలాషను పురస్కరించుకొని ఆంధ్రవాఙ్మయమందలి యిరువదియేడ్గురు సుప్రసిద్ధకవిపుంగవుల నెన్ని వారినిగూర్చియు వారిగ్రంథములను గూర్చియుఁ సుమారు నూటయిరువదిపుటల గ్రంథములు రచింపవలసినదని ఆంధ్రశాఖ యందలి మిత్రులను గోరితిని. ఆ గ్రంథపరంపర కందు వర్ణనీయులైన కవుల సంఖ్యనుబట్టి 'ఆంధ్రకవి నక్షత్రమాల' అని పేరుపెట్టితిని. ఆ ఇరువదియేడు గ్రంథములను బ్రచురించుటకు యూనివర్సిటీ గ్రాంట్సు కమీషనువారి సాహాయ్యము నర్థించుచు విశ్వవిద్యాలయోపాధ్యక్షులద్వారా విజ్ఞాపనము పంపు కొంటిని. 'ఫాకల్టీ ఆఫ్ ఆర్ట్సు' డీనుగారును, విశ్వవిద్యాలయోపాధ్యక్షులును దానిని సానుభూతితోఁ బరిశీలించి ప్రప్రథమమున మూఁడు గ్రంథములు ప్రచురించుటకుఁ దగిన ధన మిప్పించిరి. ఆసాహాయ్యముతో ముద్రితములైన గ్రంథములలో నిది రెండవది. సానుభూతితో నిట్టి సాహాయ్యము చేకూర్చిన విశ్వవిద్యాలయాధికారులకును, యూనివర్సిటీ గ్రాంట్సు కమీషన్‌వారికిని, గ్రంథము రచించి యీప్రయత్నమునకుఁ దోడ్పడిన గ్రంథకర్త్రిగారికిని నా కృతజ్ఞతాభి వందనములు. మిగిలిన గ్రంథములు కూడ నధికారుల సాహాయ్యసంపదచే నచిరకాలముననే ప్రచురింపఁబడి జిజ్ఞాసువుల కానందము చేకూర్చునని ఆశించుచున్నాను.

ఉస్మానియా విశ్వవిద్యాలయము
హైదరాబాదు 6—1—'73

దివాకర్ల వేంకటావధాని
ఆంధ్రశాఖాధ్యక్షుఁడు

## విషయసూచిక

—:o:—

# ఎఱ్ఱాప్రెగడ

"భారతకావ్యహార మొకభాగము నన్నయభట్టొనర్చె ము
క్తారమణీయవాక్యములఁ దక్కినభాగము సోమయాజి సొం
పార నొనర్చె రెండుగలయన్ శివదాసుఁడు మధ్యనాయక
శ్రీ రచియించె శారదధరింప గవిత్రయ కీర్తి మించగన్."

ఆంధ్రమహాభారతకావ్యహారమున కారణ్యపర్వశేష రచనావిశేషము చేత మధ్య నాయకశ్రీని గల్పించిన కీర్తిని దక్కించుకొని నన్నయ తిక్కనలతో సమానముగ నాంధ్రజాతి కారాధ్యుఁడైన కవి యెఱ్ఱాప్రెగడ. కవిత్రయమునం దీతఁ డొకరుఁడై వెలసినాఁడు.

ఈతఁ డాపస్తంబసూత్రుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. అప్రతిమాద్భుతోభయ కవిత్వప్రౌఢ శబ్దార్థయోగాజ్ఞాసిద్ధిమనుఁడైన సూరనార్యుఁ డీతనితండ్రి. తల్లి పోతమాంబిక. కంసారిచరణమధుకరపతి యనియు, సారవిమలయశుఁ డనియుఁ గీర్తింపఁబడిన యెఱపోతసూరి యితని తాత. ప్రజ్ఞాపవిత్రుఁ డూర్జిత చరిత్రుఁడైన బొల్లన యితని తాతతండ్రి. వెలనాటిచోడునివలన మిగుల మన్నన లను గన్న భీమనమంత్రి యితని తాతతాత. ఇది వీరి వంశక్రమము. ఇంతటి ప్రఖ్యాతిఁ బొంది నియమనిష్ఠాగరిష్ఠులై, రాజవాల్లభ్యశ్రీవిలసితులైనవారి వంగ డమున జనించిన ఎఱ్ఱాప్రెగడ గురుభజనపరాయణుఁడు, సరస బహుపురాణ ధర్మశాస్త్రకథావిస్తరవేది, వినయోదయభరితుఁ డగుటలో నాశ్చర్యము లేదు.

ఎఱ్ఱాప్రెగడ కృతకావ్యపీఠికలను బురస్కరించుకొని చూడగా నీతని వంశీయులలో నందఱును గవులు మహాకవులుగనే గోచరించుచున్నారు. కాని ఎఱ్ఱాప్రెగడ తాత, తండ్రులు వ్రాసిన గ్రంథము లెన్నియో? అవి యెయ్యవియో? ఏభాషయం దున్నవో? ఎవరి కంకితములో? మున్నగు విషయము లివ్వియుఁ దెలియవచ్చుట లేదు. అయ్యును వీరివంశ మాదినుండియు విద్వద్వంశ మనిమాత్రము గ్రహింప వీలగుచున్నది.

విప్రనారాయణ చరిత్ర కర్తయైన చెదలువాడమల్లన పూర్వకవిస్తుతి సందర్భమునం దెఱ్ఱాప్రెగడను దన వంశకర్తగాఁ బేర్కొనినాఁడు. మల్లన రచన

బురస్కరించుకొని శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు "కరాపత్రికిబదులు కాకర పత్రి యని వ్రాసినను తేటగీతిపద్యమున గణభంగ ముండదు" అనిచెప్పి యిది లేఖకుని ప్రమాదము గాదని వ్యక్తపఱిచినారు.[2] కరాపత్రిని గ్రామనామముగ స్వీకరించి యీ కరావర్తి యను గ్రామము నేఁడు కరవది యనుపేర 'అమ్మన బ్రోలు'నకుఁ బ్రక్కనున్న గ్రామ మగునని శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు తమ వ్యాసమునందుఁ బేర్కొనినారు.[3] కాని యీ పదము 'కరాపత్రి'యా లేక 'కరావర్తి'యా యను సందేహమును పండితులు వెలిబుచ్చుచున్నారు. 'కరావర్తి'గ స్వీకరించినవారు కరము = పన్ను, కరావర్తివృత్తి = పన్నులను వసూలు చేయునట్టియుద్యోగ మని యర్థము సెప్పి యెఱ్ఱాప్రెగడ పూర్వులు పాక నాటిలో tax collectors వంటి వృత్తిని కలిగియుండి రని నిర్ణయించుచున్నారు. దాదాపుగ నిట్టి నిర్ణయమునే కావించుచు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు సూచించినారు.[4]

కరాపత్రి వృత్తిమంతులనఁగాఁ బన్నులను గ్రహించు నేఁటి గ్రామాధికారి లేక గ్రామకరణము వంటి వృత్తిమంతులని గ్రహించుటయే సమంజసమై కానవచ్చుచున్నది.

'వృత్తి' యనఁగాఁ బూర్వము ధర్మప్రభువులు బహుశ్రుతులైన పండితులకు, శాస్త్రవేత్తలైన సద్బ్రాహ్మణులకు, మహాకవుల కాయాపుణ్యకాలములం దొకగ్రామమును సర్వభోగములతో నొసఁగ వారందు వృత్తికల్పనము గావించి నివసించుట యనిచెప్పుట సంప్రదాయము. కొంద ఱీసంప్రదాయము ననుసరించియే నృసింహపురాణమునందు గానవచ్చు సీసపద్యములోని 'వేఁగినాటఁ గరాపత్రి వృత్తిమంతుఁ డ'ను వాక్యమున కర్థనిర్ణయము గావింపవలయు ననుచున్నారు. వీరివాదము ననుసరించి 'వృత్తి' యను పదము నాయర్థము నందే గ్రహించినను కరాపత్రి వృత్తిమంతుఁ డనువాక్యమునందలి విభక్తిని బురస్కరించుకొని యెఱపోతసూరి వేఁగినాటిలోని కరాపత్రి యనుగ్రామము నందు వృత్తిగలవాఁ డనునర్థమును గ్రహించి చెప్ప వలనుపడకున్నది. కావున నిది 'కరావర్తివృత్తి' యను నొకవృత్తివిశేషమై యుండనోపు ననియే చెప్ప వలనుపడుచున్నది.

---

2. నృ. పు. పీఠిక. P. 1
3. మహాభారతోపన్యాసములు
4. పరిశోధన - (ఫిబ్రవరి - మార్చి 1956)

లను బురస్కరించుకొని చూడగా నెఱ్ఱన చెదలువాడ నిలయుఁ డనియు నిఁక నాతని యింటిపేరు 'చెదలువాడ' యనియుఁ దెలియుచున్నది. కాని చెదలువాడ యనునది యెఱ్ఱాప్రెగడ పూర్వులకు గృహనామముగ నున్న ట్లెక్కడను నాధారములు గానవచ్చుట లేదు. కాని యెఱ్ఱాప్రెగడ చెదలువాడయందుఁ గొంతకాలము నివసించుటచేసి యాతనికాలము నుండియో లేక యాతని తరువాతనో చెదలువాడ యనునది వీరి వంశీయులకు గృహనామముగ స్థిరపడి యుండవచ్చును. ఏలయన సాధారణముగా నొకవంశీయు లందఱొకేస్థానమం దుండవలయు నను నియమము లేదు. మీఁదుమిక్కిలి వారివారి జీవికలను బురస్కరించుకొని వారువా రాయా ప్రదేశములందు నివాస మేర్పఱచుకొని స్థిరపడుచుండుటయు కలదు. ఇట్లు వేఱువేఱుదేశములందు స్థిరపడినవారు వారిలో ప్రసిద్ధుఁడైన పురుషునే తమవంశమునకు మూలపురుషునిగాఁ గొనియాడుచుండుటయుఁ గలదు. ఆ విధముగనే యెఱ్ఱన కాలమునాఁటికి వెలనాటిచోడుని వలన సత్కారముల నంది యాప్రాంతమందు నివసించుచున్న భీమన వంశకర్తగా గణుతింపఁ బడుచుండగా మల్లనకాలమునాఁటి కావంశీయులలో మిగుల వాసికెక్కి చెదలువాడ నగ్రహారముగాఁ బడసిన యెఱ్ఱాప్రెగడ వంశకర్తయై వెలసినాఁడు.

యెఱ్ఱాప్రెగడ పూర్వులకు చెదలువాడ యనునది గృహనామముగా నున్నట్లుకాని యాగ్రామమందు వారు నివసించినట్లుగాగాని యాధారములు గానవచ్చుటలేదు. తన పూర్వులను ప్రస్తుతించిన యెఱ్ఱన సయితము నృసింహపురాణమునందుఁ దనతాత యెఱపోతసూరినిగూర్చి వ్రాయుచు "వేగినాటఁ గరాపర్తి వృత్తిమంతుఁ డని వ్రాసినాఁడేకాని చెదలువాడను నామమాత్రమునకేని యెచ్చటను సూచింపలేదు. కావున నతని తాతలు వేగినాట నేదోయొక గ్రామమునం దున్నట్లు గానవచ్చుచున్నది. నృసింహపురాణమందలి కరాపర్తి (వర్తి) నాధారముగాఁ గొని కొందఱు విమర్శకు లీకరాపర్తి యనున దొకగ్రామనామమనియు నదియే యెఱ్ఱాప్రెగడ పూర్వులకు నివాసమనియుఁ జెప్పుచుండ మఱికొందఱు వేఁగినాట కరాప(వ)ర్తి యనుగ్రామము లేనేలేదనియు, కాకరపర్తి, రాపర్తి యని తత్సదృశనామములు గల గ్రామములుండ దానినే లేఖకుఁడు కరావర్తియని తప్పుగా వ్రాసియుండుననియు నభిప్రాయపడినారు.[1] ఈసూచనను

---

1. మల్లంపల్లి సోమశేఖరశర్మ – రెడ్డిరాజ్యచరిత్రము. పుట. 496

బురస్కరించుకొని శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు "కరాపత్రికిబదులు కాకర పత్రి యని వ్రాసినను తేటగీతిపద్యమున గణభంగ ముండదు" అనిచెప్పి యిది లేఖకుని ప్రమాదము గాదని వ్యక్తపఱిచినారు.[2] కరాపత్రిని గ్రామనామముగ స్వీకరించి యీ కరావత్రి యను గ్రామము నేఁడు కరవది యనువేర 'అమ్మనబ్రోలు'నకుఁ బ్రక్కనున్న గ్రామ మగునని శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు తమ వ్యాసమునందుఁ బేర్కొనినారు.[3] కాని యీ పదము 'కరాపత్రి'యా లేక 'కరావత్రి'యా యను సందేహమును పండితులు వెలిబుచ్చుచున్నారు. 'కరావత్రి'గ స్వీకరించినవారు కరము = పన్ను, కరావత్రివృత్తి = పన్నులను వసూలు చేయునట్టియుద్యోగ మని యర్థము సెప్పి యెఱ్ఱాప్రెగడ పూర్వులు పాకనాటిలో tax collectors వంటి వృత్తిని కలిగియుండి రని నిర్ణయించుచున్నారు. దాదాపుగ నిట్టి నిర్ణయమునే కావించుచు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు సూచించినారు.[4]

కరాపత్రి వృత్తిమంతులనఁగాఁ బన్నులను గ్రహించు నేఁటి గ్రామాధికారి లేక గ్రామకరణము వంటి వృత్తిమంతులని గ్రహించుటయే సమంజసమై కానవచ్చుచున్నది.

'వృత్తి' యనఁగాఁ బూర్వము ధర్మప్రభువులు బహుశ్రుతులైన పండితులకు, శాస్త్రవేత్తలైన సద్బ్రాహ్మణులకు, మహాకవుల కాయాపుణ్యకాలములం దొకగ్రామమును సర్వభోగములతో నొసఁగ వారందు వృత్తికల్పనము గావించి నివసించుట యనిచెప్పుట సంప్రదాయము. కొంద ఱీసంప్రదాయము ననుసరించియే నృసింహపురాణమునందు గానవచ్చు సీసపద్యములోని 'వేఁగినాటఁ గరాపత్రి వృత్తిమంతుఁ డ'ను వాక్యమున కర్థనిర్ణయము గావింపవలయు ననుచున్నారు. వీరివాదము ననుసరించి 'వృత్తి' యను పదము నాయర్థము నందే గ్రహించినను కరాపత్రి వృత్తిమంతుఁ డనువాక్యమునందలి విభక్తిని బురస్కరించుకొని యెఱపోతసూరి వేఁగినాటిలోని కరాపత్రి యనుగ్రామము నందు వృత్తిగలవాఁ డనునర్థమును గ్రహించి చెప్ప వలనుపడకున్నది. కావున నిది 'కరావత్రివృత్తి' యను నొకవృత్తివిశేషమై యుండనోపు ననియే చెప్ప వలనుపడుచున్నది.

---

2. నృ. పు. పీఠిక. P. 1
3. మహాభారతోపన్యాసములు
4. పరిశోధన - (ఫిబ్రవరి - మార్చి 1956)

ఇఁక నారణ్యపర్వశేషమునందలి యాశ్వాసాంతపద్యమునందుఁ గానవచ్చు, "............పాకనాటిలో నీలకంఠేశ్వరస్థానమై యెసకమెసఁగు గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠతనొప్పు ధన్యుఁడు ధర్మైకతత్పరాత్మ."[5] అను సీసపద్యమును బురస్కరించుకొని యెఱ్ఱాప్రెగడ గుడ్లూరునివాసి యైనట్లు గానవచ్చుచున్నది. కాని కొందఱీసీసపద్యమే ప్రక్షిప్తమని త్రోసివేయు చున్నారు. విమర్శకు లూహించినట్లుగనే యీసీసపద్యము ప్రక్షిప్తమైన గావచ్చు. కాని పద్యము ప్రక్షిప్తమైనప్పటికి దీని నిందు దూర్చినవారు మాత్ర మెఱ్ఱాప్రెగడనుగూర్చి సమగ్రముగా నెఱిఁగినవారే యాతని యభిమానులే యైయుందురనుటలో సందేహము లేదు. కావున నీగ్రంథరచనా సందర్భము వనో లేక యంతకుపూర్వమో కాక తనకు మల్లారెడ్డి ప్రాపకము లభింపక మునుపో యతఁడీ గ్రామమందు నివశించియుండె ననుటమాత్రము యాధార్థ్యము. ఈ గుడ్లూరు నీలకంఠేశ్వరస్థాన మనువిషయము భారతారణ్యపర్వ శేషాంత మందలి సీసపద్యమేకాక యజ్ఞాతనామధేయుఁడైనకవి చాటు వొక్కటీవిష యమునే చెప్పుచున్నది.[6] ఈ చాటువునే యుదాహరించి శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు "నీలకంఠేశ్వర స్తుతిపద్యముకూడ ఎఱ్ఱన నీలకంఠేశ్వర భక్తుఁ డనియు, అతఁ డాదేవునికి నెలవైన గుడ్లూరు గ్రామమునఁ గొంతకాలము నివసించె ననియు సూచించుచున్నది" అని యభిప్రాయపడినారు.[7]

ఇంతవఱకు లభించిన యాధారములను బురస్కరించుకొని చూడగా నెఱ్ఱన మఱియు నాతని పూర్వులకు నివాసస్థానములుగా మూఁడు ప్రదేశములు గానవచ్చుచున్నవి.

1. వేఁగినాటియందొక గ్రామము. 2. గుడ్లూరు. 3. చెదలువాడ. ఇందు మొదటి రెండు గ్రామములందు ఎఱ్ఱన పూర్వికులుకూడ నివసించి యుందురు. కాని చెదల్వాడమాత్ర మెఱ్ఱనకాలముననే యాతనికి నివాసస్థానము కాగా నాతనికి మఱియు నాతని తరువాతివారల కావేరు గృహనామమై స్థిరపడిన దని చెప్పవచ్చును. ఏలయన నెఱ్ఱాప్రెగడ, మల్లనచే నభిమానింపఁబడిన కవి.

---

5. ఆ. మ. భా. ఆ. ప. ఆ. 7-469
6. "నిను సేవించినఁ గల్గు మానవులకున్ నిత్యవధూటీఘటీ"
వేలూరి శివరామశాస్త్రి, హరివంశము—పీఠిక
7. నృ. పు. ఆ. 1, 12, 13

మల్లారెడ్డి ప్రేరణమువలననే ఎఱ్ఱన రామాయణమును వ్రాసి ప్రోలయ వేమా రెడ్డి కంకితము గావించినాఁడు. మల్లారెడ్డియన్ననో, చెదలువాడయందొక దేవాలయమును గట్టించి యందు రామలక్ష్మణవిగ్రహములను ప్రతిష్ఠ గావింపఁజేసినాఁడు. బహుశః యీసందర్భముననే మల్లారెడ్డి చెదలువాడను ఎఱ్ఱాప్రెగడకు నగ్రహారముగా బహూకరించి యుండవచ్చును. కావున నాఁటి నుండియే యాగ్రామము ఎఱ్ఱనకు మఱియు నాతని వంశీయులకు నివాసస్థాన మైనది. కావున ప్రసిద్ధుఁడైన మహాకవి యీ చెదలువాడ నగ్రహారముగాఁ బడయుటచేత నతనికిని నాతని తరువాతివారలకును గృహనామముగా సంకే తింపఁబడి మనుమఁడు మల్లయకాలమునాఁటి కాపేరు స్థిరపడిన దని చెప్ప వచ్చును.

## ఎఱ్ఱాప్రెగడ శీలము - గురువు

ఎఱ్ఱాప్రెగడ సరసబహుపురాణధర్మకథావిస్తరవేది. సకల భాషా కవిత్వ విశారదుఁడు. అతులానుభావభవ్యుఁడు. ప్రబంధరచనాప్రావీణ్యము సహజపరిణతసిద్ధంబై వెలసినవాఁ డయ్యు గురుభజన పరాయణుఁడు. మీఁదు మిక్కిలి వినయోదయభరితుఁడు. ఎఱ్ఱన కేవలము నృసింహపురాణమందేకాక హరివంశమందునయితము ప్రోలయ వేమారెడ్డి "సాధుసమ్మతుఁడవు, నిత్య సౌమ్యమతివి, భవ్యుఁడవు గాన నీమీఁదఁ బరగఁ బక్షమేను గలిగి యుండుదు నెప్పు డెఱ్ఱనార్య"[8] యని యితనితోఁ బలికినట్లుగా రచించి సౌశీల్యాదులం దీకవికిఁగల యభినివేశమును బ్రకటించినాఁడు. ఆ విధముగనే యత్యంతశక్తి వంతమైన కవితాప్రౌఢి కలిగియుఁ దానతివినయముతో "కతిపయాక్షర పరిగ్రహ జనితంబైన నైసర్గికచాపలంబుకతంబున, మించినవేడ్క వీనులకుమిక్కు టమై మధువృష్టిగ్రమ్మ రాయంచలు కూయఁ గ్రౌంచమును నావలఁ గూయఁ గడంగుభంగి" దానును గావ్యశయ్య గీలించినకీర్తిసంగసుఖలీలకు కాంక్షచేసి కావ్యరచనోన్ముఖుఁ డైనట్లు రచించుట యాతని వినయసౌశీల్యమునకుఁ బతాక వంటిదిగ భావింపవచ్చును.

ఈతఁడు పూజితధూర్జటిచరణాంబుజుఁడై గిరిశభక్తిరసతత్పర భావము గలవాఁడు. అయ్యును గోవిందగుణాదరసంభృతసౌమనస్యధన్యుఁడు.[9]

---

8. హరి. వం. ఆ. 1 – 38
9. నృ. పు. ఆ. 1–12, 13

ఈతఁ డిట్టివాఁ డనుటకు విష్ణుధర్మ ప్రశంసాపవిత్రములైన హరివంశ, నృసింహావతారకథాప్రబంధములనిర్మాణమే తార్కాణము. కావ్యరచన మన నితఁడొక యీశ్వరానుశాసనమువలె భావించి దాని నత్యంతభక్తితత్పర మతియై తీర్చుచుండెడివాఁ డనుట కుదాహరణముగా "ఉత్సాహంబు మిగులం జిత్తంబును వాగ్వృత్తంబును నుత్తమ శ్లోకసంకీర్తన రచనాయత్తంబులగు చుండ నత్యుదాత్తభక్తిప్రయుక్తోల్లాసభాసితుండనై" యని నృసింహపురాణము నందు రచించిన వాక్యమును బేర్కొనవచ్చును.[10]

ఆద్యులైన నన్నయ తిక్కనాదులు చూపినత్రోవ పావనంబని యెంచిన యీతఁడు వారివలెనె కావ్యప్రయోజనమునుగూర్చి యాలోచించినాఁడు. మధు రోక్తిగుంభన మనీషులు మెచ్చునట్లుగ రచింప నఖిలేప్సితపుణ్యఫలోదయోన్న తులు చేకూరునని భావించినాఁడు.[11]

సాధుజనసమ్మతుఁడైనయెఱ్ఱన సంయమీశ్వరుఁడైనశంకరస్వామియం దధికభక్తిప్రపత్తులు గలవాఁడు. ఈతఁడు సత్సంప్రదాయానుసారియై కావ్యా రంభములందు లాంఛనప్రాయముగా గురుస్తుతి నొనరించుటయేకాక యాశ్వా సాంతగద్యలందు సయితము "ఇది శంకరస్వామి సంయమీశ్వరచరణసరోరుహ ధ్యానానందసౌందర్యధుర్య శ్రీ సూర్యసుకవిమిత్రసంభవ శంభుదాసలక్షణా భిధేయ యెఱ్ఱయనామధేయ ప్రణీతంబైన" అని శంకరస్వామిని ప్రధాన ముగాఁ బేర్కొనుచు గద్యను ముగించి వారియెడ తనకుఁ గల యమేయమైన గురుభక్తిని బ్రదర్శించినాఁడు. అంతేకాక ఎఱ్ఱన వీరిని స్మరించినప్పుడెల్ల మునీంద్రుఁ డనియు, కామక్రోధముల గ్రందువాపినట్టివాఁ డనియుఁ దుదిదాకిన యున్నతి గన్నవాఁ డనియు, భక్తవత్సలుఁ డనియుఁ బేర్కొనుట చూడ నీతఁ డొక సామాన్యుఁ డైన విద్యాగురువువలె కాక యొక మహామహిమానుభావుని వలెను, ఒక మహాతపస్వివలెను గోచరించుచున్నాఁడు. బహుశః యీ శంకర స్వామి ఎఱ్ఱనకు దీక్షాగురువై యుండనోవు.

**బిరుదులు:** ఎఱ్ఱాప్రెగడకుఁ గల బిరుదులలోఁ బ్రధానముగాఁ బేర్కొనదగి నవి రెండుబిరుదులు. అందొకటి ప్రబంధపరమేశ్వరుఁ డనునది. రెండవది శంభు దాసుఁ డనునది. ఇందు రెండవదియైన శంభుదాసుఁ డనుబిరుదము లక్షణాభి

---

10. నృ. పు. ఆ. 1-21 & 29
11. నృ. పు. ఆ. 1-21

ధేయమని యెఱ్ఱనయే తెల్లము గావించినాఁడు. లక్షణాభిధేయ మనఁగా నొకానొక వ్యక్తికి నొకానొక గుణవిశేషముచేత నొసఁగబడిన మారుపేరుగ మనము గుర్తింపవచ్చును. ఇచట ఎఱ్ఱనకుఁ గల శివభక్తి విశేషముచేత జను లాతనిని శంభుదాసుఁ డని యనియుందురు. రానురా నదియే యాతని రెండవపేరుగా మారినది. ఇఁక లక్షణ యనుశబ్దమున కమరకోశమందువలెనె సంస్కృతాంగ్ల నిఘంటువులలో expressing, indicating indirectly, a mark, a sign, a symbol, named అనునర్థములు గానవచ్చుచున్నవి. కావున యెఱ్ఱనయు భక్తిభావవినమ్రుఁడై జనులాతనిని శంభుదాసుఁడని పిలిచిన మారుపేరునే కొండంతలుగా భావించి గ్రంథములందు సయిత ముపయోగించుకొనినాఁడు. దీనివలన సమకాలికులు, సగోత్రీకులైన యితరయెఱ్ఱయల నుండి యితనిని వేఱు గావించుటకు నాస్కారము చిక్కినది.

**ప్రబంధపరమేశ్వరుఁడు:** ప్రబంధపరమేశ్వరుఁ డనునది యీతనికి బిరుదనామము. ప్రస్తుత ముపలభ్యము లగుచున్న యెఱ్ఱనకృతములైన మూఁడు గ్రంథములలో కేవలమొక నృసింహపురాణమునందే యీబిరుదు గానవచ్చుచున్నది. నృసింహపురాణములో గ్రంథావతారికాసందర్భమున దన తాతయైన ఎఱపోత సూరి "ఎన్నికమైఁ బ్రబంధపరమేశుఁ డనంగ నరణ్యపర్వశేషోన్నయమంధ్ర భాష సుజనోత్సవమొప్పఁగ నిర్వహించితా"[12] అని పలికినట్లు వ్రాయుటచే నీ ప్రబంధపరమేశ్వరబిరుద మీతనికి నృసింహపురాణ రచనకుఁ బూర్వమే యున్నట్లు తెలియుచున్నది. అయినచో నెఱ్ఱన రచించిన గ్రంథములలో నేది ప్రబంధ మను యాలోచన పొడముచున్నది. కావున ప్రబంధ మనఁగా నేమి? ఈశబ్దము నెవ్వ రెట్లుపయోగించిరో యెఱుఁగవలయును.

ఈప్రబంధశబ్దము నేఁటిదృష్టియందు కాక సాధారణముగా కావ్యదృష్టితో నుపయుక్తమైనది. ఆంధ్రభాషయందు తిక్కనామాత్యుఁడు తొలుత "రచనా కౌతుకమున మనమలరఁగ నీప్రబంధమండలి కధినాథునిగా నేపురుషుఁ బేర్కొనువాఁడ" ననియు 'నీదృశంబులగు ప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్క యారాధన విశేషం బనియు రచించి ప్రబంధ మనఁగా కావ్యమనియే సూచించినాఁడు.[13] ఆవిధముగా నెఱ్ఱయ సయితము నృసింహపురాణ

12. నృ. పు. 1-17

ధేయమని యెఱ్ఱనయే తెల్లము గావించినాఁడు. లక్షణాభిధేయ మనఁగా నొకానొక వ్యక్తికి నొకానొక గుణవిశేషముచేత నొసఁగబడిన మారుపేరుగ మనము గుర్తింపవచ్చును. ఇచట ఎఱ్ఱనకుఁ గల శివభక్తి విశేషముచేత జను లాతనిని శంభుదాసుఁ డని యనియుందురు. రానురా నదియే యాతని రెండవపేరుగా మారినది. ఇఁక లక్షణ యనుశబ్దమున కమరకోశమందువలెనె సంస్కృతాంగ్ల నిఘంటువులలో expressing, indicating indirectly, a mark, a sign, a symbol, named అనునర్థములు గానవచ్చుచున్నవి. కావున యెఱ్ఱనయు భక్తిభావవినమ్రుఁడై జనులాతనిని శంభుదాసుఁడని పిలిచిన మారుపేరునే కొండంతలుగా భావించి గ్రంథములందు నయిత ముపయోగించుకొనినాఁడు. దీనివలన సమకాలికులు, సగోత్రీకులైన యితరయెఱ్ఱయల నుండి యితనిని వేఱు గావించుటకు నాస్కారము చిక్కినది.

**ప్రబంధపరమేశ్వరుఁడు:** ప్రబంధపరమేశ్వరుఁ డనునది యీతనికి బిరుదనామము. ప్రస్తుత ముపలభ్యము లగుచున్న యెఱ్ఱనకృతములైన మూఁడు గ్రంథములలో కేవలమొకనృసింహపురాణమునందే యీబిరుదుగానవచ్చుచున్నది. నృసింహపురాణములో గ్రంథావతారికాసందర్భమున దన తాతయైన ఎఱపోత సూరి "ఎన్నికమైఁ బ్రబంధపరమేశుఁ డనంగ నరణ్యపర్వశేషోన్నయమంధ్ర భాష సుజనోత్సవమొప్పఁగ నిర్వహించితా"[12] అని పలికినట్లు వ్రాయుటచే నీ ప్రబంధపరమేశ్వరబిరుద మీతనికి నృసింహపురాణ రచనకుఁ బూర్వమే యున్నట్లు తెలియుచున్నది. అయినచో నెఱ్ఱన రచించిన గ్రంథములలో నేది ప్రబంధ మను యాలోచన పొడముచున్నది. కావున ప్రబంధ మనఁగా నేమి? ఈశబ్దము నెవ్వ రెట్లుపయోగించిరో యెఱుఁగవలయును.

ఈప్రబంధశబ్దము నేఁటిదృష్టియందు కాక సాధారణముగా కావ్యదృష్టితో నుపయుక్తమైనది. ఆంధ్రభాషయందు తిక్కనామాత్యుఁడు తొలుత "రచనా కౌతుకమున మనమలరఁగ నీప్రబంధమండలి కధినాథునిగా నేపురుషుఁ బేర్కొనువాఁడ" ననియు 'నీదృశంబులగు ప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్క యారాధన విశేషం బనియు రచించి ప్రబంధ మనఁగా కావ్యమనియే సూచించినాఁడు.[13] ఆవిధముగా నెఱ్ఱయ సయితము నృసింహపురాణ

12. నృ. పు. ఆ. 1. 17

ముని యెఱ్ఱనయే తెల్లము గావించినాఁడు. లక్షణాభిధేయ మనఁగా నొకానొక కి నొకానొక గుణవిశేషముచేత నొసఁగబడిన మారుపేరుగ మనము వవచ్చును. ఇచట ఎఱ్ఱనకుఁ గల శివభక్తి విశేషముచేత జను లాతనిని దాసుఁ డని యనియుందురు. రానురా నదియే యాతని రెండవపేరుగా నది. ఇఁక లక్షణ యనుశబ్దమున కమరకోశమందువలెనె సంస్కృతాంగ్ల టువులలో expressing, indicating indirectly, a mark, a sign, a ool, named అనునర్థములు గానవచ్చుచున్నవి. కావున యెఱ్ఱనయు వవినమ్రుఁడై జనులాతనిని శంభుదాసుఁడని పిలిచిన మారుపేరునే ంతలుగా భావించి గ్రంథములందు నయిత ముపయోగించుకొనినాఁడు. న సమకాలికులు, సగోత్రీకులైన యితరయెఱ్ఱయల నుండి యితనిని గావించుటకు నాస్కారము చిక్కినది.

ప్రబంధపరమేశ్వరుఁడు: ప్రబంధపరమేశ్వరుఁ డనునది యీతనికి నామము. ప్రస్తుత ముపలభ్యము లగుచున్న యెఱ్ఱనకృతములైన మూఁడు ములలో కేవలమొకనృసింహపురాణమునందే యీబిరుదుగానవచ్చుచున్నది. హాపురాణములో గ్రంథావతారికాసందర్భమున దన తాతయైన ఎఱపోత "ఎన్నికమైఁ బ్రబంధపరమేశుఁ డనంగ నరణ్యపర్వశేషోన్నయమంధ నుజనోత్సవమొప్పఁగ నిర్వహించితా"[12] అని పలికినట్లు వ్రాయుటచే నీ ధపరమేశ్వరబిరుద మీతనికి నృసింహపురాణ రచనకుఁ బూర్వమే ట్లు తెలియుచున్నది. అయినచో నెఱ్ఱన రచించిన గ్రంథములలో నేది ధ మను యాలోచన పొడముచున్నది. కావున ప్రబంధ మనఁగా నేమి? ము నెవ్వ రెట్లుపయోగించిరో యెఱుఁగవలయును.

ఈప్రబంధశబ్దము నేఁటిదృష్టియందు కాక సాధారణముగా కావ్యదృష్టితో యుక్తమైనది. ఆంధ్రభాషయందు తిక్కనామాత్యుఁడు తొలుత "రచనా మున మనమలరఁగ నీప్రబంధమండలి కధినాథునిగా నేపురుషుఁ బేర్కొ డు" ననియు 'నీదృశంబులగు ప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించు నొక్క యారాధన విశేషం బనియు రచించి ప్రబంధ మనఁగా కావ్య సూచించినాఁడు.[13] ఆవిధముగా నెఱ్ఱయ సయితము నృసింహపురాణ

12. నృ. పు. ఆ. 1-17

మును రసవత్కావ్యమనియు ప్రబంధమనియుఁ బేర్కొనుటయేకాక "ఇట్లు మహా ప్రబంధకల్పనాకుతూహలాయత్తచిత్తుండనై"[14] యనియు కావున ప్రబంధరచనా ప్రావీణ్యము నీకు సహజపరిణతసిద్ధం బనియు నిఁక హరివంశమునందు 'జగదర్చితంబగు ప్రబంధంబు నిర్మింప నుపక్రమించితి'[15] ననియు వ్రాసినాఁడు. కావున నెఱ్ఱాప్రెగడకుఁ బూర్వమునను మఱియు నాతని తరువాతికాలమునందును నీపదము కావ్యపరముగనే యుపయోగింపఁబడినట్లు తెలియుచున్నది.

సాధారణముగఁ బ్రబంధమనఁగ నష్టాదశవర్ణనములు గలిగి రాయల యుగమునందు వెలసిన సాహిత్యమునకే యాపేరు చెల్లుచున్నట్లు కాక ప్రకృష్టమైన బంధము కలిగిన యేకావ్యమునైన నాపేరుతోఁ బిలువవచ్చు నని యెఱిఁగితిమి. ఇంతేకాక "ప్రబంధమంటే విశేషార్థ మేమీలేదు. రామాయణ భారతాదులు కూడా ప్రబంధాలేను." అని చెప్పుచు నందు కుదాహరణముగ ధ్వన్యాలోకము నుండియు, కావ్యప్రకాశము నుండియు నాయావాక్యముల నుద్ధరించినారు శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు.

ఈ ప్రబంధశబ్దము కేవలము కావ్యమునకే కాక నాటకమునకుఁ గూడ చెల్లుచున్నట్లుగ కాళిదాసకృత మాళవికాగ్నిమిత్రమునం దాధారములు గాన వచ్చుచున్నవి.

సంస్కృతాంగ్ల నిఘంటువుల ననుసరించి ప్రబంధశబ్దార్థమును బరిశీలింపఁగా a bound, a tie, uninteruptedness, or succession, continuance, a continuity, or connected narrative, or discourse, a work of imagination, a feigned story founded on substratum of fact, plan, scheme అను నర్థములం దుపయుక్త మగుచున్నట్లు గానవచ్చుచున్నది.

పై యర్థములను బురస్కరించుకొని చూడగా అష్టాదశవర్ణనలు కలిగి రాయలకాలమందలి రచనలఁ బోలిన కావ్యమే ప్రబంధముకాక యవిచ్ఛిన్నముగ విషయము లన్నియు నొకచోటఁగల గ్రంథము, మఱియు సంబంధముతెగని కథా సూత్రముగల గ్రంథమునుగూడ ప్రబంధమనఁ జెల్లునని తెలియుచున్నది. కావున పై యర్థములను బురస్కరించుకొని యే గ్రంథరచనమువలన ఎఱ్ఱాప్రెగడ ప్రబంధపరమేశ్వరుఁ డాయెనో విచారింపవలయును. ప్రబంధ

---

14. నృ. పు. ఆ. 1. 14-20
15. హరి. పూ. భా. ఆ. 1-44

ధోరణిని భారతారణ్యపర్వశేషమును చమత్కారబంధురముగ రచించుటచేతఁ బ్రబంధపరమేశ్వరుఁ డను బిరుదనామము గలిగిన దని కవులచరిత్రలో శ్రీ వీరేశలింగము పంతులుగారు పేర్కొనినారు.

"పురాణరచనలో నయితము వర్ణనాప్రాధాన్యమును నెలకొల్పిన మొదటి కవి యీతఁడే. వర్ణనాత్మకము, అధునికమును అగు శైలిలో నృసింహపురాణ మనెడి ఒక ప్రబంధమునే రచించి రాఁబోవు ప్రబంధమహావృక్షమునకు బీజ మును నాటిన యుగకర్త. ఈ విధముగఁ బ్రబంధకవిత్వ స్థాపనాచార్యుఁడు గనుకనే ఎఱ్ఱాప్రెగ్గడ ప్రబంధపరమేశ్వరుఁ డను సార్థకనామమును దాల్చెను." అని శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు గౌతమవ్యాసములలోఁ బ్రకటించినారు. ఈ విధముగఁ బెద్దలు రచించిన యభిప్రాయముల నాధారముగ చూచినచో కేవలము ప్రబంధలక్షణానుగుణములైన చ్ఛాయ లెఱ్ఱన రచనయం దుండుట చేతనే యాయన కాబిరుదము వచ్చినట్లు తెలియుచున్నది. కాని యే గ్రంథము ప్రబంధలక్షణములు గలది యను విషయము నందుమాత్ర మేకవాక్యత కుదరలేదు.

ఎఱ్ఱాప్రెగడ మొదట రామాయణమును రచించి ప్రోలయ వేమారెడ్డికిఁ గృతి నిచ్చినాఁడు. దానితరువాత హరివంశమును రచించి యారెడ్డి ప్రభువునకే కృతి నిచ్చినాఁడు.

ఈ హరివంశ గ్రంథము సకలార్థ సాధకమైన భారతమునకు శేష గ్రంథము. హరివంశపారాయణముచేతగాఁని భారతపారాయణము పరిసమాప్తి నొంది విశేషఫలదాయి కాదు. అంతియకాక 'ఏతతపర్వశతం పూర్వం వ్యాసే నోక్తం మహర్షిణా' అని సంస్కృత భారతమునందును, 'పర్వశతంబులు గలిగి' యని తెలుఁగు భారతమునందును గన్పడుటచే హరివంశమును భారత భాగముగనే గ్రహించి ఖిలపర్వముగఁ బేర్కొనినారు. భారతమునందు తిక్కన నాల్గవదియైన విరాటపర్వమునుండి పదునేనుపర్వములు రచించినాఁడు. హరి వంశమునం దెఱ్ఱాప్రెగడకుఁ బ్రబంధపరమేశ్వరుఁ డను బిరుదము కానరాదు. కావున రామాయణమువలన నీతని కీబిరుదము రాలేదని స్పష్టమైనది. భారత మున తిక్కన రచింపకవిడిచిన ఖిలభాగ హరివంశము పూర్తిగావించినను నన్నయకృతమగు నారణ్యపర్వము పూర్తిగాక వెలితిగా నుండుటచేత భారతము నకు సమగ్రమైన స్వరూపము రాలేదు. అందుకై యెఱ్ఱాప్రెగడ నిస్వార్థబుద్ధితో జగద్ధితరతియై యీ శేషభాగమును రచించి నన్నయ రచనగనే పూర్తిగావించి

భారతభాగము లన్నింటి నొక్కచోఁ గూర్పఁగలిగినాఁడు. నాఁటినుండియే భారతమంతయు నవిచ్ఛిన్నముగా నొక్కచోఁ జేరి సమగ్రస్వరూపముతో భాసించినది. ఇట్లష్టాదశపర్వము లొక్కచోఁ గలియ భారత మొక మహాప్రబంధము కాగా దానికి పరమేశ్వరునివంటివాఁ డెఱ్ఱన యైనాఁడు. కావున నెఱ్ఱాప్రెగడకుఁ బ్రబంధపరమేశ్వరుఁ డనుబిరుదము 'అరణ్యపర్వశేషరచనముచే సిద్ధించినమాట సత్యమే. కాని యాబిరుదము అరణ్యపర్వమునందు ప్రబంధలక్షణానుగుణము లైన ఛాయ లుండుటమాత్రముచేత కాక కొఱవడిన భారతభాగమును పూరించి దాని నొక సంపూర్ణప్రబంధముగాఁ గల్పించుటచేతనే సిద్ధించినదని చెప్పవచ్చును.

**ఎఱ్ఱాప్రెగడ కాలము :** ఎఱ్ఱాప్రెగడ కాలమును నిర్ణయించుట కాతఁడు రచించిన గ్రంథములే ప్రబలములైనయాధారములు. అందుఁ బ్రధానముగఁ బేర్కొనఁ దగినవి హరివంశము, నృసింహపురాణము.

నృసింహపురాణమునం దెఱ్ఱాప్రెగడ పీఠికలోఁ గవివంశాది విశేషముల నెఱిఁగించు సందర్భమున తన తాతతాత యైన యెఱపోతసూరి వెలనాటి చోడునివలన మన్ననల నందిన భీమనమంత్రి యని పేర్కొనినాఁడు.[16] ఎఱ్ఱన తాతకుఁ దాతయైన భీమనమంత్రిని గౌరవించిన వెలనాటిచోడుని కాలమును బురస్కరించుకొని దాదాపుగ నెఱ్ఱనకాలమును నిర్ణయింపవచ్చును. నృసింహపురాణ మందలి పద్యము నాధారముగా గొని శ్రీ వీరేశలింగము పంతులుగారు "వెలనాటి చోడుఁడు క్రీ. శ. 1156 మొదలు క్రీ. శ. 1163 వ సంవత్సరము వఱకును బరిపాలించిన వాఁడని నిర్ణయించి యప్పుడు సన్మానమును బొందిన భీమన మన యెఱ్ఱన తాతకుఁ దాత కావున వీరిరువురి మధ్యనున్న మూఁడు తరములకుఁ దరమునకు నలువది సంవత్సరములు చొప్పునఁ బరిగణించినపుడు ఎఱ్ఱన జననకాలము క్రీ. శ. 1316 కాఁగా చోడునిచేత సన్మానములఁ బొందు నాఁటికే భీమన నలువది వత్సరముల ప్రాయము గలిగియుండ నాతనికిఁ గుమారునికి నరుపది వత్సరముల యంతరము లెక్కించుట భావ్యము కాదని మఱొక యిరువది సంవత్సరములు తగ్గించి ఎఱ్ఱాప్రెగడ జననకాలమును క్రీ. శ. 1296 అని నిర్ణయించిరి.

ఆంధ్ర కవితరంగిణికారులు పై కాలనిర్ణయమునకుఁ బ్రధానభూతుఁ

---

16. నృ. పు. ఆ. 1, 15

డైన వెలనాటిచోడుని కాలము నంగీకరింపక 'వెలనాటిచోడు లిరువురున్నారు. మొదటియాతఁడు క్రీ. శ. 1133 వఱకు నున్నవాఁడు. రెండవయాతఁడు క్రీ. శ. 1117-80 ల నడుమ రాజ్యము చేసినవాఁడు' అని వ్రాసి "భీమన మంత్రిని గౌరవించిన రాజు మొదటియాతఁ డని శ్రీ వీరేశలింగం పంతులుగా రభిప్రాయపడిరి. రెండవచోడుఁ డని నాయభిప్రాయము" అని వెలనాటిచోడుని వలన భీమన సత్కృతుల నందినకాలమును క్రీ. శ. 1175 గ నిర్ణయించుచుఁ దరమునకు ముప్పదిమూఁడు సంవత్సరములుగ లెక్కించుచు ఎఱ్ఱాప్రెగడ జనన కాలము క్రీ శ. 1280 తలంపవలసి యుండు" నని వ్రాసినారు.

పై లెక్క ననుసరించిచూడ మఱి యైదు సంవత్సరములు కలుపవలసి వచ్చును. సాధారణముగ నిదమిత్థమని కాలనిర్ణయమును జేయలేనిచోటఁ దర మునకు ముప్పది సంవత్సరము లనికాని లేదా మూఁడు తరములకు నూరు సంవత్సరము లనికాని స్వీకరించి లెక్కించు టుచితము. ఈ పరిగణనము నందు సాధారణముగ వచ్చు మన యాచారమును బురస్కరించుకొని యిరు వదియైదు సంవత్సరములకే యొకరు తండ్రియగుచుండఁ బై పరిగణనము తప్పని యాక్షేపణము చూపినను చూపవచ్చును, కాని కేవలము మనకు ప్రసక్తులైయున్న పురుషులందఱు మొదటిసంతాన మై యుండవలయు నను నిర్ణయము లేదు. అట్టిచో నన్నదమ్ములు ముర్వురు నల్వురున్నవారి యంతరము కొన్ని యెడల పదివఱకు మఱికొన్నియెడల నిరువదివఱకుఁ గూడ పోవుట వింతకాదు. కావున నీరెంటికి మధ్యతరమునకు 30-35 సంవత్సరము లని గ్రహించుటయే యుత్తమమైనది. ఈ నిర్ణయమే పాశ్చాత్యులును బాటించుచున్నారు.[17]

వెలనాటిచోడు లిరువురు గలరు. మొదటి వెలనాటిచోడుఁడు క్రీ. శ. 1108-1132 వఱకు రాజ్య మేలినట్టి కుళోత్తుంగచోడుఁ డని నామాంతరము

17. (a) "In reconing historically by generations the word is taken to mean the interval of time between the birth of the parents and that of their children usually completed at thirty years or three generations to a centuary."

—*James. H. H. Murray.*

(b) "Thus the word is also used of the age or persons of a generation usually taken as about thirty years or three generations to a centuary."

—*Encyclopaedia-Britanica.*

పొందిన చాళుక్యచోడ చక్రవర్తియైనవాని దత్తపుత్రుఁడను ఖ్యాతినిబొందినవాఁడు. ఈతని కుమారుఁడు గొంకరాజు. ఈతనికాలముననే యాధిపత్య ముత్తరమున మహేంద్రగిరినుండి దక్షిణమునఁ బాకనాటి వఱకును సాగెను. ఈతని కుమారుఁడే రెండవ వెలనాటిచోడుఁడు. ఈతఁడే మన యెఱ్ఱాప్రెగడ తాతకుఁ దాతయైన భీమనమంత్రిని గౌరవించినాఁడు. ఇతనికాలము క్రీ. శ. 1163–80. ఈ కాలమందు ప్రౌఢవయస్కుఁడగు భీమనకు మూఁడు తరములు తరువాతివాఁడైన ఎఱ్ఱన దాదాపు క్రీ. శ. 1280–85 నడుమ జన్మించి యుండవచ్చును. ఇఁక నెఱ్ఱాప్రెగడ రామాయణ హరివంశములను రచించి యాశ్రితచింతామణియై మధ్యాంధ్రదేశమును ధర్మానుబద్ధముగఁ బరిపాలించిన ప్రోలయ వేమారెడ్డి కంకిత మిచ్చెను. ఈ ప్రోలయ వేమారెడ్డి క్రీ. శ. 1325 నుండి 1353 వఱకుఁ బరిపాలించినట్లు చారిత్రకు లందఱు ఏకగ్రీవముగా నంగీకరించిన విషయము. కావున నీప్రభువు పరిపాలనా కాలమునందు కృతుల రచించి మన్ననల నందిన యెఱ్ఱాప్రెగడ 12 వ శతాబ్ది చివరి భాగమున ననఁగా క్రీ. శ. 1280–85 ల నడుమ జనించి క్రీ. శ. 1355 వఱకు జీవించె నని చెప్పవచ్చును.

ఎఱ్ఱాప్రెగడ గ్రంథములు : రామాయణము, హరివంశము అరణ్య పర్వశేషము, నృసింహపురాణము.

ఈ నాలుగు గ్రంథములు దాదాపు విష్ణుపారమ్యప్రతిబోధకములే. శివపదాబ్జ సంతతధ్యానసంసక్తచిత్తుఁడై శంభుదాసుఁ డనఁ బరగియు గోవింద గుణాదర సంభృత సౌమనస్యధన్యత[18] కీగ్రంథములే ప్రబలసాక్ష్యములు.

ఎఱ్ఱాప్రెగడ కృతము లగు నాలుగు గ్రంథములలో రామాయణము దక్క తక్కిన మూఁడుగ్రంథము లిప్పు డుపలభ్యము లగుచున్నవి. లభించుచున్న గ్రంథాధారములను బురస్కరించుకొని చూడగా హరివంశమందు రామాయణ ప్రశంసయు, నృసింహపురాణమునందు భారతారణ్యపర్వశేషోన్నయ ప్రశంసయు గానవచ్చుచున్నది. కావున హరివంశమునకుఁ బూర్వము రామాయణమును, నృసింహపురాణమునకుఁ బూర్వము భారతారణ్యపర్వశేషమును రచించినట్లు వ్యక్తమగుచున్నది. కాని నృసింహపురాణ హరివంశములందేగ్రంథము తొలుత రచించె నను విషయము కుదురుక పండితులలో నేఁటికి వివాదములు పొడసూపుచున్నవి.

---

18. నృ. పు. ఆ. 1. 18

సాధారణముగ కవిచరిత్రకారులు, విమర్శకులు కవులగ్రంథముల పౌర్వాపర్యమును నిర్ణయించుటకు వారి గ్రంథములందుఁ గానవచ్చు పీఠికల నాధారముగఁ గొని నిర్ణయము గావించుచుందురు. అయ్యవియే యెట్టిన గ్రంథముల విషయమునను నిర్ణయమునకుఁ దోడ్పడుచున్నవి. కాని నిగూఢ గుణశీలి, వినయోదితచరితుఁడు, ఉక్తివైచిత్ర్యోపేతుఁడు, కీర్తికాముఁడైన ఎఱ్ఱాప్రెగడ గ్రంథములందుఁ గానవచ్చు నవతారికలు గూడ విచిత్రాన్వయ శోభితము లగుటచే విషయనిర్ణయ మంత సులభమై కానవచ్చుట లేదు. ఇరు పక్షములవారును నీతని యవతారికల నాధారముగఁ గొనియే తమతమ యభిప్రాయముల కనుగుణముగ నెఱ్ఱాప్రెగడ గ్రంథముల పౌర్వాపర్యనిర్ణయ మొనఁగినారు. ఎఱ్ఱాప్రెగడ గ్రంథముల పౌర్వాపర్యమును బురస్కరించుకొని యభిప్రాయముల వెల్వరించినవారిలో శ్రీయుతులు కందుకూరి వీరేశలింగము పంతులు, శేషాద్రిరమణకవులు, పింగళి లక్ష్మీకాంతము, వేదాల తిరువేంగళా చారి, దివాకర్ల వేంకటావధాని, చాగంటి శేషయ్యగారలు ముఖ్యులు.

ఎఱ్ఱాప్రెగడ గ్రంథములందు హరివంశము మొదటను నృసింహపురాణము తరువాతను రచించె ననిచెప్పువా రొసఁగు హేతువులుగా శ్రీ చాగంటి శేషయ్యగారు పేర్కొనిన విధానము.

1. "గ్రంథరచనకుఁ బ్రారంభమున నీతఁడు నన్నయకు విఘ్నము కలిగించినట్టియు, విఘ్నము గలుగు నను భయముచేత తిక్కన విడిచిపెట్టె నని ప్రజ లనుకొనునట్టియు నారణ్య[19]పర్వశేషము నెన్నుకొని యుండఁడు.

2. హరివంశము వంటి యుత్తమ ప్రబంధమును రచించిన పిమ్మట ప్రబంధపరమేశ్వరుఁ డను పేరువచ్చునుకాని అరణ్యపర్వశేషమును బూరించి నంతమాత్రమున నట్టిపేరు వచ్చె నని తలంచుట సమంజసము కాదు. అందు చేతనే హరివంశమునఁ బ్రబంధపరమేశ్వరుఁడ నని కవి చెప్పుకొనలేదు. నృసింహపురాణమున నట్లు చెప్పుకొని యున్నాఁడు.

3. కవి తన యౌవనమున రాజుల నాశ్రయించి కృతులిచ్చి తిక్కన శ్రీనాథాదులవలెనే వృద్ధాప్యమున భగవంతుఁడైన నారసింహునకుఁ గృతి నిచ్చెను."

ఈ పైఁజూపిన కారణములను బురస్కరించుకొని శ్రీ శేషయ్యగారు

19. ఆ. కవి. త. భా. 4. పు. 63

''ఈ కారణములను బట్టి నృసింహపురాణమును గట్టకడపట రచించె ననెడి యూహ సత్యమనియే తోఁచును గాని నృసింహపురాణమందలి యవతారికలోని గద్యపద్యములను జదివినచో నాయూహ నిలువఁజాలదు. వాని నీక్రింద నిచ్చుచున్నాడను అని నృసింహపురాణమందలి ''కతిపయాక్షర పరిగ్రహ జనింత బైన నైసర్గిక చాపలంబు కతంబున'' అను వచనమును దాని తరువాతి యగు పద్యమును[20] బేర్కొని ''పైగద్యపద్యములను బరిశీలనాబుద్ధితోఁ జదివి యెడల నెఱ్ఱయకుఁ గావ్యరచన కది ప్రథమప్రయత్న మనియు నదివర కారణ్యపర్వశేషమును బూరించి యున్నను, అదియొక స్వతంత్రగ్రంథమ కాక అన్యకవి రచితమైన మహాగ్రంథములోఁ గొంతభాగము మాత్రమే యగుటచేతను నందు వేఱుగ నవతారికనుగాని గద్యనుగాని రచింపక నన్నయ మహాకవి రచించినట్లే చెప్పియుండుటచేతను దాని నొక గ్రంథముగా నెఱ్ఱ ప్రెగడ యెంచుకొనక నృసింహపురాణమునే తన ప్రథమకావ్యముగ నెం నూతనరచన కారంభించు కవులు సామాన్యముగఁ జూపెడి వినమ్రతన సూచించు 'రాయంచలుగూయఁ గ్రౌంచమును నావలఁ గూయఁ గడం భంగి' నిత్యాది వాక్యముల నిందు వ్రాసె ననియు, రామాయణమును హ వంశమును, అరణ్యపర్వశేషమును నదివఱకే రచించియున్నయెడల నృసింహ పురాణమునం దిట్టి ప్రథమప్రయత్న సూచక వాక్యములను వ్రాసియుండ డనియుఁ దోఁపక మానదు.' అనియు నిఁక విక్రమార్కచరిత్రమును రచించి జక్కయకవి యెఱ్ఱాప్రెగడను నుతించుచు వ్రాసిన పద్యములో నరణ్య పర్వశేష నృసింహపురాణ రామాయణములను వరుసగఁ బేర్కొనియుండుట ప్రబలసాక్ష్యము కాకపోయినను గొంతవఱ కీయూహను (అనఁగా మొద నరణ్యపర్వశేషము నృసింహపురాణము, పిదప రామాయణ హరివంశములను వరుసలో నెఱ్ఱన గ్రంథరచన గావించె ననుట) బలపఱచుచున్నది.'' అ మతియొక హేతువును జూపిరి. ఎఱ్ఱాప్రెగడ నృసింహపురాణ, హరివంశా గ్రంథములకు పీఠికను[21] వ్రాసిన శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు ఉన్న

---

**20.** ''మించిన వేడ్క వీనులకు మిక్కుటమై మధువృష్టి గ్రమ్మ రా
యంచలు గూయఁ గ్రౌంచమును నావలఁ గూయ గడంగు భంగిఁ బ్రౌ
ఢాంచిత శబ్దసారులు మహాకవు లాద్యులు కావ్యశయ్యఁ గీ
లించిన కీర్తి సంగ సుఖలీలకు నేనును గాంక్ష చేసితిన్. నృ. పు. ఆ.

**21.** ఆంధ్ర కవితరంగిణి. సం. 4, పుట 63–65

సంస్కృతాది చతురోక్తి పదంబుల (పథంబులఁ) గావ్యకర్తవై' అను దానిలోని కావ్యము రామాయణమేనని దాని పిదపనే ఆరణ్యపర్వశేష నృసింహపురాణ ములఁ జెప్పె ననియు, వేమయ కోరఁగా తొల్లి రచించిన రామాయణము కృతి యిచ్చి భారతమునకు ఖిలమగు హరివంశమునకుఁ బూనుకొనె నని చెప్ప వలెను. మఱియు ఈ చతురోక్తి పథంబులు సంస్కృతములో ఆదికావ్యము లని ఎఱ్ఱయ ఉద్దేశించెనేని రామాయణ హరివంశములు చెప్పిన పిదపనే ఆరణ్యపర్వశేషమును నృసింహపురాణమును జెప్పె నని అనవలయును. అనియు మఱియు నృసింహపురాణము రామాయణమును గాని హరివంశమును గాని పేర్కొనదు. హరివంశము నృసింహపురాణమును గాని ఆరణ్యపర్వ శేషమును గాని ఉగ్గడింపదు. కావున వీని పౌర్వాపర్యము తెలిసికొనుటకు వీలు లేదు. ఇఁక రచనాప్రౌఢిలో ఆరణ్యపర్వశేష నృసింహపురాణములకు హరి వంశము లొచ్చుగాన రామాయణ హరివంశముల రచన మొట్టమొదటి దని కొందఱందురు. విరాటమును ఆనుశాసనిక పర్వమును ఉదాహరణముగాఁ జూపి రచనాప్రౌఢికి అద్యప్రయత్నమునే కారణముగాఁ జెప్పి కొందఱు వెనుకటి వాదము నియ్యకొనరు. ఇతని కవితారచన హరివంశముననే విశ్రాంత మయినదని కొంద ఱందురు. ఎఱ్ఱయ దేనిని చెప్పి ప్రబంధపరమేశ్వరుఁ డాయెనో అట్టి ఆరణ్యపర్వశేషమునే సారహీనముగాఁ గొందఱు తలఁచిరి. 'భిన్నరుచిర్హి లోకః' ఎవరి లక్ష్యకేంద్రము వారిదే[22] యని చెప్పి వీరుసయిత మేనిర్ణయమును గావింపకయే వదిలినారు.

శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు ఎఱ్ఱనగ్రంథముల పౌర్వాపర్యముల నిర్ణయించుచు ఉన్నత సంస్కృతాది చతురోక్తి పదంబుల' అను పద్యమునే పేర్కొని 'ఈ పద్యమునుబట్టి మొదట నొక కావ్యమును తరువాత నృసింహ పురాణమును రచించె నని తెలియుచున్నది. తదనంతరమున హరివంశమును బట్టి 'బంధురష్టాదశపర్వ నిర్వహణ సంభావితం బగు మహాభారతంబు హరి వంశ పూరం బగు నట్లుగఁ గ్రమవ్యాఖ్యాన మొనరించె'నని తెల్లమగును. అని వ్రాయుటయేకాక ఎఱ్ఱాప్రెగడ హరివంశములో నెఱ్ఱన తా నింతవఱకే రచిం చిన రామాయణమును పేర్కొని నృసింహపురాణమును గూర్చి తలపెట్టకుండు టను గూర్చి "ఆ సందర్భము వేఱు, ఎట్లనఁగ నృసింహపురాణ మను పురాణ

22. హరి. పీఠిక. P. XIII & XX

గ్రంథమును రచింపఁ జేయఁబోవునపు డాగ్రంథమును రచించుట కతనికిఁ గల యర్హత నిరూపణీయము కనుకనే యదివరలో ఈ పురాణమువంటి ప్రాక్తన కథాసందర్భముగల రామాయణ భారతములను దప్పక ప్రశంసింప వలసి యున్నది''[23] అని వ్రాసినారు. వీరి ననుసరించి ఎఱ్ఱాప్రెగడ గ్రంథముల క్రమము (1) రామాయణము (2) ఆరణ్యపర్వశేషము (3) నృసింహ పురాణము (4) హరివంశముగాఁ గానవచ్చుచున్నది.

శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు నృసింహపురాణమం దున్న 'మించిన వేడ్కఁ బీనులకు మిక్కుటమై' యను పద్యమును బురస్కరించుకొని 'ఈ చెప్పుకొనుట కేవల వినయమునే కాక కవితా ప్రారంభదశను గూడ సూచించు చున్న దనుచు నభిప్రాయపడుచు నింకను "(నన్నయ తిక్కనలు) వారు పాండితీకవితాపాథోదులు తనది పాండిత్యమును కాదు, కవిత్వమును గాదు. కతిపయాక్షర పరిగ్రహజనితమైన చాపలము. రామాయణ హరివంశములు రచించిన విమ్మటనే తా నారణ్యపర్వ గద్యలోఁ దనపేరు చెప్పుకొనుటకు జంకి యుండఁ దనియు నా విషయమున కారణాంతరములచే నట్లొనర్చినను నృసింహ పురాణమునందు పై విధమున స్వసామర్థ్య లోపసూచకముగా నత్యంత నమ్ర తను బ్రదర్శించియుండఁ డనియు నా యభిప్రాయము. నృసింహపురాణ రచనాకాలమునాఁటి కతనికి మల్లారెడ్డి యొక్కయు తద్ద్వారా వేమారెడ్డి యొక్కయు ప్రాపు లభించియుండకపోవుటచే నతఁ డాకావ్యమును తన తాత ప్రేరణచేత రచించిన కతమున దాన నతనికి ప్రియదైవతమును స్వామియు నైన అహోబల నరసింహస్వామి కంకితము చేసియుండును. అందుచే నతఁడు రామాయణ హరివంశములకు ముందే ఆరణ్యపర్వశేష నృసింహపురాణముల వరుసగా రచించియుండె ననుట యుచితముగాఁ గనుపించును." అని తమ యభిప్రాయముల నొసఁగినారు.

శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు ఎఱ్ఱాప్రెగడ గ్రంథములను గూర్చి వ్రాయుచు "1. ఆరణ్యపర్వశేషము. 2. శ్రీ నరసింహావతారము. 3. రామాయణము. 4. హరివంశము. వీనిని ప్రాయికముగ నెఱ్ఱాప్రెగడ యొకదాని తరువాత నొకటి వ్రాసియుండును" అని యూహించినారు.

ఈ విధముగ రామాయణ హరివంశముల కన్న మున్నుగ భారతారణ్య

23. భారతోపన్యాసములు

పర్వశేష నృసింహపురాణములను ఎఱ్ఱన రచించె నని చెప్పు పెద్దలు చూపు హేతువులలో నొకటి విక్రమార్కచరిత్రమునందు జక్కన పేర్కొనిన ఎఱ్ఱాప్రెగడ గ్రంథముల క్రమము. దీనిని ప్రబలమైన యాధారముగా గ్రహింతురేని యింతకన్న విశ్వసనీయమై తోపట్టునది యాతని వంశీయుఁడు మనుమడు నైన మల్లన చెప్పినక్రమము ననుసరింపవలసి వచ్చును. ఆక్రమము ననుసరించి యారణ్యపర్వశేష, రామాయణ, నృసింహపురాణములును చివర హరివంశమును రచించినట్లు తెలియవచ్చును. కావున యాగ్రంథములందలి పూర్వకవి స్తుతిసందర్భములను బురస్కరించుకొని గ్రంథక్రమమును నిర్ణయించుటకు వీలులేదు. ఏలయన కవు లాయా పూర్వమహాకవుల స్తుతించునప్పుడు వారి గ్రంథములఁ బేర్కొందురేకాని వాని నన్నింటి నానుపూర్వ్యమును బురస్కరించుకొనియే చెప్పవలయు నను నియమము లేదు. ఒకవేళ గ్రంథకర్త పూర్వకవి స్తుతిక్రమము, మఱియు నాపూర్వకవికృతగ్రంథక్రమము కాకతాళీయముగఁ గలసిన కలువవచ్చు నేమోకాని అట్లే చెప్పవలయు నను నియమము మాత్రము లేదు. కావున అనియత విషయము లాధారముగా నీవివాదమును పరిష్కరించుట సమంజసము కాదు.

ఇంతవఱకే రచితమైన గ్రంథములఁ గూర్చి నృసింహపురాణమునందుఁ బేర్కొని హరివంశమందు నృసింహపురాణ ప్రసక్తిఁ గొనిరాకుండుటకుఁ గల కారణము 'అర్హతా నిరూపణ' మని శ్రీ తిరువేంగళాచార్యులు సూచించినారు. ఈ సూచన యంత సమంజసముగా లేదు. ఏలయన నింతవఱకే రామాయణము రచించి వేమభూపాలున కంకితమిచ్చి నన్నయకృతారంభకావ్యమును తాను స్వీకరించి తద్రచనయగా నారణ్యపర్వశేషమును బూరించి ప్రబంధపరమేశ్వరుఁ డని పేరుగాంచిన మహాకవికి ఇప్పుడు క్రొత్తగా నృసింహపురాణ రచనా సందర్భమునందు 'అర్హతా నిరూపణ' మేల గావలసివచ్చెనో యెఱుఁగ రాదు. మీఁదుమిక్కిలి యీ గ్రంథరచనమునకై యహమహమికతో బూనిన కవి మఱియొక్కడు లేడు. ప్రభువు లెవ్వరీగ్రంథమును రచించుటకు సమర్థులుగలరా యనుచు సభాస్థానమున బ్రశ్నింపలేదు. ఇఁక నట్టియెడ భగవదంకిత మైన గ్రంథప్రారంభమున తన సామర్థ్యనిరూపణ మనావశ్యకము. ఆయెటో ఇంతటి పరీక్షకునిలచిన గ్రంథప్రశంస హరివంశమునం దేల చేయలేదు. రామాయణమును మాత్రము పేర్కొని తక్కిన గ్రంథముల చెప్పక యేల విడువవలెనో తెలియదు. కావున నెఱ్ఱన మొదట రామాయణమును వ్రాసి

మును భగవదంకితమే కావించినాఁడు.

శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు "ఈశ్వరప్రణిపాతముతోఁ గూడిన విజ్ఞానయోగమునం దభినివేశము కలిగిన సమాధిని నిమీలితేక్షణుండనై క్షణం బున్న" అని చెప్పుకున్న వాక్య మప్రయత్నముగా వచ్చిన సత్యవాక్య మని కవి యాధ్యాత్మికోన్నతిని పొగడినారు. నిజముగా శ్రీ శాస్త్రిగారన్నట్లావిషయ మంతటిదే. కాని మఱి యంతటి యాత్మోన్నతిఁ గన్న మహాకవి కారచనము బాల్యరచనమై యుండదుకదా ?

ఇంతవఱకే యొక మహాకవి రచింపఁగా కొఱవడిన భాగము పూరించి, రెండవగ్రంథ రచనాకాలమునాఁటికి ఈశ్వర ప్రణిపాతముతోఁ గూడిన విజ్ఞాన యోగమునం దభినివేశము గలిగి తనగ్రంథమును భగవదంకితము గావించి మహామహిమానుభావుఁ డైన యొకకవి తిరిగి రాజాశ్రయమును కాంక్షించి యాతని కోరికమై గ్రంథముల రచించి కృతుల నొసఁగఁడు. కావున నెఱ్ఱా ప్రెగడ రామాయణ హరివంశముల తరువాతనే నృసింహపురాణ మొనరించె నని చెప్పవచ్చును.

## ఎఱ్ఱాప్రెగడ గ్రంథములు

1. భారతారణ్యపర్వశేషము 2. రామాయణము 3. హరివంశము 4. నృసింహపురాణము లను నాలుగు గ్రంథములే కాక కవిసర్పగారుడ మను మఱియొక లక్షణగ్రంథమును వ్రాసినట్లు కస్తూరి రంగకవికృతమగు ఆనంద రంగరాట్ఛందమునం దుద్ధరించిన పద్యములవలన దెలియుచున్నది. కాని మదరాసు, తంజావూరులలోనున్న తాళపత్రప్రతులలో నెఱ్ఱనపేరు కానరా కుండుటయు నీక కవిసర్పగారుడ మనుపేర లభించుచున్న రెండుగ్రంథ ములలో నొకటి బసవన కృతముగను, రెండవది పట్టాభిరామకవి కృతముగను గానవచ్చుచున్నవి యని శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు పేర్కొనినారు.[25] కావున ప్రత్యక్షముగా గ్రంథము లభించి యం దాధారములు గానుపించువఱ కీగ్రంథము ఎఱ్ఱనకృతమో కాదో నిర్ణయ మొనఁగుటకు వీలులేదు.

**భారతారణ్యపర్వము :**— అష్టాదశపర్వ సంభృతమైన వ్యాసరచిత మహా భారతమునందు ఆరణ్యపర్వము మూఁడవది. ఈ పర్వమునందు 1. ఆరణ్య

---

25. నృ. పు. పీఠిక. P. 6

మును భగవదంకితమే కావించినాఁడు.

శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు "ఈశ్వరప్రణిపాతముతోఁ గూడిన విజ్ఞానయోగమునం దభినివేశము కలిగిన సమాధిని నిమీలితేక్షణుండనై క్షణం బున్న" అని చెప్పుకున్న వాక్య మప్రయత్నముగా వచ్చిన సత్యవాక్య మని కవి యాధ్యాత్మికోన్నతిని పొగడినారు. నిజముగా శ్రీ శాస్త్రిగారన్న ట్లావిషయ మంతటిదే. కాని మఱి యంతటి యాత్మోన్నతిఁ గన్న మహాకవి కారచనము బాల్యరచనమై యుండదుకదా ?

ఇంతవఱకే యొక మహాకవి రచింపఁగా కొఱవడిన భాగము పూరించి, రెండవగ్రంథ రచనాకాలమునాఁటికి ఈశ్వర ప్రణిపాతముతోఁ గూడిన విజ్ఞాన యోగమునం దభినివేశము గలిగి తనగ్రంథమును భగవదంకితము గావించి మహామహిమానుభావుఁ డైన యొకకవి తిరిగి రాజాశ్రయమును కాంక్షించి యాతని కోరికమై గ్రంథముల రచించి కృతుల నొసఁగఁడు. కావున నెఱ్ఱా ప్రెగడ రామాయణ హరివంశముల తరువాతనే నృసింహపురాణ మొనరించె నని చెప్పవచ్చును.

## ఎఱ్ఱాప్రెగడ గ్రంథములు

1. భారతారణ్యపర్వశేషము 2. రామాయణము 3. హరివంశము 4. నృసింహపురాణము లను నాలుగు గ్రంథములే కాక కవిసర్పగారుడ మను మఱియొక లక్షణగ్రంథమును వ్రాసినట్లు కస్తూరి రంగకవికృతమగు ఆనంద రంగరాట్ఛందమునం దుద్ధరించిన పద్యములవలన దెలియుచున్నది. కాని మదరాసు, తంజావూరులలోనున్న తాళపత్రప్రతులలో నెఱ్ఱనపేరు కానరా కుండుటయు నిఁక కవిసర్పగారుడ మనుపేర లభించుచున్న రెండుగ్రంథ ములలో నొకటి బసవన కృతముగను, రెండవది పట్టాభిరామకవి కృతముగను గానవచ్చుచున్నవి యని శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు పేర్కొనినారు.[25] కావున ప్రత్యక్షముగా గ్రంథము లభించి యం దాధారములు గానువించువఱ కీగ్రంథము ఎఱ్ఱనకృతమో కాదో నిర్ణయ మొనఁగుటకు వీలులేదు.

**భారతారణ్యపర్వము :—** అష్టాదశపర్వ సంభృతమైన వ్యాసరచిత మహా భారతమునందు ఆరణ్యపర్వము మూఁడవది. ఈ పర్వమునందు 1. ఆరణ్య

---

25. నృ. పు. పీఠిక. P. 6

యావిషయమును హరివంశమందు చెప్పి, తరువాత నారణ్యపర్వశేష భాగమ
నన్నయ పేరుననే పూరించినాఁడు. తాను నృసింహపురాణమును రచించి
డింతవఱకే ప్రసిద్ధుఁ డైన చారిత్రక పురుషున కంకితమై జగమెఱిగిన గ్ర
ముల గూర్చి "ఉన్నత సంస్కృతాది చతురోక్తి పదంబుల కావ్యకర్త
యని సాముదాయికముగఁ జెప్పి నన్నయ రచనగా పూరించిన యరణ్య
భాగమును గూర్చి లోకజ్ఞుఁ డైన ఎఱ్ఱన కంఠోక్తిగాఁ బేర్కొనినాఁడు. కా
ఎఱ్ఱాప్రెగడ చివరిగ్రంథమైన నృసింహపురాణమునందు తానింతవఱకు రచిం
రచనల నన్నింటిని క్రమము దప్పకయే సూచించినాఁడు. అందుచే
మొదట రామాయణ హరివంశములను దఱువాత నారణ్యపర్వశేష నృసి
పురాణములను రచించె నని చెప్ప వలనుపడును.

రెండవది, నృసింహపురాణమందలి 'కతిపయాక్షరపరిగ్రహ జ
తైన నైసర్గిక చాపలంబు' మఱియు 'మించిన వేడ్క' యను గద్యపద్య
ఎఱ్ఱాప్రెగడ కావ్యరచనకు ప్రథమప్రయత్నముగాఁ గానవచ్చుట. ఈ
మునే అనుసరించి నృసింహపురాణమునే మొదటిగ్రంథముగా స్వీకరించు
వీలులేదు. ఏలయన కవి యింతవఱకే 'ఉన్నత సంస్కృతాది చతు
పదంబులఁ గావ్యకర్తయై యెన్నికమైఁ బ్రబంధపరమేశుఁ డనంగ నరణ్య
శేషోన్నయ' మొనర్చినాఁడు. కావున నిన్నిగ్రంథములు వ్రాసి యింత ప్రక
గాంచి యావిషయమును గ్రంథమునందు బాహాటముగా చాటుకొనునట్టి ప్రగల
కది తొలిప్రయత్నముగాఁ గానవచ్చుట లేదు. కాని ఎఱ్ఱయ వినయశీలసం
యట్టిది. ఈ విషయమునుగూర్చియే తాత ఎఱపోతసూరి "సరస బహుపు
ధర్మశాస్త్ర కథావిస్తరవేదివి, వినయోదయ భరితుఁడవు" అని ప్రశం
నాఁడు.[24] కావున ఈ గద్యపద్యములఁ బురస్కరించుకొనిచూడ నివి నృసి
పురాణ మాకవి ప్రథమప్రయత్న సూచకములుగాఁ గాక పరిణత మనస్కుఁ
కవియొక్క వినయోదయభరిత మైన వినమ్రభావ సూచకము లని గ్ర
చుటయే లెస్స. ఇట్లుగారచించుటలు తిక్కనాదులయెడ విజ్ఞులు పరిశీలిం
యుందురు. కావునఁ గవిత్రయమునం దొకరుఁ డైన యెఱ్ఱాప్రెగడ నం
మాతని చరమకృతియం దత్యంత వినయమును గనఁబఱచుచు గ్రంథమ
దవతారిక రచించుటయే కాక యన్నింట దృప్తిని బొందిన ఎఱ్ఱన యా గ్ర

---

24. నృ. పు. ఆ. 1–19

మును భగవదంకితమే కావించినాఁడు.

శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు "ఈశ్వరప్రణిపాతముతోఁ గూడిన విజ్ఞానయోగమునం దభినివేశము కలిగిన సమాధిని నిమీలితేక్షణుండనై క్షణం బున్న" అని చెప్పుకున్న వాక్య మప్రయత్నముగా వచ్చిన సత్యవాక్య మని కవి యాధ్యాత్మికోన్నతిని పొగడినారు. నిజముగా శ్రీ శాస్త్రిగారన్న ట్లావిషయ మంతటిదే. కాని మఱి యంతటి యాత్మోన్నతిఁ గన్న మహాకవి కారచనము బాల్యరచనమై యుండదుకదా ?

ఇంతవఱకే యొక మహాకవి రచింపఁగా కొఱవడిన భాగము పూరించి, రెండవగ్రంథ రచనాకాలమునాఁటికి ఈశ్వర ప్రణిపాతముతోఁ గూడిన విజ్ఞాన యోగమునం దభినివేశము గలిగి తనగ్రంథమును భగవదంకితము గావించి మహామహిమానుభావుఁ డైన యొకకవి తిరిగి రాజాశ్రయమును కాంక్షించి యాతని కోరికమై గ్రంథముల రచించి కృతుల నొసఁగఁడు. కావున నెఱ్ఱా ప్రెగడ రామాయణ హరివంశముల తరువాతనే నృసింహపురాణ మొనరించె నని చెప్పవచ్చును.

## ఎఱ్ఱాప్రెగడ గ్రంథములు

1. భారతారణ్యపర్వశేషము 2. రామాయణము 3. హరివంశము 4. నృసింహపురాణము లను నాలుగు గ్రంథములే కాక కవిసర్పగారుడ మను మఱియొక లక్షణగ్రంథమును వ్రాసినట్లు కస్తూరి రంగకవికృతమగు ఆనంద రంగరాట్ఛందమునం దుద్ధరించిన పద్యములవలన దెలియుచున్నది. కాని మదరాసు, తంజావూరులలోనున్న తాళపత్రప్రతులలో నెఱ్ఱనపేరు కానరా కుండుటయు నిఁక కవిసర్పగారుడ మనుపేర లభించుచున్న రెండుగ్రంథ ములలో నొకటి బసవన కృతముగను, రెండవది పట్టాభిరామకవి కృతముగను గానవచ్చుచున్నవి యని శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు పేర్కొనినారు.[25] కావున ప్రత్యక్షముగా గ్రంథము లభించి యం దాధారములు గానుపించువఱ కీగ్రంథము ఎఱ్ఱనకృతమో కాదో నిర్ణయ మొనఁగుటకు వీలులేదు.

**భారతారణ్యపర్వము :**— అష్టాదశపర్వ సంభృతమైన వ్యాసరచిత మహా భారతమునందు ఆరణ్యపర్వము మూఁడవది. ఈ పర్వమునందు 1. అరణ్య

25. నృ. పు. పీఠిక. P. 6

పర్వ 2. కిర్మీరవధపర్వ 3. అర్జునాభిగమన పర్వ 4. కైరాత :
5. ఇంద్రలోకాభిగమన పర్వ 6. నలోపాఖ్యాన పర్వ 7. తీర్థయాత్రా :
. జటాసురవధ పర్వ 9. యక్షయుద్ధ పర్వ 10. నివాతకవచయుద్ధ :
11. అజగర పర్వ 12. మార్కండేయ సమాస్యా పర్వ 13. ద్రౌపదీ :
భామా సంవాద పర్వ 14. ఘోషయాత్రా పర్వ 15. మృగస్వప్నోద్భవ :
16. వ్రీహిద్రౌణిక పర్వ 17. ద్రౌపదీహరణ పర్వ 18. జయద్రథవిమో
క్ష 19. రామోపాఖ్యాన పర్వ 20. పతివ్రతామాహాత్మ్య పర్వ 21. కుం
హరణ పర్వ 22. ఆరణేయపర్వము లను నిరువదిరెం డుపపర్వము లున్న
ఈ భాగమంతయు 315 అధ్యాయములందు విభక్తమై 11,847 శ్లోకవ
కలిగియున్నది.

ఆగమము నాసమ్ముఁ డైన నన్నయభట్టారకుఁ డీవ్యాసకృత మహాభారతవ
[illegible] ... నారణ్యపర్వమునందు అజగరోపాఖ్యా
[illegible] మార్కండేయ సమాస్యాపర్వమునందుఁ గానవచ్చు
[illegible] దావాపు 10, 11 శ్లోకముల వఱకున్న భావవ
[illegible] యేకాండమునసో యావివేసిన ట్లగపడుచున్నది. ఆ
[illegible] ము మొదటినుండి [illegible] వర్ణనము వఱకుఁ గల సంస్కృతభారత
సంఖ్యను గణింపఁగా 7,084 అని లెక్కకువచ్చినది. మూలగ్రంథమం
7,084 శ్లోకములు గల అరణ్యపర్వభాగమును నన్నయ 1,293 పద్య
ములలో రచించినాఁడు. ఈ సంఖ్యకు ఆశ్వాసాంత గద్యపద్యవ
ను చేర్చినచో 1,299 యగుచున్నది.

ఈ విధముగాఁ గానవచ్చుచున్న మూలభారతారణ్యపర్వ శ్లోకసంఖ
నన్నయకృత యాంధ్రమహాభారత గద్యపద్యసంఖ్యను బోల్చిచూడగా 6
మూలశ్లోకముల కొక తెలుఁగుపద్యము రచించె నని తెలియుచున్నది.
పరిగణనమును బట్టి నన్నయ తెలుఁగు సేతయంతయు మూలగ్రంథవ
[illegible] : 1 లెక్కలోఁ దెనుఁగుసేసె నని చెప్పలేము. అతఁడు మూలము
పటింపక పరిహరించిన భాగములు, విపులీకరించిన భాగము లెన్నియో క
ఈ విషయము విజ్ఞులెఱిఁగియే యున్నారు.

**ఎఱ్ఱాప్రెగడ-అరణ్యపర్వశేషము :—** ఆంధ్రమహాభారతమునం దార
పర్వము నాల్గవ ఆశ్వాసము 142 వ పద్యము తరువాత ముద్రితప్రతు
లన్నిటను ఇక్కడనుండి యెఱ్ఱాప్రెగడ కవిత్వము అను సూచన గానవ

చున్నది. కాని మూఁడవ ఆశ్వాసము 143 వ పద్యమునుండి ఏడవ ఆశ్వాసము చివరవఱ కున్న భాగములో నెఱ్ఱన పేరెచ్చటను గానరాదు. మీఁదుమిక్కిలి యాశ్వాసాంత గద్యసయితము నన్నయభట్టారకుఁడు రచించినట్లుగనే ముగింపఁబడినది. ఆరణ్యపర్వము సప్తమాశ్వాసాంతమునందు మాత్రము రెండు పద్యములు (ఒకటి సీసము, మఱొకటి కందము) ఆరణ్యపర్వశేషమును ధీరవిచారుఁడైన యెఱ్ఱనార్యుఁడు గవీంద్రకర్ణపుటపేయముగాఁ బూరించినట్లుగా వ్యక్తము సేయుచున్నవి.[26] విమర్శకులు గొంద ఱీపద్యములను ప్రక్షిప్తము లనువారును గలరు. ఇంతేకాక నన్నయభట్టు తరువాత భారతాంధ్రీకరణమునకుఁ బూనుకొని పదునేను పర్వములు పూర్తిచేసిన తిక్కయజ్వసయితము, మూఁడవది యైన ఆరణ్యపర్వము శేషభాగమునుండి కాక ఊర్జితకథోపేత మైన చతుర్థము విరాట పర్వము నుండియే తెలుఁగుసేతకుఁ బూనుకొనినాఁడు. అతం డంతతోఁ బోఁక విరాట పర్వారంభమున—

> ''ఆదరణీయ సార వివిధార్థగతి స్ఫురణంబుగల్గి య
> ష్టాదశపర్వ నిర్వహణ సంభృతమై పెనుపొందియుండ నం
> దాదిఁ దొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వ విశారదుండు వి
> ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్.[27]

అని రచించినాఁడు. ఈ రచనను బురస్కరించుకొని ఆరణ్యపర్వ మంతయు నన్నయచేతనే రచింపఁబడిన దని పాఠకు లూహించుట కవకాశము చిక్కినది.

తిక్కనామాత్యుఁడేకాక కాకునూర్యప్పకవి యనునాతఁడు అప్పకవీయమునందు గ్రంథప్రభావ సందర్భమున

> తే॥ ఆంధ్రశబ్దచింతామణి వ్యాకరణము,
> ముందు రచియించి తత్సూత్రముల దెనుంగు
> బాసచేఁ జెప్పె నన్నయభట్టు దొల్లి,
> పర్వములు మూఁడు శ్రీమహాభారతమున.[28]

అనియు మఱియు

26. ఆ. మ. భా. ఆ. ప. ఆ. 7. 169, 170
27. ఆ. మ. భా. వి. ప. ఆ. 1. 6
28. అప్ప. క. పీ. 43

పర్వ 2. కిర్మీరవధపర్వ 3. అర్జునాభిగమన పర్వ 4. కైర
5. ఇంద్రలోకాభిగమన పర్వ 6. నలోపాఖ్యాన పర్వ 7. తీర్థయ
8. జటాసురవధ పర్వ 9. యక్షయుద్ధ పర్వ 10. నివాతకవచ
11. అజగర పర్వ 12. మార్కండేయ సమాస్యా పర్వ 13. ద్రౌ
భామా సంవాద పర్వ 14. ఘోషయాత్రా పర్వ 15. మృగస్వప్నో
16. వ్రీహిద్రౌణిక పర్వ 17. ద్రౌపదీహరణ పర్వ 18. జయద్రథ
పర్వ 19. రామోపాఖ్యాన పర్వ 20. పతివ్రతామాహాత్మ్య పర్వ 21
హరణ పర్వ 22. ఆరణేయపర్వము లను నిరువదిరెం డుపపర్వమ
ఈ భాగమంతయు 315 అధ్యాయములందు విభక్తమై 11,847
కలిగియున్నది.

వాగనుశాసనుఁ డైన నన్నయభట్టారకుఁ డీవ్యాసకృత మహాభ
దాదిదొడంగి తెనుఁగు సేయుచు నారణ్యపర్వమునందు అజగరో
పూర్తిగావించి మార్కండేయ సమాస్యాపర్వమునందుఁ గానవ
శరదృతు వర్ణనములో దాదాపు 10, 11 శ్లోకముల వఱకున్న
దెనుఁ గొనరించి, యేకారణముననో యాపివేసిన ట్లగపడుచున్నది
పర్వము మొదటినుండి శరద్వర్ణనము వఱకుఁ గల సంస్కృతభ
సంఖ్యను గణింపఁగా 7,034 అని లెక్కకువచ్చినది. మూలగ్ర
7,034 శ్లోకములు గల అరణ్యపర్వభాగమును నన్నయ 1,293
ములతో రచించినాఁడు. ఈ సంఖ్యకు ఆశ్వాసాంత గద్య
6 చేర్చినచో 1,299 యగుచున్నది.

ఈ విధముగాఁ గానవచ్చుచున్న మూలభారతారణ్యపర్వ శ్లో
నన్నయకృత యాంధ్రమహాభారత గద్యపద్యసంఖ్యను బోల్చిచూడ
మూలశ్లోకముల కొక తెలుఁగుపద్యము రచించె నని తెలియుచు
పరిగణనమును బట్టి నన్నయ తెలుఁగు సేతయంతయు మూల
6 . 5 : 1 లెక్కలోఁ దెనుఁగుసేసె నని చెప్పలేము. ఆతఁడు మ
పదింపక పరిహరించిన భాగములు, విపులీకరించిన భాగము లెన్ని
ఈ విషయము విజ్ఞులెఱిఁగియే యున్నారు.

**ఎఱ్ఱాప్రెగడ-అరణ్యపర్వశేషము :—** ఆంధ్రమహాభారతము
పర్వము నాల్గవ ఆశ్వాసము 142 వ పద్యము తరువాత ము
దన్నిటను ఇక్కడనుండి యెఱ్ఱాప్రెగడ కవిత్వము అను సూచన

చున్నది. కాని మూఁడవ ఆశ్వాసము 143 వ పద్యమునుండి ఏడవ ఆశ్వాసము చివరవఱ కున్న భాగములో నెఱ్ఱన పే రెచ్చటను గానరాదు. మీఁదుమిక్కిలి యాశ్వాసాంత గద్యసయితము నన్నయభట్టారకుఁడు రచించినట్లుగనే ముగింపఁ బడినది. ఆరణ్యపర్వము సప్తమాశ్వాసాంతమునందు మాత్రము రెండు పద్యములు (ఒకటి సీసము, మఱొకటి కందము) ఆరణ్యపర్వశేషమును ధీరవిచారుఁ డైన యెఱ్ఱనార్యుఁడు గవీంద్రకర్ణపుటపేయముగాఁ బూరించినట్లుగా వ్యక్తము సేయుచున్నవి.[26] విమర్శకులు గొందఱీపద్యములను ప్రక్షిప్తము లనువారును గలరు. ఇంతేకాక నన్నయభట్టు తరువాత భారతాంధ్రీకరణమునకుఁ బూనుకొని పదునేను పర్వములు పూర్తిచేసిన తిక్కయజ్వ్వసయితము, మూఁడవది యైన ఆరణ్యపర్వము శేషభాగమునుండి కాక ఊర్జితకథోపేత మైన చతుర్థము విరాట పర్వము నుండియే తెలుఁగుసేతకుఁ బూనుకొనినాఁడు. ఆతం డంతతోఁ బోఁక విరాట పర్వారంభమున—

> ''ఆదరణీయ సార వివిధార్థగతి స్ఫురణంబుగల్గి య
> ష్టాదశపర్వ నిర్వహణ సంభృతమై వెనుపొందియుండ నం
> దాదిఁ దొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వ విశారదుండు వి
> ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్.[27]

అని రచించినాఁడు. ఈ రచనను బురస్కరించుకొని ఆరణ్యపర్వ మంతయు నన్నయచేతనే రచింపఁబడిన దని పాఠకు లూహించుట కవకాశము చిక్కినది.

తిక్కనామాత్యుఁడేకాక కాకునూర్యప్పకవి యనునాతఁడు అప్పకవీయమునందు గ్రంథప్రభావ సందర్భమున

> తే॥ ఆంధ్రశబ్దచింతామణి వ్యాకరణము,
> ముందు రచియించి తత్సూత్రముల దెనుంగు
> బాసచేఁ జెప్పె నన్నయభట్టు దొల్లి,
> పర్వములు మూఁడు శ్రీమహాభారతమున.[28]

అనియు మఱియు

26. ఆ. మ. భా. ఆ. ప. ఆ. 7. 169, 170
27. ఆ. మ. భా. వి. ప. ఆ. 1. 6
28. అప్ప. క. పీ. 43

క॥ ఆ మూఁడు పర్వములలో
నామాన్యుఁడు నుడువు తెలుఁగు లరసికొని కృతుల్
దాము రచించిరి తిక్కను
ధీమణి మొదలైన తొంటి తెనుఁగు కవీంద్రుల్.[29]

అని రచించిన పద్యములునయితము నన్నయభట్టారకుఁడే ఆరణ్యపర్వము పూర్తిగా రచించియుండె ననుటకు నాధారము లైనవి. కావుననే ఎఱ్ఱన ఆరణ్య శేషము రచించెనా లేదా యను వాదోపవాదము లాంధ్రపండితమండలియందుఁ బొడసూపినవి. భారతారణ్యపర్వమంతయు నన్నయభట్టు కవిత్వముగనే యా గ్రంథమునందే యాధారముండుటయుఁ దరువాతిమహాకవి మఱియు లక్షణ కర్తలు నన్నయభట్టు మూఁడుపర్వములు రచించె నని వ్రాయుటయుఁ జూడ నిజమున కెఱ్ఱన ఆరణ్యపర్వశేషమును రచియింపలేదని నిర్ధరీకరించి యా యారణ్యపర్వమందు యెఱ్ఱనకృతమని దెలియఁజేయు పద్యమును ప్రక్షిప్తమని సులభముగా నిరాకరించి యుందుము కాని యందుకు బాధకముగా నెఱ్ఱనకృత మైన నృసింహపురాణమునందు కవియే స్వయముగా "ఎన్నికమైఁ బ్రబంధపర మేశుఁ డనంగ నరణ్యపర్వశేషోన్నయ మంధ్రభాష సుజనోత్సవ మొప్పగ నిర్వహించితి"[30] యని రచించినపద్యము గానవచ్చుచున్నది. ఎఱ్ఱాప్రెగడయే కాక చదలువాడ మల్లన యనునాతఁడు విప్రనారాయణచరిత్రలో—

"ప్రతిభతో నారణ్యపర్వశేషముఁ జెప్పెఁ
గవులకుఁ జెవుల పండువులుగాగ" అని యెఱ్ఱాప్రెగడ ఆరణ్య పర్వశేషమును జెప్పినట్లు ధృవపఱిచినాఁడు. మఱియు జక్కన యనునాతఁడు విక్రమార్కచరిత్రమునందు—

ఉ॥ ఈత్రయిఁ దాఁ బ్రబంధపరమేశ్వరుఁడై విరచించె శబ్దవై
చిత్రి నరణ్యపర్వమునశేషము, శ్రీనరసింహరాచ చా
రిత్రములున్ బుధవ్రతగరిష్ఠత నెఱ్ఱయ శంభుదాసుఁ డా
చిత్రకవిత్వవాగ్విభవజృంభితుఁ గొల్చెద భక్తియుక్తితోన్.[31]

అని శబ్దవైచిత్రియముతో నెఱ్ఱన ఆరణ్యపర్వశేషమును రచించె నని వ్రాకుచ్చి నాఁడు. బలవత్తరమైన యీయాధారములను బురస్కరించుకొని యెఱ్ఱాప్రెగడ

---

29. అప్ప. క. పీ. 47
30. నృ. పు. ఆ. 1
31. విక్ర. చ. ఆ. 1–14

భారతారణ్యపర్వశేషమును రచింపలేదని త్రోసివేయుటకు వీలులేదు, కావున నెఱ్ఱాప్రెగడ కారణ్యపర్వశేషరచనాసంగయశము నియ్యనొల్లని విమర్శకులు గొందఱు, ఎఱ్ఱన ఆరణ్యపర్వశేషమును రచింపలేదు. నిజమున కాతఁ డట్లు రచించియుండిన మహానుభావుఁ డైన తిక్కనసోమయాజి మఱియుఁ గాకు నూర్యప్పకవ్యాదులు మూఁడుపర్వము లని చెప్పియుండరు కదా! కావున నన్నయభట్టారకుఁడు మూఁడుపర్వములు పూర్తిగాఁ దెనిగించియుండఁ గ్రిమి దష్టమువలననో మఱి యేకారణమువలననో శిథిలముకాగా నాశిథిలభాగమం దెఱ్ఱన కొన్నిచోట్ల అక్షరములనో, పదములనో, వాక్యములనో, పద్యములనో వ్రాసి పూరించెను. అందుకే యెఱ్ఱాప్రెగడ గావించినది అరణ్యపర్వశేషభాగ మం దాయా పద్యముల పూరణముమాత్రమే కాని పూర్తిశేషభాగరచనము గాదని వాదించుచున్నారు.[32]

ఇఁక నృసింహపురాణమందలి ఆరణ్యపర్వశేష సంబంధములైన 'శేష', 'ఉన్నయ' శబ్దములను గూర్చి 'శేష' శబ్దమునకు మిగిలిన దను నర్థము సరియైనదే యైనను పోఁగా మిగిలినదనియో, లభింపఁగా మిగిలినదనియో యని యర్థము చెప్పవలె ననియు మఱియు 'ఉన్నయ' మను శబ్దమునకు ఉద్ధారణ మను నర్థము చెప్పి నూతిలోని జలము నుద్ధరించినట్లు ఎఱ్ఱయ యరణ్యపర్వము లోని శిథిలభాగముల నుద్ధరించె నని శ్రీ వీరరాజు పంతులుగారు వ్రాసి యున్నారు.[33]

---

32. వేదాల తిరువేంగళాచారి. మహాభారతోపన్యాసములు. పుట 99

"అయితే నన్నయగ్రంథములలో కొన్ని యటనట శిథిలము లైనవి. కొన్ని యసలే పోయినవి. కొన్నియెడల కొంత కథాభాగమే నశించినది. తిరిగి యట్లు రచింపవలసిన యావశ్యకతయే కలిగినది. ఇట్లున్న యన్ని రకముల శిథి లాంశములను గూడ నన్నయకవితారీతి యటనట కొలదిగా మహాకవి ఎఱ్ఱనకు దోచినది. కన్పడినది. అట నిట్లు "తద్వచనయహాన్" ఇట్లు నన్నయరచన యగు నని యెన్నిక చేసి యతఁ డాశేషమును బూరించినాఁడు.

33. ఉన్నయ శబ్దమున కున్న అనే కార్థములలో నొకటి యగు అర్థము उन्नी–un-ni (ud-/ni) P. Ā. – nayati. to lead up wards, to raise, erect, redeem, rescue, help, freedom, bring up, *fill up a vessel by drawing (a fluid out of another vessel)* అని యిచ్చినదానినే గ్రహించి నారు. ఈ యర్థము ఋగ్వేదసంబంధి యైనది. ఆ భాగము Rv. ii, 14, 9;— A Sanskrit – English Dictionary. P. 193.

by *Monier Monier Williams*

'శేష' మనఁగా మిగిలినది యని సామాన్యముగా, సూటిగా వెంటనే వచ్చునట్టి యర్థము. దానిని కాదని యంతకన్న విశేషార్థము సాధింపవలయు నని ప్రతిచోటను బ్రయత్నించుట వృథాశ్రమయే యగును. కావున నీశేష శబ్దముచేత నెఱ్ఱన ఆరణ్యపర్వశేషమును, అనఁగా నన్నయభట్టారకుఁడు రచియింపఁగా మిగిలిన భాగమును రచించినట్లు విశదముగను సులభముగను నర్థ మగుచున్నది. కావున నిచట వాదబలమునకై విపరీతముగా నూహించి నన్నయకృత ఆరణ్యపర్వమునకు శిథిలతను బలవదానీతము గావించి యాభాగ ముల నెఱ్ఱయ పూరించె నని చెప్పుట యథార్థమును గాదు. యుక్తిసహజమును గాదు. ఇఁక రెండవది, 'ఉన్నయ' శబ్దమునకు 'ఉద్ధారణ' యను నర్థము సరి యైనదే. ఇందు వైపరీత్య మేదియు లేదు. కాని యీశబ్దమునందు నూతిలోని జలముల నుద్ధరించినట్లు యరణ్యపర్వములోని శిథిలభాగముల నుద్ధరించె ననియే చెప్పవలయు నను నిర్ణయము లేదు. కావున నారసింహపురాణమునందుఁ గానవచ్చు "ఆరణ్యపర్వశేషోన్నయ మంధ్రభాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వ హించితి" అను సీసపద్యపాదమును బురస్కరించుకొని నన్నయ వ్రాయఁగా శేషించిన ఆరణ్యభాగముయొక్క యుద్ధరణము సుజనుల కుత్సవము గలుఁగు నట్లు నిర్వహించె నని చెప్పవచ్చును.

ఇఁక నీ యున్నయ శబ్దమునకు ఉన్నతి, ఉద్ధరణ, ప్రగతి, కాపాడుట, స్వేచ్ఛ, ఊహ యను నర్థములే కాక "conclusion" ముగింపు అను నర్థము కూడ నొసఁగఁబడి యున్నది.[34] ఈ యర్థమును బురస్కరించుకొని నృసింహ పురాణమునం దెఱ్ఱనచేఁ బ్రాసస్థానమం దుపయుక్తమైన 'ఉన్నయ' పదము వ్యర్థపదము కాదు.[35] బహుశ్రుతులు, నానాపురాణకథావిస్తరవేదులు, నానానేక శాస్త్రార్థవిదు లైన మహానుభావులు ప్రాసస్థానమందు అలవోకగా వ్యర్థపదము వాడి రనుకటకంటె ప్రాజ్ఞుఁ డైన యెఱ్ఱయ తాను భారతారణ్యపర్వశేషపూరణ మును ఆంధ్రభాషయందు సుజనోత్సవ మొప్పగ నిర్వహించిన యాథార్థ్యము

---

34. उन्नय :- as, m, the act of leading up, elevating, hoisting, conclusion, induction, inference Sah.; Kas.

(S.E.D. P. 193).

35. ఆంధ్రకవితరంగిణి. పుట 86. "ఈ 'యున్నయ' శబ్దము ప్రాస స్థానమం దున్నది. ఎంతటి మహాకవి కైనను యతిప్రాసస్థానములయందు వ్యర్థపదములు పడుచుండుట సహజము."

నుచిత పదప్రయోగము చేత సూచించినాఁడు.

విద్వాంసులైన విమర్శకులు సయిత మీ పదమున కీయర్థము సులభముగా (సందర్భసహితమై) యర్థవ్యక్తి నొసఁగుచున్నను గ్రహింపనొల్లక వేఱొక యర్థమును గ్రహించి వాదించుట కేవలము వారివారి పాండిత్యములఁ బ్రకటించుటయే కాక వాదోపవాదములవలనఁ బ్రబలిన యహమహమిక యింకను సాహిత్యపులోతుల నరసి యుత్తమమైన విమర్శనాత్మక సాహిత్యము వెలువరింపఁజేయు తలంపుచేత కాఁబోలు.



ఇఁక విచిత్రవాగ్విభవశ్రీయుతుఁడైన యెఱ్ఱన ఆరణ్యపర్వశేషభాగమునం దెచ్చటను తనపేరుగ్గడింపకపోయినను, నన్నయయందుఁగల భక్తిమై దానాశ్వాసాంతగద్యసయిత మామహాకవి రచనవలెనే ప్రభువునకే యంకితముగాఁ జెప్పినను, కావ్య ప్రారంభమునం దనఁగా (అరణ్య. ప. 4-143. ప.) శరదృతువర్ణనావసరమున

"స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమల వైభవ జృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతర హంస సారస మధువ్రత నిస్వనముల్ సెలంగఁగాఁ
గరమువెలింగె వాసర ముఖంబులు శారదవేళఁ జూడఁగన్."[36]

అను పద్యమునందుఁ బ్రకృతమగు శరదృతువర్ణనావసరమునం దుపయుక్తమైనట్టి సూర్యవాచకమగు 'అరుణ' శబ్దమును నానార్థశక్తివలన ఎఱ్ఱన యని వ్యంగ్యమొనర్చుచుఁ దనపేరు సూచించినాఁడు. కావున అరణ్యపర్వమునందు నన్నయరచనమునుండి వేఱుసేయుచు మహాకవిఎఱ్ఱన పద్యాంశములిచటినుండియే స్ఫురించుచున్నవనుచు నీపద్య మొకధ్వనిప్రధానమైన విశిష్టభావమును స్ఫురింపఁ జేయుచున్నది. అందుకే ఇక్కడినుండి ఎఱ్ఱాప్రెగడకవిత్వమని తాళపత్రప్రతులందును, ముద్రిత ప్రతులందును గానవచ్చుచున్నది.

సంస్కృతారణ్యపర్వభాగమందున్న 11847 శ్లోకములలో నన్నయచే ననువదింపఁబడిన 7034 శ్లోకములను దీయగా మిగిలిన శ్లోకసంఖ్య 4813. మూలగ్రంథమందలి 4813 శ్లోకములకు, ఎఱ్ఱాప్రెగడ 1485 గద్యపద్యములను రచించినాఁడు. 1485 + (14 ఆశ్వాసాంతములు) = 1499. సాముదాయికముగాఁ బరిశీలించినచో మూఁడుశ్లోకముల కొకపద్యమువంతున రచించి

---

36. ఆ. ప. ఆ. 4–143

'శేష' మనఁగా మిగిలినది యని సామాన్యముగా, సూటిగా వెంటనే వచ్చునట్టి యర్థము. దానిని కాదని యంతకన్న విశేషార్థము సాధింపవలయు నని ప్రతిచోటను బ్రయత్నించుట వృథాశ్రమయే యగును. కావున నీశేష శబ్దముచేత నెఱ్ఱన ఆరణ్యపర్వశేషమును, అనఁగా నన్నయభట్టారకుఁడు రచియింపఁగా మిగిలిన భాగమును రచించినట్లు విశదముగను సులభముగను నర్థ మగుచున్నది. కావున నిచట వాదబలమునకై విపరీతముగా నూహించి నన్నయకృత ఆరణ్యపర్వమునకు శిథిలతను బలవదానీతము గావించి యాభాగ ముల నెఱ్ఱయ పూరించె నని చెప్పుట యథార్థమును గాదు. యుక్తిసహజమును గాదు. ఇఁక రెండవది, 'ఉన్నయ' శబ్దమునకు 'ఉద్దారణ' యను నర్థము సరి యైనదే. ఇందు వైపరీత్య మేదియు లేదు. కాని యీశబ్దమునందు నూతిలోని జలముల నుద్ధరించినట్లు యరణ్యపర్వములోని శిథిలభాగముల నుద్ధరించె ననియే చెప్పవలయు నను నిర్ణయము లేదు. కావున నారసింహపురాణమునందుఁ గానవచ్చు "ఆరణ్యపర్వశేషోన్నయ మంధ్రభాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వ హించితి" అను సీసపద్యపాదమును బురస్కరించుకొని నన్నయ వ్రాయఁగా శేషించిన ఆరణ్యభాగముయొక్క యుద్ధరణము సుజనుల కుత్సవము గలుఁగు నట్లు నిర్వహించె నని చెప్పవచ్చును.

ఇఁక నీ యున్నయ శబ్దమునకు ఉన్నతి, ఉద్ధరణ, ప్రగతి, కాపాడుట, స్వేచ్ఛ, ఊహ యను నర్థములే కాక "conclusion" ముగింపు అను నర్థము కూడ నొసఁగఁబడి యున్నది.[34] ఈ యర్థమును బురస్కరించుకొని నృసింహ పురాణమునం దెఱ్ఱనచేఁ బ్రాసస్థానమం దుపయుక్తమైన 'ఉన్నయ' పదము వ్యర్థపదము కాదు.[35] బహుశ్రుతులు, నానాపురాణకథావిస్తరవేదులు, నానానేక శాస్త్రార్థవిదు లైన మహానుభావులు ప్రాసస్థానమందు అలవోకగా వ్యర్థపదము వాడి రనుకటకంటె ప్రాజ్ఞుఁ డైన యెఱ్ఱయ తాను భారతారణ్యపర్వశేషపూరణ మును ఆంధ్రభాషయందు సుజనోత్సవ మొప్పగ నిర్వహించిన యాథార్థ్యము

---

**34.** उन्नय :– as, m, the act of leading up, elevating, hoisting, conclusion, induction, inference Sah.; Kas.

(S.E.D. P. 193).

**35.** ఆంధ్రకవితరంగిణి. పుట 86. "ఈ 'యున్నయ' శబ్దము ప్రాస స్థానమం దున్నది. ఎంతటి మహాకవి కైనను యతిప్రాసస్థానములయందు వ్యర్థపదములు పడుచుండుట సహజము."

నుచిత పదప్రయోగము చేత సూచించినాఁడు.

విద్వాంసులైన విమర్శకులు సయిత మీ పదమున కీయర్థము సులభముగా (సందర్భసహితమై) యర్థవ్యక్తి నొసఁగుచున్నను గ్రహింపనొల్లక వేఱొక యర్థమును గ్రహించి వాదించుట కేవలము వారివారి పాండిత్యములఁ బ్రకటించుటయే కాక వాదోపవాదములవలనఁ బ్రబలిన యహమహమిక యింకను సాహిత్యపులోతుల నరసి యుత్తమమైన విమర్శనాత్మక సాహిత్యమువెలవరింపఁజేయు తలంపుచేత కాఁబోలు.



ఇఁక విచిత్రవాగ్విభవశ్రీయుతుఁడైన యెఱ్ఱన అరణ్యపర్వశేషభాగమునం దెచ్చటను తనపేరుగ్గడింపకపోయినను, నన్నయయందుఁగల భక్తిమై దానాశ్వాసాంతగద్యసయిత మామహాకవి రచనవలెనే ప్రభువునకే యంకితముగాఁ జెప్పినను, కావ్య ప్రారంభమునం దనఁగా (అరణ్య. ప. 4-143. ప.) శరదృతువర్ణనావసరమున



"స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమల వైభవ జృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతర హంస సారస మధువ్రత నిస్వనముల్ సెలంగఁగాఁ
గరమువెలింగె వాసర ముఖంబులు శారదవేళఁ జూడఁగన్." 36

అను పద్యమునందుఁ బ్రకృతమగు శరదృతువర్ణనావసరమునం దుపయుక్తమైనట్టి సూర్యవాచకమగు 'అరుణ' శబ్దమును నానార్థశక్తివలన ఎఱ్ఱన యని వ్యంగ్యమొనర్చుచుఁ దనపేరు సూచించినాఁడు. కావున అరణ్యపర్వమునందు నన్నయరచనమునుండి వేఱుసేయుచు మహాకవిఎఱ్ఱన పద్యాంశము లిచటినుండియే స్ఫురించుచున్నవనుచు నీపద్య మొకధ్వనిప్రధానమైన విశిష్టభావమును స్ఫురింపఁ జేయుచున్నది. అందుకే ఇక్కడినుండి ఎఱ్ఱాప్రెగడకవిత్వమని తాళపత్రప్రతులందును, ముద్రిత ప్రతులందును గానవచ్చుచున్నది.

సంస్కృతారణ్యపర్వభాగమందున్న 11847 శ్లోకములలో నన్నయచే ననువదింపఁబడిన 7034 శ్లోకములను దీయగా మిగిలిన శ్లోకసంఖ్య 4813. మూలగ్రంథమందలి 4813 శ్లోకములకు, ఎఱ్ఱాప్రెగడ 1485 గద్యపద్యములను రచించినాఁడు. 1485 + (14 ఆశ్వాసాంతములు) = 1499. సాముదాయికముగాఁ బరిశీలించినచో మూఁడుశ్లోకముల కొకపద్యమువంతున రచించి

36. అ. ప. అ. 4-143

నట్లు తెలియుచున్నది. అనఁగా నన్నయకన్న నీతఁడు మూలము నెక్కువగా ననుసరించి వ్రాసినట్లు స్థూలముగాఁ జెప్పవచ్చును.

ఎఱ్ఱాప్రెగడచే రచింపఁబడిన యరణ్యపర్వశేష మాతనికతులకీర్తి కారణమైనది. ఏలయన మహాభారతము నాంధ్రీకరింపఁ దలంపుఁగొని ప్రారంభించిన నన్నయకాని తిక్కనగాని యా గ్రంథమును సంపూర్ణముగావించి యాంధ్రావళికి నొసఁగలేకపోయినారు. అమ్మహాభారతభారతి యారణ్యమునందు కొఱవడినది. అట్టియెడ ధీరవిచారుఁడైనయెఱ్ఱాప్రెగడ స్వార్థరహితుఁడై నన్నయరచనగా నారణ్యపర్వశేషమును బూర్తిగావించి పూజ్యమూర్తియైన యాంధ్రమహాభారతలక్ష్మిని సర్వాంగసుందర మొనరించినాఁడు. ఇంతవఱకు లోకహితరతులై నన్నయతిక్కనాదులు కావించిన మహాప్రయత్న మాంధ్రుల భాగ్యవశముచేత నారణ్యపర్వశేషరచనమువలన ఫలవంతమైనది. పదునెనిమిది భారతపర్వము లవిచ్ఛిన్నముగా నాంధ్రమహాభారతరూపమున వెలసినవి. కావుననె యాంధ్రజాతి కంతటికిఁ బ్రధానదైవతములై మూర్తిత్రయసంజ్ఞతో సంభావింపఁబడుచున్న హరిహరహిరణ్యగర్భు లట్లుగా నీ నన్నయ ఎఱ్ఱన తిక్కనలు సంభావింపఁబడి కవిత్రయ మని పేర్కొనఁబడినారు. ఆంధ్ర మహాభారత మొక్కప్రబంధముకాగా నాప్రబంధనిర్మాణమున నింతవఱకే హరి హిరణ్యగర్భుల స్థానమునందు స్థిరులైనవారు నన్నయ, తిక్కనలు. కడుమవడిన యారణ్యపర్వ శేషమును బూరించి శంభుదాసుఁడైన ఎఱ్ఱాప్రెగడ హరుని స్థానము నాక్రమించినాఁడు.

సంస్కృత మహాభారతములో శరద్వర్ణనము దాదాపు ఏడు శ్లోకములందున్నది. వర్షర్తువర్ణనము 9 శ్లోకములలో ముగింపఁబడినతరువాత 10వ శ్లోకము నుండి 16 శ్లోకములవఱకు శరద్వర్ణనమున్నది. [37]

"క్రౌంచహంససమాకీర్ణా శరత్ ప్రముదితా భవత్ ।
రూఢకక్షవనప్రస్థా ప్రసన్నజలనిమ్నగా ॥ 10
విమలాకాశనక్షత్రా శరత్ తేషాం శివాభవత్ ।
మృగద్విజసమాకీర్ణా పాండవానాం మహాత్మనామ్ ॥ 11
దృశ్యంతే శాంతరజసః క్షపా జలదశీతలాః ।
గ్రహనక్షత్రసంఘైశ్చ సోమేన చ విరాజితాః ॥ 12

37. మ. భా. మార్క. సమా. ప, అ. 182. 1-17. పుట. 1460 (గీతాప్రెస్ - ఘోరఖ్‌పూర్)

కుముదైః పుండరీకైశ్చ శీతవారిధరాః శివాః ।
నదీః పుష్కరిణీశ్చైవ దదృశుః సమలంకృతాః ॥ 13
ఆకాశనీకాశతటాం తీరవానీవార సంకులామ్ ।
బభూవ చరతాం హర్షః పుణ్యతీర్థాం సరస్వతీమ్ ॥ 14
తే వై ముముదిరే వీరాః ప్రసన్నసలిలాం శివామ్ ।
పశ్యంతో దృఢధన్వానః పరిపూర్ణాం సరస్వతీమ్ ॥ 15
తేషాం పుణ్యతమా రాత్రిః పర్వసంధౌ స్మ శారదీ ।
తత్రైవ వసతామాసీత్ కార్తికీ జనమేజయ ॥ 16

అని వర్ణింపఁ బడియున్న మూలశ్లోకములను దెనిఁగించుచు నన్నయ

ఉ॥ భూసతికిం దివంబునకుఁ బొల్పెసగంగశరత్సమాగమం
బాసకల ప్రమోదకరమై విలసిల్లె మహర్షిమండలో
పాసితరాజహంసగతి భాసిప్రసన్న సరస్వతీ కమ
బ్జాననశోభితంబగుచు నబ్జజుయానముతో సమానమై ॥

ఉ॥ శారదరాత్రు లుజ్జ్వలలసత్తర తారకహారపంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవ గంధబంధురో
దారసమీరసౌరభము దాల్చి సుధాంశువికీర్యమాణ క
ర్పూరపరాగపాండురుచిపూరములం బరిపూరితంబులై ॥ [38]

అను పద్యములను రచించినాఁడు. నన్నయకృతములైన రెండు పద్యములను బురస్కరించుకొని చూడగా మూలశ్లోకములభావము నంతటిని సాముదాయికముగా నొక్కచోఁ జేర్చి చెప్పినటులుగ శరత్సమాగమమువలని యానందమును మఱియు నా ఋతువుయొక్క ప్రధానలక్షణములఁ జెప్పినాఁడు. ఈ పద్యముల తరువాతనే కానవచ్చుచున్న 'స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోవు' యను పద్యములు మూలమునకు దాదాపు అనుకరణములై, అయ్యవి మఱియొక కవి రచితములని చెప్పకయే చెప్పుచున్నవి. ఇంతేకాక మూలమునందు శరత్తునకు ముందు వర్షర్తువును వర్ణించుచు

"ఛాదయంతో మహాఘోషాః ఖం దిశాశ్చ బలాహకాః ।
ప్రవవర్షు ర్దివారాత్రమసితాః సతతం తదా ॥" మ.భా.మా.స.ప అ. 182.2

అని ఉన్న శ్లోకము నాధారముగాఁ గొని యెఱ్ఱయ

---

38. ఆం. మ. భా. ఆ. ప. అ. 4. 141 – 142.

శా॥ దానాంభః పటలంబునం బృథుపయోధారావలిందాల్చి గ
ర్జానిర్ఘోషము బృంహితచ్ఛలనఁ బ్రచ్ఛాదించి ప్రావృట్పయో
దానీకంబు శరద్భయంబున నిగూఢాకారతన్‌డిగ్గ నాఁ
గా నొప్పారె మదోత్కటద్విరదసంఘంబుల్ వనాంతంబునన్.[39]

అను పద్యమును రచించినాఁడు. ఈ పద్యమందలి పై రెండు పాదములు దాదాపు సంస్కృత శ్లోకమున కనువాదమువంటివే. ఇఁక మిగిలిన రెండు పాదములను, శరత్తుయొక్క భయముచేఁ బయోదానీకంబు నిగూఢాకారతను దిగినట్లుగా ద్విరద సంఘములు వనాంతమున నొప్పారె ననిచెప్పి దానిని శరద్వర్ణనముగా భాసింపఁజేసినాడు.

## శ్రీకృష్ణుఁడు సత్యభామతోడఁ బాండవులయొద్దకు వచ్చుట

ఈ ఘట్టము మూలగ్రంథమునందు ఋతువర్ణనము తరువాతనేయున్నది. కామ్యకవనవాసులైన పాండవులదర్శించుటకు శ్రీకృష్ణుఁడు వచ్చినప్పటి దృశ్యమును వర్ణించుచు

"తథైవ బ్రువతస్తస్య ప్రత్యదృశ్యత కేశవః ।
శైబ్యసుగ్రీవయుక్తేన రథేన రథినాం వరః ॥
మఘవానివ పౌలోమ్యా సహితః సత్యభామయా ।
ఉపాయాద్ దేవకీపుత్రో దిదృక్షుః కురుసత్తమాన్ ॥[40]

అను శ్లోకములు మూలగ్రంథమునం దున్నవి.

ఈ భాగము ననువదించుచు నెఱ్ఱన

సీ॥ శైబ్యసుగ్రీవాది జవనాశ్వయుక్తమై
యాబద్ధ నూత్నరత్నాంశుపటల
భాసితంబై చారుపతగపతాకావి
భూషితగగనమై పొలుపుమిగులు
దివ్యరథంబున దేవకీసుతుఁడు ప్రి
యంబున సత్యభామాన్వితముగఁ
దరళసౌదామినీదామసముజ్జ్వల
ధారాధరోత్సంగతలమునందు

---

39. ఆం. మ. భా. అర. ఆ. 4. 144.
40. మ. భా. మా. సమా. ప. అ. 183 – 6, 7.

ఆ॥ శచియుఁదాను వెలుఁగు శతమన్యుఁడును బోలె
నరుగుదెంచె ఘనరథాంగ నేమి
విపుల ఘోషతాండవిత బర్హి శబ్దశ
బ్దాయ మానవన విభాగుఁడగుచు ॥

(అర. ప. ఆ. 4. 152).

అను సీసపద్యమును రచించినాఁడు.[41] ఈ పద్యమునం దెట్టిన మూలభావము నంతయుఁ దప్పక యనువదించుటయేకాక మూలశ్లోకములకు మెఱుగులు దిద్దినట్లుగా నా బద్ధనూత్న రత్నాంశుపటలభాసితమైన చారుపతగపతాకములను, తరళసౌదామినీదామసముజ్జ్వలధారాధరోత్సంగమును, రథాంగనేమి విపులఘోష తాండవిత బర్హిశబ్దశబ్దాయమానవనము నధికముగాఁజూపుచు వర్ణించినాఁడు.

మూలగ్రంథమునందు శ్రీకృష్ణుఁడు కామ్యకవనమును బ్రవేశించి పాండవులఁగాంచి కుశలప్రశ్నలఁ గావించిన యనంతరమాతఁడు ధర్మజుని బ్రశంసించుచు—

"ధర్మః పరః పాండవరాజ్యలాభాత్
తస్యార్థమాహుస్తప ఏవ రాజన్ ।
సత్యార్జవాభ్యాం చరతా స్వధర్మమ్
జితస్త్వయాయం చ పరశ్చ లోకః ॥
అధీతమగ్రే చరతా వ్రతాని సమ్యగ్ధనుర్వేదమవాప్య కృత్స్నమ్
క్షాత్రేణ ధర్మేణ వసూని లబ్ధ్వా సర్వే హ్యవాప్తాః క్రతవః పురాణాః॥
న గ్రామ్యధర్మేషు రతిస్తవాస్తి కామాన్న కించిత్ కురుషే నరేంద్ర।
నచార్థలోభాత్ ప్రజహాసి ధర్మం తస్మాత్ ప్రభావాదసి ధర్మరాజః॥
దానం చ సత్యం చ తపశ్చరాజన్ శ్రద్ధా చ బుద్ధిశ్చ క్షమాధృతిశ్చ।
అవాప్య రాష్ట్రాణి వసూని భోగానేషా పరా పార్థ సదా రతిస్తే॥
యదా జనౌఘః కురుజాంగలానాం
కృష్ణాం సభాయామవశామపశ్యత్।
అపేతధర్మవ్యవహారవృత్తం సహేత తత్ పాండవ కస్త్వదన్యః॥

ఈ శ్లోకములున్నవి.

ఎఱ్ఱాప్రెగడ యీ భాగము ననువదించుచు

41. భా. అ. ప. మూ. స. ప. అ. 183 – 16-20

"రాజ్యంబుకంటెను రాజేంద్ర ధర్మంబ
యిష్టమైయుండు నీ కెల్లనాఁడు
వేదవేదాంగ విదుఁడవు వివిధ యజ్ఞ
కర్తవైతి ధనుర్వేదకర్మఠుఁడవు
ధరణియెల్ల నేలెడి రాజధర్మమమర
సులభమయ్యె నీ కిహపరశోభనములు.

చ॥ దమమును సత్యయుక్తియును ధైర్యనిరూఢియు నిత్యతృప్తియున్
శమమును నీకునైజములు సన్మతినర్థవశంబుఁ గామలో
భములును బొందవ ట్లగుటఁ బార్థివకుంజర ధర్మరాజ నా
మనమునఁ ద్రిలోకపూజ్య మహిమం బొగడొందెద వెల్లకాలమున్.

అని పలికి వెండియు—

శా॥ ద్యూతవ్యాజమునన్ సభాంగణములో దుర్యోధనుం డట్లు దు
ర్నీతింగూరి యొనర్చినట్టి యఘముల్ నిష్కంప ధైర్యోన్నతిన్
జేతః స్ఫారుఁడవైన నీ కొకనికిం జెల్లెన్ సహింపంగ వి
ఖ్యాత క్షాంతులు లేరె ధార్మికులు నిక్కంబిట్టి రె యెవ్వరున్.''

అనుపద్యముల రచించినాఁడు.

ఈ పద్యములందు 'త్రిలోక పూజ్యమహిమన్ బొగడొందెద వెల్లకాలమున్, నిష్కంపధైర్యోన్నతిన్ జేతః స్ఫారుఁడవై, విఖ్యాతక్షాంతులులేరె ధార్మికులు నిక్కంబిట్టి' యను వాక్యములుదప్ప తక్కిన భాగమంతయు మూల శ్లోక భావమునకు యథాతథానువాద మని చెప్పవచ్చును.

ధర్మజు నీవిధముగాఁ బ్రశంసించి ద్రౌపదిఁగాంచి యామెకు నామె

---

**42.** శ్రీ మ. భా. వన. ప. మా. స. ప. అ. **183-23-31**

ప్రోవాచ కృష్ణా మపి యాజ్ఞసేనీం దశార్హభర్తా సహితః సుహృద్భిః।
దిష్ట్యా సమగ్రాసి ధనంజయేన సమాగతేత్యేవ మువాచ కృష్ణః॥
కృష్ణే ధనుర్వేదరతిప్రధానాస్త్వాత్మజాస్తే శిశవః సుశీలాః।
సద్భిః సదైవాచరితం సుహృద్భిశ్చరంతి పుత్రాస్తవ యాజ్ఞసేని॥
రాజ్యేన రాష్ట్రైశ్చ నిమంత్ర్యమాణాః పిత్రా చ కృష్ణే తవసోదరైశ్చ।
న యజ్ఞసేనస్య న మాతులానాం గృహేషు బాలా రతిమాప్నువంతి॥
ఆనర్తమేవాభి ముఖాః శివేన గత్వా ధనుర్వేదరతిప్రధానాః।
తవాత్మజా వృష్ణిపురం ప్రవిశ్య న దైవతేభ్యః స్పృహయంతి కృష్ణే॥

కుమారుల క్షేమవార్త నెఱుఁగఁజేయుచు నూఱడఁబలికిన శ్రీకృష్ణ సంభాషణ మంతయు మూలమునందుఁ బదునొకండు శ్లోకములలో రచింపఁబడియున్నది. ఒకటి రెండుశ్లోకముల తరువాత మూలమందున్న శ్లోకములు భావవైవిధ్యములేక చెప్పినవిషయమునే మఱిమఱి చెప్పినట్లున్నవి. ఈ ఘట్టమును దెనిఁగించు నప్పుడెఱ్ఱాప్రెగడ మూలశ్లోకభావమంతటిని సమీకరించినట్లుగ —

సీ॥ నీపుత్త్రు లేవురు నీరజలోచన
 యదుకుమారులుదారు ముదముతోడ
నను పమ స్నేహ సమాహృత హృదయులై
 కరిహయారోహణ పరతఁ దగిలి
యాడుచు వివిధశస్త్రాస్త్ర విశేషముల్
 గఱచుచు నొండెల్ల మఱచియున్న
వారు ప్రద్యుమ్నుండు వారికి దివ్యాస్త్ర
 జాతంబులెల్లను బ్రీతి నొసఁగెఁ
ఆ॥ దన్వి యా సుభద్ర తన పుత్త్రుకంటె నీ
 తనయులందుఁ గూర్మిఁ దనరఁ జేయు
నూఱడిల్లు మింక నుజ్జ్వలోన్నతులఁ బెం
 పారఁ గాల మనతి దూరమయ్యె.

అనుసీసపద్యము నొక్కటిమాత్రమే రచించినాఁడు. ఈపద్యమునందుఁ బ్రధానముగాఁ గృష్ణకుఁ గుమారులక్షేమవిధానమును దెలుపుచు వారితర బాలకులతోఁ గలసి సుఖమున్న రీతియేకాక, సవతితల్లియైనసుభద్రకూడ తన కొడుకుకంటె

---

యథా త్వమేవార్హసి తేషు వృత్తం ప్రయోక్తుమార్యా చ తథైవ కుంతీ।
తేష్వప్రమాదేన తథా కరోతి తథైవ భూయశ్చ తథా సుభద్రా।
యథానిరుద్ధస్య యథాభిమన్యోర్యథా సునీథస్య యథైవ భానోః।
తథా వినేతా చ గతిశ్చ కృష్ణే తవాత్మజానామపి రౌక్మిణేయః।
గదాసిచర్మగ్రహణేషు శూరాన స్త్రేషు శిక్షను రథాశ్వయానే।
సమ్యగ్ వినేతా వినయత్యతంద్రస్తాంశ్చాభిమన్యుః సతతం కుమారః॥
స చాపిసమ్యక్ప్రణిధాయశిక్షాం శస్త్రాణి చైషాం విధివత్ ప్రదాయ।
తవాత్మజానాం చ తథాభిమన్యోః పరాక్రమేస్తుష్యతి రౌక్మిణేయః॥
యదా విహారం ప్రసమీక్షమాణాః ప్రయాంతి పుత్రా స్తవ యాజ్ఞసేని।
ఏకైకమేషామనుయాంతి తత్ర రథాశ్చ యానాని చ దంతినశ్చ॥

నెక్కుడు గారవ మీ ద్రౌపదేయులపై నెఱపుటయు మఱియువారు తలిదండ్రుల కాఁపు లేక కేవలమాటపాటలచే మాత్రము గాలముగడుపక క్షత్రియుల కత్యంతప్రధానమైన శస్త్రాస్త్ర విద్యలయందు వారుఁ దగిన శిక్ష పొందుచున్న విషయమునుగూర్చి తప్పక వర్ణించినాఁడు

## ఎఱ్ఱాప్రెగడ భారతారణ్యపర్వమునందుఁ గానవచ్చు రామాయణ కథాభాగమును దెనిఁగించిన విధానము:

సంస్కృత మహాభారతమునం దీకథను మార్కండేయ మహర్షి ధర్మజునకుఁ జెప్పిన ట్లున్నది. ఈ గాథ 726 శ్లోకములలో వర్ణింపఁబడి యున్నది. మూలకారుఁ డీ కథాప్రారంభమునందే, పులస్త్యుని కుమారుఁడైన వైశ్రవణుని తపస్సు వరలాభములు, పులస్త్యుని యాగ్రహము, ఆతనికి రావణ కుంభకర్ణ విభీషణాదులు జన్మించుట వారలతపస్సు, వరలాభములు, రావణాసురుఁడు కుబేరునిపైదండెత్తి యాతని పుష్పకవిమానమును, లంకాపురిని స్వాధీనమొనర్చుకొని రాక్షసేశ్వరుఁడై యుండుట మున్నగు విధానమంతయు నతిత్వరితముగాఁ జెప్పివైచినాఁడు. ఆ విధముగనే రామాదులజననము, రామపట్టాభిషేక ప్రయత్నము, కైకేయికోరిక రామాదులవనగమనము, శూర్పణఖ రావణాసురునితో మొరవెట్టుకొనుట, కుపితుఁడైన రావణుఁ డామె కభయమిచ్చి మారీచుని సాహాయ్యముతో సీత నపహరించుట మున్నగు వృత్తాంతమంతయు శరవేగముతో నడిపింపఁబడినది. తరువాత జరిగిన కథావృత్తాంతము కొంత విపులముగా వర్ణింపఁబడినది. 726 శ్లోకములలో వర్ణితమైన రామాయణకథా వృత్తాంతమునంతయు నెఱ్ఱాప్రెగడ 314 గద్యపద్యములలో ననువదించినాఁడు. ఈ రామాయణ కథానువాద సందర్భమునం దవలంబించిన యెఱ్ఱాప్రెగడ యనువాద పద్ధతిని నిర్ణయించుటకొఱకై యీ కథయందలి మూఁడు సందర్భములు గైకొనఁబడినవి. (1) సాధారణముగా విషయనివేదనము గావించుచు కథ నతిత్వరితముగా సాగించిన ఘట్టము. (2) యుద్ధవర్ణనలు. (3) కరుణారస పూరితమైన యశోకవనియందలి సీతాదేవి చిత్రణము.

ఉదాహరణమునకు కథాప్రారంభమున మూలగ్రంథములో రావణాదులఁ గూర్చి చెప్పు నవసరమునందు

'సర్వేవేద విదః శూరాః సర్వే సుచరిత వ్రతాః ।
ఊషుః పిత్రా సహరతా గంధమాదన పర్వతే ॥

తతో వైశ్రవణం తత్ర దదృశుర్నరవాహనమ్।
పిత్రాసార్థం సమాసీన మృద్ధాయా పరమయా యుతమ్॥
జాతామర్షాస్తతస్తేతు తపసే ధృతనిశ్చయాః।
బ్రహ్మాణం తోషయామాసుర్ఘోరేణ తపసాతదా॥
అతిష్ఠదేకపాదేన సహస్రం పరివత్సరాన్।
వాయుభక్షోదశగ్రీవః పంచాగ్నిః సుసమాహితః॥
అధః శాయీ కుంభకర్ణో యతాహారో యతవ్రతః।
విభీషణః శీర్ణపర్ణమేక మభ్యవహారయన్॥
ఉపవాసరతిర్ధీమాన్ సదాజప్య పరాయణః।
తమేవకాల మతిష్ఠత్ తీవ్రంతప ఉదారధీః॥
ఖరః శూర్పణఖాచైవ తేషాం వైతప్యతాంతపః।
పరిచర్యాం చ రక్షాం చ చక్రతుర్హృష్ట మానసౌ॥
పూర్ణేవర్ష సహస్రేతు శిరశ్ఛిత్వా దశాననః।
జుహోత్యగ్నౌ దురాధర్షస్తేనాతుష్య జ్జగత్ప్రభుః॥

అని యున్నవి. ఈ శ్లోకముల ననువదించుచు నెఱ్ఱన

వ॥ ఆ రాక్షసకుమారులు దండ్రివలన నఖిలవేదవేదాంగ ధనుర్వేద పారగులై గంధమాదనగిరియందు సుఖంబుండి యొక్కనాఁ డతనికి మ్రొక్కవచ్చు వాని నధిక విభవ సమన్వితు వైశ్రవణుం జూచి తత్ప్రభావంబు దపోలబ్ధంబగుట విని జాతమత్సరులయి తాఁదును బితామహు నుద్దేశించి తపంబు సేయం దొడంగిరి తత్ప్రకారంబు వినుము.

తే॥ మండువేసవిఁ బంచాగ్ని మధ్యమున ఘ
నాగమంబున బయల నత్యంతతుహిన
సమయమున నీరియందు నిశ్చలతనిలిచి
దశముఖుఁడు వాయుభక్షుఁడై తపమొనర్చె.

మ॥ నియతాహారుఁడు నిర్జితేంద్రియుఁడు నై నిష్కంపవృత్తిన్ మహీ
శయనుండై వ్రతముల్ చరించె నధికేచ్ఛం గుంభకర్ణుండు ధై
ర్యయుతుండై ఘనుఁ డవ్విభీషణుఁడు పర్ణాహారవృత్తిన్ జపా
ధ్యయనాసక్తిఁ దపంబు సేసె మది నత్యంతంబు సంశుద్ధితోన్॥

---

43. మ. భా. వ. ప. మా. స. ప. అ. 275-13-20

వ॥ ఖరుండును శూర్పణఖయు వారికిం దగిన పరిచర్యలు సేయుచుండి రంత సహస్రవర్షంబులు నిండినం బంక్తివదనుండు దన మస్తకం బొక్కటి ఖండించి మండెడు నగ్నియందు వేల్చి[44]...... అని రచించినాఁడు.

ఇట్లే శ్రీరామచంద్రుని యువరాజుగాఁజేయఁ దలంపుఁగొని దశరథుఁడు దన మంత్రి పురోహితుల నడుగ వారు

"ప్రాప్తకాలం చతే సర్వేమేనిరే మంత్రి సత్తమాః॥
లోహితాక్షం మహాబాహుం మత్తమాతంగగామినమ్।
కంబుగ్రీవం మహోరస్కం నీలకుంచిత మూర్ధజమ్।
దీవ్యమానం శ్రియా వీరం శక్రా దనవరం రణే।
పారగం సర్వధర్మాణాం బృహస్పతి సమంమతా॥
సర్వానురక్త ప్రకృతిం సర్వవిద్యా విశారదమ్।
జితేంద్రియ మమిత్రాణామపి దృష్టి మనోహరమ్।
నియంతారమ సాధూనాం గోప్తారం ధర్మచారిణామ్॥
ధృతిమంతమనాధృష్యం జేతారమపరాజితమ్॥
పుత్రం రాజా దశరథః కౌసల్యా నందవర్ధనమ్।
సందృశ్య పరమాం ప్రీతిమగచ్ఛత్ కురునందనమ్॥

అని శ్రీరామచంద్రుఁ బొగడినారు. ఈశ్లోకముల ననువదించునప్పు డెఱ్ఱాప్రెగడ

సీ॥ అభినవ పద్మదళాక్షు న క్షీణవిస్తృతవక్షు నాజానుదీర్ఘబాహు
మధురస్మితానను మదగజగమనునారూఢ యౌవను నభిరూపతేజు
శ్రీరమణీయుఁ బ్రసిద్ధ యశోరమ్యు నిఖిల విద్యాగమ నిపుణ చిత్తు
నింద్రసమాను జితేంద్రియు ధర్మజ్ఞుఁ బౌరబాంధవజన ప్రార్థనీయు

ఆ॥ దుష్టనిగ్రహైకధుర్యు విశిష్ట సంరక్షణాభిలోలు రామభద్రుఁ
గులపవిత్రుఁ బెద్దకొడుకుఁగనుంగొని రాజవరుఁడు గరమురాగమెసఁగ.

అనివ్రాసినాఁడు. మూలశ్లోకములను మఱియు నీ పద్యములను బోల్చిచూడఁగా మూలశ్లోకభావము నంతటిని తప్పక యతి సమర్థుఁడై వర్ణించినాఁ డనియే చెప్పవచ్చును.

---

44. ఆం. మ. భా. ఆ. ప. ఆ. 6. వ. 276-279
45. మ. భా. వ. ప. మా. స. ప. అ. 277-8-14
46. ఆ. మ. భా. అ. ప. ఆ. 6. 295-96

ఉదాహరణమునకు మూలభారతమునందు ప్రహస్త ధూమ్రాక్షుల యుద్ధమును వర్ణించుచు

"తతః ప్రహస్తః సహసా సమభ్యేత్య విభీషణమ్।
గదయా తాడయా మాస వినద్య రణకర్కశః॥
సతయాభిహతో శ్రీమాన్ గదయా భీమవేగయా।
నాకంపత మహాబాహుర్హిమవానివ సుస్థిరః॥
తతః ప్రగృహ్యవిపులాం శతఘంటాం విభీషణః।
అనుమంత్ర్య మహాశక్తిం చిక్షేపాస్య శిరః ప్రతి॥
పతంత్యా సతయా వేగాద్ రక్షసో శనివేగయా।
హృతోత్తమాంగో దదృశే వాతరుగ్ణ ఇవద్రుమః॥
తం దృష్ట్వానిహతం సంఖ్యేప్రహస్తం క్షణదాచరమ్।
అభిదుద్రావధూమ్రాక్షో వేగేన మహతాకపీన్॥
తస్య మేఘోపమం సైన్యమాపతద్ భీమదర్శనమ్।
దృష్ట్వైవ సహసా దీర్ణారణే వానరపుంగవాః॥
తతస్తాన్ సహసా దీర్ణాన్ దృష్ట్వా వానరపుంగవాన్।
నిర్యయౌ కపిశార్దూలో హనుమాన్ మారుతాత్మజః॥
తం దృష్ట్వావస్థితం సంఖ్యేహరయః పవనాత్మజమ్।
మహత్యాత్వరయా రాజన్ సంన్యవర్తంత సర్వశః॥
తతః శబ్దో మహానాసీత్ తుములో లోమహర్షణః।
రామ రావణ సైన్యానామన్యోన్య మభిధావతామ్॥
తస్మిన్ ప్రవృత్తే సంగ్రామే ఘోరేరుధి కర్దమే।
ధూమ్రాక్షః కపిసైన్యం తద్ద్రావయా మాసపత్రిభిః॥
తం సరక్షోమహామాత్రమాపతంతం సపత్నజిత్।
ప్రతిజగ్రాహ హనుమాంస్తరసా పవనాత్మజః॥
తయోర్యుద్ధమాభూద్ ఘోరం హరిరాక్షస వీరయోః।
జిగీషతోర్యుధాన్యోన్య మింద్ర ప్రహ్లాదయోరివ॥
గదాభిపరి ఘైశ్చైవ రాక్షసో జఘ్నివాన్ కపిమ్।
కపిశ్చ జఘ్నివాన్ రక్షః సస్కంధ విటపైర్ద్రుమైః॥

---

47. మ. భా. వన. ప. మా. స. ప. అ 281-1-15

తత స్తమతికోపీనసాశ్వం సరథసారథిమ్।
ధూమ్రాక్షమవధీత్ క్రుద్ధో హనూమాన్ మారుతాత్మజః॥
తతస్తం నిహతం దృష్ట్వా ధూమ్రాక్షం రాక్షసోత్తమమ్।
హరయో జాతవిస్రంభాజఘ్నురన్యేచ సైనికాన్॥

అను శ్లోకములున్నవి. ఈ శ్లోకానువాద సందర్భమునం దెఱ్ఱన

ఉ॥ కృతహస్తుండు ప్రహస్తుఁ డాహవ కళాకేళీవిదగ్ధుండు ద
ర్పితుఁడై తాఁకె విభీషణుం గఁడకమై బెంపారి వారిద్దఱున్
శతథవ్యోగ్ర మయూరపత్త్రి విశిఖశ్రేణీశతచ్ఛన్నులై
ధృతినొప్పారిరి చిత్రవారిధర పంక్తిచ్ఛన్న శైలాకృతిన్.

చ॥ కదిసి ప్రహస్తుఁ డార్చి పరిఘంబు రయంబున నెత్తి భీకరో
న్మదకరిహస్త తాడనము మాడ్కి దలిర్పఁగ వ్రేసె నీసుమై
నదయత రావణానుజుని నాతఁడు వ్రేటున కించుకంతయుం
గదలక హేమకూటగిరికైవడి నిల్చియు దీర్ఘకోపుఁడై.

మ॥ శతఘంటా పరిభూషితంబును జగత్సంహార ఘోరానలో
ద్ధితకీలాసదృశంబునై మెఱయు శక్తింబూన్చి మంత్రించి యు
ద్ధతతేజుండు ప్రహస్తువైచిన వెసం దత్స్ఫూర్జ సంపాత పా
టితవక్షుండయి కూలె వాఁడు శతకోటిచ్ఛిన్న శైలాకృతిన్.

వ॥ ఇట్లు ప్రహస్తుండు పడినం దత్సైన్యంబులు విముఖంబు లగుటయు ధూమ్రాక్షుండు రోషతామ్రాక్షుం డగుచు నతినిబిడ బలాహకానీక భీకరంబై కాఱుకొనుచున్న నిశాచర చక్రంబుతో నురులంబఱతెంచినం జలించి బలీముఖ బలంబులు దుర్బలంబులై తొలంగినం జూచి యాంజనేయుం డజయ్యుండై నిల్చినం బెల్చన యెప్పటియట్ల యూథపతులుం గూడుకొని రప్పుడు.

సీ॥ అనిల తనూజ ధూమ్రాక్షరక్షిత సైన్య
యుగ్మంబునకు నయ్యెనుగ్ర సమర
మందు నిష్ఠుర చరణాఘాతముల డొల్లు
నరదంబులును శిలాహతులఁ దూలి
మొఱలు నేనుంగులుల తరు నుత్తాహతిఁ
ద్రెళ్ళు ఘోటకములుఁ దీవ్రనఖర
దంతక్షతంబుల దళితాంగులై
నేలఁబడి తన్నికొను వీరభటులు నగుచు

ఆ॥ అధిక శౌర్యసారు లగు కపివీరుల చేతనొచ్చి దైత్యసేనభీతిఁ
బఱచెఁ గొంత బెండువడియుండెఁ గొంత ధూమ్రాక్షు వెనుకకొదిగె
నంతఁ గొంత.

మ.స్ర. కని ధూమ్రాక్షుండు విశ్వగ్రసనరసలసత్కాల మేఘంబ పోలెన్
ఘనగర్జాఘోషమొప్పం గడఁగి శరశతాకల్పితాసార దుర్ద
ర్శనవీరారంభుఁ డైనన్ సకల హరిచమూసంఘమున్ విహ్వలంబై
చనెఁ దూలెం గూలె లావుం జలమును జెదరన్ సంగడిన్విచ్చి నొచ్చెన్.

తే॥ ఆతని యుద్ధతి సైఁపక యనిలసూనుఁ
డనిల వేగుఁడై పఱతెంచియార్చి తాఁకెఁ
బ్రధన మయ్యిద్దఱకు నుగ్రభంగి నమర
పతికి వృత్రునకుంజోలెఁ బ్రకటమయ్యె.

కం. పరిఘంబులు గదలును బె
క్కురుదుగ రక్కసుఁడు వైచె నమ్మారుతిపై
నురుగండ శైలములు ఘన
తరువులు హరివరుఁడు గురిసె దానవు మీఁదన్.

వ॥ ఇబ్భంగిఁ బెనంకువ సెల్లుచుండం గొండొక సేపునకు.

స్రగ్ధర. లంకాలుంటాకుఁ డుద్యల్లఘుతర గమనోల్లాసియై దానివీకం
బొంకం బేపారఁ జంచద్భుజ రచిత మహా భూరుహం బెత్తివేసెం
గింకన్ ధూమ్రాక్షు వాఁడుం గెడసెను వదనోద్గీర్ణ కీలాల ధారా
పంక ప్రాగ్భాగమగ్నాపఘన విఘటిత ప్రాణుఁడై యాహవోర్విన్॥

వ॥ ఇత్తెఱంగున ధూమ్రాక్షుండు దెగిన విదపఁ గపివరసైనికు లార్చి హనుమంతుని ననేక భంగులం బ్రస్తుతించుచు రఱిని చరులం గనుకనిందోలి నన్.........

అని రచించినాఁడు 48. ఈసందర్భమున మూలగ్రంథమందలి 15 శ్లోకములకు పదిపద్యముల రచించినాఁడు. ఈయుద్ధవర్ణనావసరమునందు కేవలము విభీష

48. ఆం. మ. భా. ఆది. ఆ. 6–82–92.

ఖుఁడు గొనిన శంతఘంటాయుతమైన శక్తినిమాత్రము తప్పక పేర్కొనినాఁడు, కాని తదితరవర్ణనములు మూలము ననుసరింపక తన యిచ్చవచ్చిన రీతి కావించినాఁడు. ఇంకొక విశేషము. మూలగ్రంథమునం దీధూమ్రాక్షహనుమల యుద్ధము, తొల్లి యింద్రప్రహ్లాదులు పోరిన ట్లున్నదని పోలిక చెప్పఁబడి యుండఁగా నెఱ్ఱన పరమ భాగవతోత్తముఁ డైన ప్రహ్లాదుని పేర్కొనక ప్రథన మయిద్దఱకు నుగ్రభంగి నమరపతికి వృత్రునకుం బోలెఁ బ్రకటమయ్యె' నని యుపమించి ప్రహ్లాదునిపాత్రయందుఁ దనకుఁగల గౌరవప్రపత్తిని ప్రదర్శించినాఁడు.

## రావణసంహారమున రాముని అస్త్రసంధానము

ఈసందర్భమునం దెఱ్ఱన దాదాపు మూలానుసారియై రచించినట్లు గానవచ్చుచున్నది. ఉదాహరణమునకు

"తతః సుపత్రం సుముఖం హేమపుంఖం శరోత్తమమ్॥ 25
తూణాదాదాయకాకుత్థ్సో బ్రహ్మాస్త్రేణయుయోజహ
తంబాణవర్యం రామేణ బ్రహ్మాస్త్రేణానుమంత్రితమ్॥ 26
జహృషుర్దేవగంధర్వా దృష్ట్వా శక్రపురోగమాః
అల్పావశేష మాయుశ్చ తతోఽమన్యంతరక్షసః॥ 27
బ్రహ్మాస్త్రోదీరణాచ్ఛత్రోర్దేవ దానవ కిన్నరాః
తతః ససర్జతం రామః శర మప్రతిమోజనమ్॥ 28
రావణాంతకరం ఘోరం బ్రహ్మదండమివోద్యతమ్
ముక్తమాత్రేణ రామేణ దూరాకృష్టేన భారత। 29
స తేన రాక్షసశ్రేష్ఠః సరథః సాశ్వసారథిః॥
ప్రజజ్వాల మహాజ్వాలే నాగ్నినాభి పరిప్లుతః॥[49] 30

అను శ్లోకము లున్నవి. ఈఘట్టమును వర్ణించునప్పు డెఱ్ఱన

సీ॥ కమనీయ కనక పుంఖప్రభాభాసియుఁ దీక్ష్ణముఖంబును దివిజయక్ష
ముని సిద్ధసాధ్య సమ్మోదావహంబునై విలసిల్లు బాణ మవ్వీరవరుఁడు
గైకొని బ్రహ్మాస్త్రకలిత మంత్రాభియుక్తంబుగా నొనరించి కార్ముకమున
సంధించి జగములు జయవెట్టఁజెచ్చెరఁ దివిచి యేయుటయును దీవ్రభంగి

49. మ. భా. అర. మా. స. ప. ఆ. 291, 25-30.

యాశరంబు గల్పాంతదహనంబ పోలెఁ బం_క్తికంఠుఁ బొదివి నీఱు
కర్చె నూతఘనరథరథ్య సమన్వితముగ నొక్క_మాత్రలోన.101

:డు50. ఈ సీసపద్యమున శ్రీరాముఁడు బ్రహ్మాస్త్రసంధానము
పై వేయుటయు మఱియు నాయస్త్రము రావణు నీఱుగావించుట
నందువలెనే వర్ణింపఁబడి యున్నవి. కాని మూలశ్లోకములలో
క్రమునందు బ్రహ్మాస్త్రసంధానము గావింపఁగనే దేవదానవ
వణున కాయువల్పావశేషమై యున్నదని తలఁచిన ట్లున్న
గాత్ర మనువదింపక వదలిపెట్టినాఁడు.

## అశోకవనమందలి సీత

కతమునందు సీతారావణ సంవాదఘట్టమును దీర్చినవిధానము :

భర్తృశోకార్తాం దీనాం మలినవాససం।
భ్యలంకారాం రుదతీం చపతివ్రతాం॥ 1
రుపాస్యంతీం సమాసీనాం శిలాతలే।
కామబాణార్తో దదర్శోపససర్ప చ॥ 2
వ గంధర్వ యక్ష కింపురుషైర్యుధి।
కవనికాం యయౌ కందర్పపీడితః॥ 3
ధరః శ్రీమాన్ సుమృష్ట మణికుండలః।
ల్యముకుటో వసంత ఇవ మూర్తిమాన్॥ 4
క్ష సదృశో యత్నాదపి విభూషితః।
త్య ద్రుమవద్ భూషితోపి భయంకరః॥ 5
స్తనుమధ్యాయాః సమీపే రజనీచరః।
హిణీ మేత్య శనైశ్చర ఇవ గ్రహః॥ 6

రవిశేషముల వర్ణనమున్నది. ఈసందర్భమునం దెజ్జాప్రెగడ

దేవదానవగంధర్వాది భూతవర్గంబులనెల్ల జయించియుం
వారింపనోపక యాక్షణంబ దివ్యమాల్యాంబరాభరణ
రతలం బైన కల్పపాదపంబునుం బోలె నొప్పియుఁ దన

మా. స. ప. ఆ. 291, 25—30.

ఖుఁడు గొనిన శంతఘంటాయుతమైన శక్తినిమాత్రము తప్పక పేర్కొనినాఁడు, కాని తదితరవర్ణనములు మూలము ననుసరింపక తన యిచ్చవచ్చిన రీతి కావించినాఁడు. ఇంకొక విశేషము. మూలగ్రంథమునం దీఘాత్రమాక్షహనుమల యుద్ధము, తొల్లి యింద్రప్రహ్లాదులు బోరిన ట్లున్నదని పోలిక చెప్పఁబడి యుండఁగా నెఱ్ఱన పరమ భాగవతోత్తముఁ డైన ప్రహ్లాదుని పేర్కొనక 'ప్రథన మయిద్దఱకు నుగ్రభంగి నమరపతికి వృత్రునకుం బోలెఁబ్రకటమయ్యె' నని యుపమించి ప్రహ్లాదునిపాత్రయందుఁ దనకుఁగల గౌరవప్రపత్తిని బ్రదర్శించినాఁడు.

## రావణసంహారమున రాముని అస్త్రసంధానము

ఈసందర్భమునం దెఱ్ఱన దాదాపు మూలానుసారియై రచించినట్లు గాన వచ్చుచున్నది. ఉదాహరణమునకు

"తతః సుపత్రం సుముఖం హేమపుంఖం శరోత్తమమ్॥ 25
తూణాదాదాయకాకుత్స్థో బ్రహ్మాస్త్రేణయుయోజహ
తంబాణవర్యం రామేణ బ్రహ్మాస్త్రేణానుమంత్రితమ్॥ 26
జహృషుర్దేవగంధర్వా దృష్ట్వా శక్రపురోగమాః
అల్పావశేష మాయుశ్చ తతోఽమన్యంతరక్షసః॥ 27
బ్రహ్మాస్త్రోదీరణాచ్ఛత్రోర్దేవ దానవ కిన్నరాః
తతః ససర్జతం రామః శర మప్రతిమోజనమ్॥ 28
రావణాంతకరం ఘోరం బ్రహ్మదండమివోద్యతమ్
ముక్తమాత్రేణ రామేణ దూరాకృష్టేన భారత। 29
స తేన రాక్షసశ్రేష్ఠః సరథః సాశ్వసారథిః॥
ప్రజజ్వాల మహాజ్వాలే నాగ్నినాభి పరిప్లుతః॥[49] 30

అను శ్లోకము లున్నవి. ఈఘట్టమును వర్ణించునప్పు డెఱ్ఱన

సీ॥ కమనీయ కనక పుంఖప్రభాభాసియుఁ దీక్ష్ణముఖంబును దివిజయక్ష
ముని సిద్ధసాధ్య సమ్మోదావహంబునై విలసిల్లు బాణ మవ్వీరవరుఁడు
గైకొని బ్రహ్మాస్త్రకలిత మంత్రాభియుక్తంబుగా నొనరించి కార్ముకమున
సంధించి జగముల జయవెట్టఁజెచ్చెరఁ దివిచి యేయుటయును దీవ్రభంగి

49. మ. భా. అర. మా. స. ప. ఆ. 291, 25-30.

ఆ॥ గడఁగి యాశరంబు గల్పాంతదహనంబ పోలెఁ బంక్తికంఠుఁ బొదివి నీఱు
గా నొనర్చె నూతఘనరథరథ్య సమన్వితముగ నొక్కమాత్రలోన.101

అని రచించినాఁడు[50]. ఈ సీసపద్యమున శ్రీరాముఁడు బ్రహ్మాస్త్రసంధానము గావించి రావణుపై వేయుటయు మఱియు నాయస్త్రము రావణు నీఱుగావించుట యును మూలమునందువలెనే వర్ణింపఁబడి యున్నవి. కాని మూలశ్లోకములలో రాముఁడు కార్ముకమునందు బ్రహ్మాస్త్రసంధానము గావింపఁగనే దేవదానవ కిన్నరాదులు రావణున కాయువల్పావశేషమై యున్నదని తలఁచిన ట్లున్న విషయమును మాత్ర మనువదింపక వదలిపెట్టినాఁడు.

## అశోకవనమందలి సీత

మూలభారతమునందు సీతారావణ సంవాదఘట్టమును దీర్చినవిధానము :

"తతస్తాం భర్తృశోకార్తాం దీనాం మలినవాససం।
మణిశేషాభ్యలంకారాం రుదతీం చ పతివ్రతాం॥ 1
రాక్షసీభి రుపాస్యంతీం సమాసీనాం శిలాతలే।
రావణః కామబాణార్తో దదర్శోపససర్ప చ॥ 2
దేవ దానవ గంధర్వ యక్ష కింపురుషైర్యుధి।
అజితో౽శోకవనికాం యయౌ కందర్పపీడితః॥ 3
దివ్యాంబర ధరః శ్రీమాన్ సుమృష్ట మణికుండలః।
విచిత్ర మాల్యముకుటో వసంత ఇవ మూర్తిమాన్॥ 4
స కల్పవృక్ష సదృశో యత్నాదపి విభూషితః।
శ్మశాన చైత్య ద్రుమవద్ భూషితోపి భయంకరః॥ 5
సతస్యా స్తనుమధ్యాయాః సమీపే రజనీచరః।
దదృశే రోహిణీ మేత్య శనైశ్చర ఇవ గ్రహః॥ 6

అని రావణుని ఆకారవిశేషముల వర్ణనమున్నది. ఈసందర్భమునం దెట్టాప్రెగడ

వ॥ తాను దేవదానవగంధర్వాది భూతవర్గంబులనెల్ల జయించియుం గందర్పదర్పంబు వారింపనోపక యాక్షణంబ దివ్యమాల్యాంబరాభరణ భూషితుండై సంచారతలం బైన కల్పపాదపంబునుం బోలె నొప్పియుఁ దన

50. మ. భా. అర. మా. స. ప. ఆ. 291, 25—30.

అను శ్లోకములున్నవి. ఈ భాగము వాల్మీకి రామాయణమునకన్నఁ గొంత ముగా నున్నది. సీతారావణ సంవాదము తరువాత వాల్మీకమునందు స్వప్నవృత్తాంత మున్నది. భారతమునందు త్రిజటా స్వప్నవృత్తాంతము వాతనే రావణ సీతా సంవాదము గానవచ్చుచున్నది. ఇఁక భారతకఁ ననుసరించియే యెఱ్ఱన యనువాదము గావించినాఁడు. అయ్యు సీతఁ డీభ నతిసంక్షేపముగా విషయనివేదన మొనర్చుటకై మాత్రమే వర్ణించిన ముప్పది శ్లోకము లున్న ఈ భాగమును 7 గద్యపద్యములలో వర్ణించిన ఉదాహరణమునకు

క॥ ఏల మదిరాక్షి వలవని
జాలింబడి నవసె దవుల సద్భూషణ లీ
లాలంకృతవైననుఁ గృప
నేలికొనంగదపె వేయు నేటికి నింకన్. ఆ. 6-

చ॥ అనిమిష యక్షరాక్షస వియచ్చర కిన్నర పన్నగాసురాం
గనలఁ గరంబు చిత్తమునఁ గైకొనకే ననురాగ లీలమై
నిను మది నాదరించు టిది నీదగు భాగ్యము గాదె యింతయున్
వనిత యెఱుంగవైతి గరువంపు విచారము లేల నీయెడన్॥

ఉ॥ రాముఁడనంగఁ బేర్మియును రాజ్యముఁ గోల్పడి కానలోన దుః
ఖామయమగ్నుఁడైన యొక యల్పమనుష్యుఁడు వానిపైఁ గడుం
బ్రేముడి సేయుచున్ వగపు పెల్లునఁ జిత్తము దల్లడిల్లఁగా
నీమెయి నుండు నీయునికి యేసుఖమంద్రు లతాంగి చెప్పుమా॥

వ॥ ఏను సకలలోకేశ్వరుండ నాకుం గింకరులై పదునాలుగు క
నిశాచర భటులును, నిరువదియెనిమిదికోట్లు రాక్షసులును నెనుబదియ (యేఁబదియాఱు) కోట్లు రాక్షసులును వర్తిల్లుదురు. నిఖిల ధనాధ్యక్షుం డఁ యక్షేశ్వరుండు నాయగ్రజుండు, బ్రహ్మసమానుం డగు విశ్రవసుండు మదీ జనకుండు. కుబేరునకు వినోదపాత్రంబు లైన గంధర్వాప్సరోగణంబులు న సేవించుఁ బంచమ లోకపాలుండని నన్నుఁ ద్రిభువనంబులుఁ గీర్తించు. భ భోజ్యాది వస్తువులును సురేశ్వర గృహంబునం దెట్లట్లనాగృహంబున నక్షయ

51. మ, భా. అర. VI. 281-1-30.

లిట్టి నావిభవం బింతటికిని మదీయ జీవితంబునకు నధీశ్వరివై సుఖంబున భోగింపు మనిన విని వైదేహి క్రోధశోకవ్యాకులహృదయ యగుచు వాని దెసం జూడక యొక్క తృణాంకురం బుపలక్షించి యిట్లనియె. 407.

సీ॥ అకట పరాంగన నబలఁ బతివ్రతఁ
బరికింపఁగా మర్త్యభామ నేను
రాక్షసుండవు నీవు రాగంబు మదినించు
కయు లేని నాదు సంగమమునందుఁ
గలిగెడు నట్టి సౌఖ్యంబెంత యదియును
గాక యాద్యుండైన కమలగర్భు
పౌత్రుఁడ నని లోకపాలతుల్యుఁడ నని
హరసఖుండైన ధనాధినాథు

తే.వె. భ్రాత నని భవత్ప్రభావంబు సెప్పితి
విట్టి నీవు ధర్మువెఱుఁగి దురిత
వర్తనంబు విడువవలదె సిగ్గేది యి
ప్పగిదిఁ బ్రల్లదములు వలుకఁ దగునె.'

వ॥ అని పలికి జానకి యుత్తరీయ సంవృత వదనయై యతి కరుణం బగా నేడ్చిన నద్దురాత్ముండు వెండియుఁ గొన్ని దుర్వచనంబు లుపచరించి యనంతరంబ యంతర్ధానంబు నొందె న ప్పొలతియు నెప్పటియట్ల రాక్షసీ రక్షితయై యుండె'' నని రచించినాఁడు[2].

ఈ సందర్భమునం దెఱ్ఱాప్రెగడ ''రాముఁ డనంగఁ బేర్మియును'' అను పద్యమును మూలాతిరిక్తముగను యథా వాల్మీకముగను రచించినట్లు గానవచ్చు చున్నది. ఇఁక మూలమందు రావణాసురుఁడు దన వైభవముల నేకరువు పెట్టుచు దాను మధుపాన గోష్ఠియందుండఁగాఁ దన యన్నయైన కుబేరుని సేవించినట్టులుగనే గంధర్వ సహితమైన అప్సరోగణము సేవించుచుండు నని చెప్పిన శ్లోక మెఱ్ఱన యనువదింపలేదు.

---

2. ఆం. మ. భా. అర. VI. 404 – 409.

## 2. రామాయణము

ఎఱ్ఱయకృతములైన గ్రంథములలో నలభ్యమైన గ్రంథము రామాయణము. నిజమున శ్రీరామాయణమే లభించియుండినచో నెఱ్ఱనకృతుల పౌర్వాపర్యములఁ బురస్కరించుకొని యిన్ని వాదోపవాదములు బయలుదేరి యుండెడివికావు. ఎఱ్ఱనయే స్వయముగా

> ''నా తమ్ముండు ఘనుండు మల్లరథినీ నాథుండు నిన్నాతతో
> త్కీర్ణోదన్ సముపేతుఁ జేసి యెలమిం జేపట్టి మాకిచ్చుటం
> జేతోమోద మెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ
> ఖ్యాతిం బొందితి నింక నేను వినియన్ గావ్యామృతాస్వాదనన్—''
>
> హరి. పూ. భా. ఆ. 1. 39

అని రచించుటచేత నెఱ్ఱన హరివంశమునకుఁ బూర్వము రామాయణమున దప్పక రచించెనని చెప్పవచ్చును.

కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమునందు పలు తావుల ననేక పద్యముల నుద్ధరించి యయ్యవి యెఱ్ఱాప్రెగడ రామాయణమునుండి యని పేర్కొనినాఁడు. ఈ యాధారమును బురస్కరించుకొని తిమ్మకవికాలమ నాఁటి వఱకు ఎఱ్ఱన రామాయణము ప్రచారమునందు దున్నట్లు తెలియుచున్నది ఈ కూచిమంచి తిమ్మకవియే కాక గణపవరపు వేంకటకవి యను నాతఁడు కూడ ప్రయోగరత్నాకర మను లక్షణ గ్రంథమునందు

1) క. 'ధాత్రీసుర సేవారతి'— అను కందమును

2) సీ. 'బాలసుధాంశునిటాలుని నవసుధా'— యను సీసమును

3) క. 'ఆ దశరథసూనుండు'—అను మఱియొక కందపద్యమును నుద్ధరించి అయ్యవి యెఱ్ఱాప్రెగడ సంక్షేపరామాయణమునుండి యని సూచించినాఁడు. ఈ లక్షణకారుల ననుసరించి యెఱ్ఱాప్రెగడ రామాయణ గ్రంథమును రచించినాఁ డను విషయము ధ్రువపడుటయే కాక గణపవరపు వేంకటకవి ననుసరించి యారామాయణమునకు సంక్షేపరామాయణ మను పేరున్నట్లుగూడ విదితమగుచున్నది. ఎఱ్ఱాప్రెగడ రామాయణమునకు సంక్షేపరామాయణ మను పేరు కవియే యాగ్రంథమునకు స్వయముగా నుంచెనా? లేక యాగ్రంథమంద

సంక్షేప రచనావిధానమును బురస్కరించుకొని లక్షణకారుఁ డట్లు పేర్కొనెనా? తెలియవచ్చుట లేదు. ఏలయన నెఱ్ఱాప్రెగడవంశీయుఁ డైన చెదలువాడ మల్లన యను కవి విప్రనారాయణ చరిత్రలో నెఱ్ఱనను గూర్చి వ్రాయుచు

సీ॥ ప్రతిభతో నారణ్యపర్వశేషముఁ జెప్పెఁ
గవులకుఁ జెవుల పండువులు కాఁగ
వల్మీక భవు వచోవైఖరి రామాయ
ణంబు నాంధ్ర ప్రబంధంబుఁ జేసె.

అని రచించినాఁడు. మల్లనకృతమైన యీ పద్యమును బురస్కరించుకొని చూడఁగా నెఱ్ఱన వాల్మీకిమహర్షి ననుసరించియే రామాయణమును రచించినట్లు తెలియుచున్నది, కాని దాని నీతఁడు సంక్షేపము గావించినట్లుకాని ఆ రామాయణమునకు సంక్షేపరామాయణ మను పేరున్నట్లుకాని తెలియవచ్చుటలేదు.

కేవలము గణపవరపు వేంకటకవి మాత్రమేకాక యానందరంగకవి కూడతన ఆనందరంగరాట్ఛందమున వర్గప్రాసమున కుదాహరణముగా

క. ఆదశరథ సూనుండు ప
యోధిజలంబింకఁ జేసి యొకశరమునఁగ
వ్యాదవిభుఁ దునివి; సీతను
మోదంబునఁ జేకొనె సురపుంగవు లెన్నన్.

ఆ. రం. ఛ. ఆ. 3. 65.

అను పద్యము నుదాహరించి అయ్యది యెఱ్ఱాప్రెగడ సంక్షేప రామాయణమునుండి యని పేర్కొనినాఁడు. ఈ విధముగా నెఱ్ఱన రామాయణ గ్రంథస్వరూపమును గూర్చియు మఱియు నా గ్రంథమునకున్న నామమును గూర్చియు సందేహము లున్నవి. పరస్పరము విరుద్ధముగానున్న పైవిషయము లన్నింటిని సమన్వయపఱిచి యొకనిర్ణయ మూహింపవచ్చును. ఎఱ్ఱాప్రెగడకు పూర్వమే రచితమై యెఱ్ఱయ కాలమునాఁడును విద్వల్లోకమునందుఁ బ్రచారములో నుండినది భాస్కరరామాయణము. ఇది బృహద్ (సమగ్రమై) రూపమున నుండుటచే నంతకన్న విస్తృతియందు చిన్నదిగానున్నదియగు దానిని సంక్షేపరామాయణ మని వ్యవహరించియుందురు. ఈ వ్యవహారనామఁ మెఱ్ఱన రామాయణమునకు లక్షణాభిధేయముకాఁగా లక్షణకారు లట్లు ఎఱ్ఱాప్రెగడ సంక్షేపరామాయణమునుండి యని పేర్కొనియుందురని చెప్పవచ్చును. ఇది కేవలము ఊహాకల్పితమైన నిర్ణయమేకాని బలవత్తరములైన యాధారములవలన నిర్ణయించిన సత్యము మాత్రము కాదు.

శ్రీ వేటూరి శివరామశాస్త్రిగారు హరివంశ పీఠికలో "ఆనెగొందిలో దొరికిన యొక భాస్కరరామాయణపుఁ దాళపత్త్రప్రతిలో నారణ్యకాండమున నెఱ్ఱాప్రెగడ కృతములుగాఁ గొన్ని పద్యములు కానవచ్చినవని డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు గుర్తించిరి" అనివ్రాసి

1) ఉ. ఆనెఱజోదు కేలుదొనకైనిగుడించుట యమ్ము పూర్వసం

2) స్రగ్ధర. కరిణీయానంబు నవ్వున్గతి నవలతికాకారమున్ చంద్రున్.

3) చ. అలినిభవేణి చంద్రసదృశానన యుత్పలపత్రనేత్రకో

అను నీపైమూఁడుపద్యముల నుద్ధరించినారు. ఇంతేకాక

ఉ॥ చువ్వనమేనువంచి రవి సోఁకగఁ దోక విదిల్చి పాదమ

అనుపద్యము నుద్ధరించి "ఈ పద్యము ఎఱ్ఱన రామాయణము లోనిదా? యెప్పుడో శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ నోటుబుక్కులో వ్రాసికొనిర అని సూచించినారు. తరువాత నా విధముగనె వావిళ్ళవారి భాస్కరరామాయణపు ముద్రితప్రతి లోని "త్రెవ్వెడు గంటలం గురుపు దేజెడు నెత్తురు మున్నయే" అను పద్యము 'ఎఱ్ఱాప్రెగడవారి పద్యమను ప్రతీతి' అను జ్ఞాపికతోనుండుటయును సూచించినారు. ఈ విధముగ భాస్కరరామాయణమునకును ఎఱ్ఱాప్రెగడ రామాయణమునకును మధ్యనున్న యీ సంబంధము మఱియుఁ దారుమారు విధానముగూడ నింతవఱ కూహించిన యూహకు బలము చేకూర్చుచున్నది.

ఇంతేకాక యితరగ్రంథములతోఁ గలిపి కొన్ని రామాయణకథలుండుటయు నయ్యవి శైలినిబట్టి యెఱ్ఱన కృతములుగా నూహించుట నాయాధారముపై ఎఱ్ఱన రామాయణగ్రంథ స్వరూపము నూహించుటయు జరుగుచున్నది. కాని నిజమున కాగ్రంథస్వరూపము నెఱిఁగి ప్రత్యక్షముగా నాగ్రంథమునుండియే పద్యముల నుద్ధరించినవారు నేఁడొక్కరునులేరు. ఇఁక నెఱ్ఱాప్రెగడ కృత హరివంశమందునుభారతారణ్యపర్వమందును ఆయాసందర్భములలోరామాయణ కథాకథనావసర మేర్పడినది. ఆయాతావులందు రామాయణకథా వృత్తాంత

సంక్షిప్తరూపమునందుఁ గానవచ్చుచునేయున్నది. ఏగ్రంథమునందైనను రామాయణకథాప్రసంగము వచ్చినప్పుడెల్లను ఎఱ్ఱన కవిమతములైన యా కథాపాత్రలయం దధికాభినివేశమును బ్రకటించి రచనగావించిన విధానమును విజ్ఞులెఱిఁగియే యున్నారు. కావున నెఱ్ఱన యాగ్రంథము నత్యంతమనోజ్ఞముగాఁ దీర్చియుండెననుటలో సందేహములేదు. ఏది యెట్లున్నను ఆ గ్రంథము లభించువఱకు నిద మిత్థమని యేనిర్ణయము సేయలేక యిట్టియూహలతో గడుపవలయుఁ గదా!

## హరివంశము

మహాభారతము పంచమవేదమైయొప్పఁగా హరివంశము వేదశిఖయై దీపించుచున్నది. పారాశర్యుఁడైనఁ వేదవ్యాసమహర్షి లోకముల ననుగ్రహించు తలంపుతోఁ బ్రయత్నించి పంచిపెట్టిన సుధాప్రసాదము శ్రీమన్మహాభారతము. ఈమహాభారతమునందు సూక్ష్మముగను వ్యంగ్యముగను శ్రీకృష్ణుని చరిత్రము వివరింపఁబడఁగా నీహరివంశమందు విపులముగను వాచ్యముగను మహామహిమోపేతమైన యా శ్రీహరి దివ్యచరిత్రము వర్ణింపఁబడినది. ఇంతేకాక యింతవఱకు భారతాంతర్గత విషయములగు మహాభారతయుద్ధము, సర్వక్షత్రియసంహారాదులు పఠించుటవలన పాఠకుని మనస్సునం దేర్పడునట్టి నిర్వేదవైరాగ్యములను ద్రోసిరాజని తిరిగి యాతని మనస్సు నూతనోత్సాహముతో శోభిల్లునట్లుగను కావ్యమును మంగళాంతము గావించుట కనువుగను ప్రజాతంతువుతెగి నష్టమైపోక సాగివచ్చుట కర్థముగను ఉండున ట్లీహరివంశము రచింపఁబడినది. కావుననే యిందు సర్వమంగళముల కాకరుఁడు, సర్వపుణ్యములప్రోవు, అద్వైతస్వరూపి, లీలామానుషవిగ్రహుఁడైన శ్రీకృష్ణుని దివ్యచారిత్రము వర్ణింపఁబడినది. అందును ఒకప్పుడు సంహారము గావింపఁబడిన సృష్టి కభివర్ధనంబుఁ గోరి తిరిగి ప్రయత్నము సలుపవలయు నన్నట్లుగ నీగ్రంథమునందు లోకమోహనమూర్తియైన శ్రీకృష్ణప్రాదుర్భావము, ఆదివ్యశిశువు బాలకేళి, ఆగడములు, క్రీడలు, లీలావిహారములు, శక్తిసామర్థ్యప్రకటనము లన్నియు వింతవింతలుగా నభివర్ణింపఁబడినవి. కావుననే అనపత్యులగువా రీగ్రంథమును విధివిధానములతోఁ బఠించిన సంతానవంతు లగుదురను నమ్మకమున్నది. ఆవిశ్వాసముతోడనే నేఁటికి నీ గ్రంథము పారాయణము సేయఁబడుచున్నది.

నని కావించిన యభయప్రదానముతో ముగిసినది. ఈపర్వమందు 54 అధ్యాయ ములు మఱియు 3030 శ్లోకములు నున్నవి.

విష్ణుపర్వము : కంసునొద్దకు నారదుఁడువచ్చి యా కంసునిపాపము పండుటకొఱకుఁ గావలసిన విషము నొసంగుటతోఁ బ్రారంభింపఁబడినది. ఇందు దేవకీదేవి యష్టమ గర్భమునుండి శ్రీకృష్ణుఁ డవతరించుట, యోగమాయ కంసునిచేఁ బీడింపఁబడి శపించుట, వసుదేవునిచేఁ గొనిపోఁబడిన శ్రీకృష్ణుఁడు నందయశోదాదులచేఁ బుత్ర నిర్విశేషముగాఁ బెంపఁబడుట, దిన దిన ప్రవర్ధమానులగుచున్న బలరామకృష్ణుల బాల్యక్రీడలు, మఱియు గోవర్ధ నోద్ధరణ, కాళియమర్దన, ప్రలంబాసురవధాదులగు అద్భుతకృత్యములే కాక యాయన్నదమ్ము లిరువురు బలసంపన్నులై మధురఁ బ్రవేశించి కంసవధ గావించి, కాలయవన, దంతవక్త్రసృగాలాదిరాజవధ గావించుట, శ్రీకృష్ణుఁడు రుక్మిణీదేవి మున్నగు అష్టమహిషుల వివాహమగుట అను విషయములతో హరి వంశ పూర్వభాగము సమాప్తమైనది.

విష్ణుపర్వము 82వ అధ్యాయము బలదేవమాహాత్మ్యముతో హరివంశము ఉత్తరభాగము ప్రారంభమైనది. ఇందు నరకాసురవధ, పారిజాతాపహరణము, పుణ్యకవ్రతము, భానుమతీహరణము, నికుంభవధ, వజ్రనాభవధ, ప్రభావతీ ప్రద్యుమ్న వివాహము, బలదేవాహ్నికము, వాసుదేవప్రభావము, బాణాసురో పాఖ్యానము, ఉషానిరుద్ధచరిత్రము మున్నగునవి వర్ణింపఁబడినవి. విష్ణుపర్వ మంతయు 128 అధ్యాయములలో 7820 శ్లోకములతో పూరింపఁబడినది. ఈ పర్వము లోకమోహనములైన కథలకు కూడలిపట్టువంటిది.

భవిష్యపర్వము : ఈ పర్వమున రాఁబోవు కలియుగమును గూర్చియు, జపతపోయోగాదులను గూర్చియు, వర్ణాశ్రమధర్మాదులను గూర్చియు ననేక రహస్యములు, విశేషములు నెఱింగింపఁబడినవి. కాని యిందు విచిత్రముగాఁ జివరిభాగములందు సంతానకాంక్షతో రుక్మిణి శ్రీకృష్ణునిఁ బ్రార్థించుట, ఆమె కోరికను మన్నించి కృష్ణుఁడు శివునిఁబ్రార్థింపఁ గైలాసమునకేగుట, మార్గమధ్య మున బదరికాశ్రమమున ఘంటాకర్ణుఁ డను పిశాచమును గాంచుట, చివరకుఁ గృష్ణమహాదేవు లేకమనిచెప్పుట, కృష్ణుఁడు ద్వారకయందు లేనిసమయమునఁ బౌండ్రకవాసుదేవుఁ డనువాఁడు గ్రొవ్వి దాడివెడలుట, తిరిగివచ్చిన శ్రీకృష్ణుఁడు

వానిని దెగవేయుట, హంసడిభకోపాఖ్యానము, మున్నగునవి ప్రవేశపెట్టఁబడి నవి. విష్ణుపర్వము 61వ అధ్యాయమునుండి ప్రారంభింపఁబడిన ఉత్తరభాగము వి. ప. 67 అధ్యాయములు మఱియు భవిష్యపర్వము 135 అధ్యాయములు మొత్తము 202 అధ్యాయములలో సమాప్తముగావింపఁబడినది, భవిష్యపర్వము నందు 135 అధ్యాయములు, 5090 శ్లోకములున్నవి.

హరివంశమున కంతటికిని ప్రధానమైన హరిహరాభేద తత్త్వనిరూపణ మిందేకావింపఁబడినది. సర్వదేవతాసమన్వయరూపమైన యేభవ్యసందేశమును లోకమున కొనఁగఁదలచెనో యట్టిదానిని కవి యీభాగమునందే పొందుపఱచి నాఁడు. హరివంశమున కంతటికిని జీవమణులనఁదగిన రెండుకథ లిందే యున్నవి. మూలహరివంశమునందు మొత్తము 15970 శ్లోకములున్నవి. కొన్నిట 16020 పఱకును గోచరించుచున్నవి.

## ఎఱ్ఱాప్రెగడ హరివంశము —తెలుఁగుసేత

ఎఱ్ఱాప్రెగడ మూలగ్రంథమును దెనిఁగించునప్పు డాశ్వాస విభజనము కాని, పూర్వోత్తరభాగ విభజనముగాని మూలగ్రంథము ననుసరించి కావింపలేదు. ఆదిసర్గమునుండి ప్రారంభించి శ్రీకృష్ణబలరాములు సాందీపనితోడ విద్యాభ్యాసముగావించి యాతనికి గురుదక్షిణగా మృతపుత్రునొసఁగువఱకు, అనఁగా విష్ణుపర్వమందలి 33 అధ్యాయములవఱకుఁ గల భాగమును బూర్వభాగముగ స్వీకరించి వ్యవహరించినాఁడు.

సాధారణముగ మూలమునం దొక్కొక్కవిషయము నొక్కొక్కయధ్యాయమునందుఁ జెప్పి ముగించుచుండఁగా నెఱ్ఱన మఱియొక్క విధానము ననుసరించి తన ప్రణాళిక నేర్పాటుగావించుకొనినటులు గోచరించును. ఎఱ్ఱాప్రెగడ హరివంశము పూర్వభాగమున తొమ్మిదాశ్వాసములలో 2031 గద్యపద్యములును, ఉత్తరభాగమున పదియాశ్వాసములలో 2621గద్యపద్యములును నున్నవి. మొత్తమీగ్రంథమందలి గద్యపద్యముల సంఖ్య 4652.

**హరివంశము-పూర్వభాగము :-** ప్రథమాశ్వాసమునందు ఆదిసృష్టి ప్రకారము, అనాగతమన్వంతరములు, ఛాయాదేవియందు సౌవర్ణశనైశ్చర తపతులు పుట్టిన ప్రకారము స్వీకరించినాఁడు.

ద్వితీయాశ్వాసమున సూర్యవంశాభివర్ణనము, పితృకల్ప ప్రసంగము, పితృదేవతా సమారాధన ఫలవిశేషంబులు, వానిని విపులీకరించుటకుఁ బ్రవర్తిల్లిన కథావిశేషములు గ్రహించినాఁడు.

తృతీయాశ్వాసమునందు సోమోత్పత్తి, సోమవంశప్రాదుర్భావము, ఆ వంశమందు జనించిన నానావంశరాజచరిత్రలు మున్నగునవి వర్ణించినాఁడు.

చతుర్థాశ్వాసమునందుఁ గేవలము శ్రీవిష్ణుమూర్తి యింతవఱకు నాయా యవతారములఁ దాల్చి భూమికవతరించి కావించిన రాక్షససంహారము, ఆయా కల్పములందుఁ బ్రవర్తిల్లిన దేవదానవ యుద్ధములు అభివర్ణింపఁబడినవి.

పంచమాశ్వాసమున శ్రీకృష్ణజననమునకుఁ బ్రధానకారణమైన భూదేవి తన యిక్కట్లు శతానందున కెఱిఁగింప నాతఁడు నారాయణమూర్తిని దర్శింప నేగుట యను ఘట్టమునుండి ప్రారంభింపఁబడి బలరామ శ్రీకృష్ణాదుల జననము, వారు నందగోపు నింటఁబెరుగుట, వారి బాలక్రీడాభివర్ణనములు యశోద శ్రీకృష్ణునులూఖలబద్ధుఁజేయుట అను నంశములున్నవి.

తరువాత శ్రీకృష్ణుఁడింతవఱ కరిష్టాదిరూపములతోఁ దన్నెదుర్కొను చున్న దుష్టరాక్షసుల సంహరించుటయేకాక తాను దీర్ఘరియై వ్రజవాసులంచఱి రక్షణభారమును బూని యొకవంక నాత్మరక్షణము గావించుకొనుచు మఱొక వంకఁ దీనులదైన్యముఁ బాపి యాశ్రితరక్షణము గావించిన విధానమంతయు తెలుఁగు హరివంశమునం దైదాఱేడు ఆశ్వాసములందు వర్ణింపఁబడినది.

అష్టమాశ్వాసమందు కంసప్రేషితులైన కేశి, అరిష్టాసురాది రాక్షస సంహారముగావించి, మధురాపురము ప్రవేశించుటకుఁ బూర్వమే తన దైవత్వ మును నిరూపించుటకొఱకు శ్రీకృష్ణుఁడు యమునలోఁ దన మహానుభావంబుఁ జూపుట యను సంఘటనముఁ గల్పించి యేతద్వర్ణనముతో నాభాగమంతయుఁ బూరించుట కానవచ్చుచున్నది.

దీనితరువాత శ్రీకృష్ణుఁడు మధురానగరముఁ బ్రవేశించి కావించిన యద్భుతకృత్యము లన్నియు నవమాశ్వాసమందు వర్ణింపఁబడినవి. ఇంతవఱకు బలరామకృష్ణు లిరువురికి నుపనయనసంస్కారములు జరిగిన ట్లెఱుఁగుదుమేకాని వారభ్యసించిన విద్యావిధానముల నెఱుఁగము. కావున బలరామకేశవులిరువురు కంససంహారముగావించి సాందీపనియొద్ద విద్యనభ్యసించి యాతనికి గురుదక్షి

ణిగా నాతని మృతపుత్త్రునిఁ దెచ్చియిచ్చు నంతవఱ కెఱ్ఱన పూర్వభాగముగ స్వీకరించినాఁడు. తరువాతఁ బ్రవర్తిల్లిన విషయములన్నియు నుత్తరభాగమునఁ జేర్చినాడు.

ఎఱ్ఱన మూలహరివంశమును దెలిఁగించునప్పు డుత్తరభాగమును మూలము ననుసరించికాక తన యిచ్చవచ్చిన చోటినుండి యుత్తరభాగమని వ్యవహరించి నాఁడు. మూలమున విష్ణుపర్వము 61వ అధ్యాయమునుండి ఉత్తరభాగ మని యుండఁగా నీతఁడు విష్ణుపర్వము 34వ అధ్యాయమునుండియే యుత్తరభాగమని వ్యవహరించి రచన గావించినాఁడు. ఈ సందర్భమునం దెఱ్ఱన కనఁబఱచిన వ్యక్తిత్వమధికము. ఈ భాగమును దెనిఁగించునప్పుడు మూలాతిక్రమణ మధిక ముగా గోచరించును. మూలగ్రంథమందలి కథలను జదివి ప్రధానములైన సంఘటనములందుఁ దప్ప తక్కినచోటులఁ గవి విశృంఖలముగా వ్యవహరించి నాఁడనియే చెప్పవచ్చును. మూలగ్రంథము విష్ణుపర్వము 82వ అధ్యాయము నుండి 109వ అధ్యాయమువఱ కనఁగా 28 అధ్యాయములను బూర్తిగా స్పృశిం పకయే విడిచినాఁడు.

ఇట్లే భవిష్యపర్వమందుఁగల మొదటి ముప్పదియైదధ్యాయములలో పది యధ్యాయములనుమాత్రము సంక్షేపముగా 176 గద్యపద్యములలో వర్ణించి ముగించినాఁడు. తరువాత 102వ అధ్యాయమునుండి నూటముప్పదియైదవ అధ్యాయమువఱకుఁగల 34అధ్యాయములను దెనిఁగింపలేదు.

ఇంతేకాక మూలహరివంశమున భవిష్యపర్వాంతమునందుఁ గానవచ్చు శ్రీకృష్ణునికైలాసగమనము, ఘంటాకర్ణచరిత్రము అనువాని నెఱ్ఱన ఉత్తరభాగ మునం దైదవయాశ్వాసమునందే ప్రవేశపెట్టినాఁడు. ఆ విధముగనే మూలమున భవిష్యపర్వమునందు 91వ అధ్యాయమందున్న పౌండ్రకవాసుదేవోపాఖ్యాన మును హరివంశోత్తరభాగ షష్ఠాశ్వాసమునందుఁ జొప్పించినాఁడు. ఇఁక మూల హరివంశము భవిష్యపర్వమందలి 71వ అధ్యాయమందు వర్ణింపఁబడిన బలి దమనోదంత మంతయుఁ దెలుఁగు హరివంశమందలి చివరియధ్యాయమునందు వర్ణించినాఁడు.

ఈ విధముగ నెఱ్ఱన ఆశ్వాసవిభజనమునందు మూలక్రమమును బాటిం పక కథాసంవిధానము ననుసరించి వ్యత్యయమును బ్రదర్శించినాఁడు,

## ఎఱ్ఱన మూలహరివంశమును విపులీకరించిన సందర్భములు

ఎఱ్ఱన యొక్కొక్కచో మూలమున లేకపోయినను సందర్భమును బురస్కరించుకొని మనోహరములగు పద్యములఁ జెప్పుచుండును. ఈపద్యము లన్నిఁ సాధారణముగా నెఱ్ఱన కావ్యకళాభివ్యక్తిని ప్రకటించుచు జాతీయతాసౌభాగ్య సొంపునేని, గ్రామీణజీవనవిధానమునేని సూచించుచు నింపునింపుచుండు ఉదాహరణమునకు మూలహరివంశమందు లేని యహంకారమును గూ వ్రాయునప్పుడు

> ''నిఃస్వాధ్యాయవషట్కారాస్తస్మిన్ రాజని శాసతి
> ప్రవృత్తం న వపుః సోమం హుతం యజ్ఞేషు దేవతాః
>
> హరి. హరి. ప. అ. 5. శ్లో.

అని యున్న మూలశ్లోకము నాధారముగాఁగొని ఎఱ్ఱన

సీ॥ జపములు గాయత్రిసహితంబుగా మానె
వేదంబు పేరును వినఁగలేద
సోమపానక్రియ చొప్పులురూపఱె
హుతములు కఱవయ్యె హుతవహునకు
సర్వదైవతసమర్చలు గట్టిపెట్టంగఁ
బడినభూతంబుల పనులు సమసెఁ
బరహితంబులు దానపరతలుఁ గడతేఱె
సతత వ్రతోపవాసములు పొలిసె

తే॥ స్వామిచందంబు చందమౌజనుల కనిన
మాట నిజముగ నవ్వేనఙ్మాతలేశుఁ
డఖిల ధర్మపరాఙ్ముఖుఁడయిన నతని
మతముఁ జెల్లించిరెందును మనుజకోటి.

అనివర్ణించి కేళీకౌతుకముతో సర్వకామినీ జనము సేవింప వైభవమచ్చు పడ వనవిహారమునకేఁగుదెంచిన సుందరాకారుఁడు నవయౌవనుఁడునైన ప్రభువును మనకన్నులకుముందుంచినాఁడు.

ఇఁకనిట్లే కార్తవీర్యునిగూర్చి మూలమున

"యస్తుబాహుసహస్రేణ సప్త ద్వీపేశ్వరో ఽ భవత్।
జిగాయ పృథివీ మేకోరథేనాదిత్య వర్చసా॥

హరి. హరి. వ. అ. 33—9

అనియున్న శ్లోకమును బురస్కరించుకొని యెఱ్ఱన

సీ॥ పదివేలవర్షముల్ పరమదుష్కరమగు
తపమాచరించి యుదాత్త తేజు
నత్రితనూజుదత్తాఖ్యు నారాధించి
యాతతకరుణ కయ్యంబులందుఁ
జేతులువేయును జెందనెప్పుడు దుష్టు
దండించు మహిమయు ధర్మసరణి
దప్పకపృథివియంతయు నేలుశక్తియు
సకల ప్రజానురంజనము వెరవు

తే॥ నిష్టవరములుగాఁగొని యేకరథము
ననసమస్త ధాత్రీపతులను జయించి
యేడుదీవుల జన్మంబు లేదుసూర్లు
ప్రగుణ వైభవశ్లాఘ్యంబులుగ నొనర్చె.

హరి. పూ. భా. అ. 3-112.

అని తెలుఁగుచేసిన పద్యమునఁ గార్తవీర్యుఁడు పదివేలవర్షములు తపస్సు నేసి యుద్ధసందర్భములందుఁ జేతులు వేయగునట్లుగను, భూమినంతటిని ధర్మముతప్పక యేలు శక్తిగలుగునట్లుగను వరమునుపొందిన విధానమును బెంచి రచించినాఁడు. ఇఁక మూలశ్లోకపు భావమునంతటిని పై సీసపద్యమున కెత్తుగీతిగనన్న గీతపద్యపు రెండుపాదములందే ముగించి కార్తవీర్యార్జునుఁడు ఏడుదీవులందు జన్నంబు లేదునూర్లు చేసినాఁడని యాతని శౌర్యపరాక్రమము

## ఎఱ్ఱన మూలహరివంశమును విపులీకరించిన సందర్భములు

ఎఱ్ఱన యొక్కొక్కచో మూలమున లేకపోయినను సందర్భమును బురస్కరించుకొని మనోహరములగు పద్యములఁ జెప్పుచుండును. ఈపద్యము లన్నియు సాధారణముగా నెఱ్ఱన కావ్యకళాభివ్యక్తిని ప్రకటించుచు జాతీయతాసౌభాగ్యపు సొంపునేని, గ్రామీణజీవనవిధానమునేని సూచించుచు నింపునింపుచుండును; ఉదాహరణమునకు మూలహరివంశమందు లేని యహంకారమును గూర్చి వ్రాయునప్పుడు

"నిఃస్వాధ్యాయవషట్కారాస్తస్మిన్ రాజని శాసతి
ప్రవృత్తం న వపుః సోమం హుతం యజ్ఞేషు దేవతాః

హరి. హరి. ప. అ. 5. శ్లో.౫.

అని యున్న మూలశ్లోకము నాధారముగాఁగొని ఎఱ్ఱన

సీ॥ జపములు గాయత్రిసహితంబుగా మానె
వేదంబుపేరును వినఁగలేద
సోమపానక్రియ చొప్పులురూపఱె
హుతములు కఱవయ్యె హుతవహునకు
సర్వదైవతసమర్చలు గట్టిపెట్టంగఁ
బడినభూతంబుల పసులు నమసెఁ
బరహితంబులు దానపరతలుఁ గడతేఱె
సతత వ్రతోపవాసములు పొలిసె

తే॥ స్వామిచందంబు చందమౌజనుల కనిన
మాట నిజముగ నవ్వేనఖ్యాతలేశఁ
డఖిల ధర్మపరాఙ్ముఖుఁడయిన నతని
మతముఁ జెల్లించిరెందును మనుజకోటి.

లకుఁ దోడు రాజులకు యజ్ఞయాగాది బ్రాహ్మణ భక్తులనొకయదనపు క బేర్కొనినాఁడు.

సీసపద్యమును బెంచి వ్రాయుటయేకాక "యథైరాజా ప్రజాః" అను నార్యోక్తిని బురస్కరించుకొని దుర్మార్గుఁడైన ప్రభువు ముఁదప్పి చరింపఁగా నావిధముగనే ప్రజలు నసన్మార్గవర్తనులై సంచరని వేనుని సందర్భమునఁ బొందుపఱిచి వ్యంగ్యముగఁ బాలితప్రజలు బద్ధులై వ్యవహరింపవలయు నన్నఁ బాలకుఁ డగుప్రభువు ధర్మపథగా యుండవలె నను సందేశము సమకాలిక ప్రభువుల కిచ్చినట్లుగ నెఱ్ఱన చెను.

"పితుః సమీపగాసాతు పిత్రానిర్భర్త్స్య తాతదా
భర్తుః సమీపం గచ్ఛేతి నియుక్తాచ పునః పునః—

హరి. హరి. వ.

అని తండ్రి కుమార్తెను బెదిరించిన ట్లుండఁగా లౌకికుఁడైన యెఱ్ఱ

" ఎంతయుఁ గ్రూరుండైనను
శాంతుఁడయినఁ బతియ చువ్వెసతికారయ న
త్యంతపు బంధువు తదతి
క్రాంతిఁ దలఁచు కాంత యెందుఁగనునే శుభముల్

హరి. పూ. భా. ఆ. 1—

అని చెప్పినట్లు కల్పించి కావ్యమున కెంతయో సహజత్వమును
నాఁడు.

మఱియు నిట్లే మూలమున కౌశికపుత్రులు గురువచనమును ధిక్క హీనజన్ములై పుట్టిన తెఱంగుఁ జెప్పునప్పుడు విభ్రాజుని గూర్చి వ్రాయుచు

" విభ్రాజమానో వపుషా ప్రభావేన సమన్వితః
శ్రీమా నంతఃపురకృతో వసన్ తత్ర్పవివేశహ॥"

హరి. హరి. వ. అ. 21 శ్లో

అని కేవలము పొడిమాటలుండఁగా నెఱ్ఱన తెలుఁగున

ఉ. "భ్రాజితతేజుఁ డుత్తముఁడు పౌరవవంశ వివర్ధనుండు వి
భ్రాజుఁడు కామినీజన పరంపర గొల్వఁగఁ గేళి కౌతుకో
ద్వ్యాజిత చిత్తుఁడై ప్రమదదోహల మొప్పఁగ నేఁగుదెంచె న
వ్యాజవిభూతిఁ దత్సరిదుపాంతవనాంత మనోజ్ఞ భూమికిన్.

హరి. పూ. భా. ఆ. 2. 194

## ఎఱ్ఱాప్రెగడ సంక్షేపము గావించిన విధానము

మూలగ్రంథము పురాణమువంటి దగుటచేత నచటఁ బ్రసక్తాను ప్రసక్తములుగ ననేకవిషయములు ప్రస్తావింపఁబడియుండ నెఱ్ఱన వానిని పరిహరించుటయో లేక కథాసూత్రము దెగి కథాగమనమున కడ్డురాకుండునట్లుగ కథను సంక్షేపముగఁ జెప్పుటయో కావించుచుండును. ఉదాహరణమునకు మూల గ్రంథమునందు యయాతిచరిత్రను జెప్పు సందర్భమున యయాతి తనకుమారులఁ గాంచి తనవార్ధక్యము నెవ్వరేని గొనుమని కోరినాఁడు. ఆతని కోరికను బురస్కరించుకొని.

"అనిర్దిష్టా మయాభిక్షా బ్రాహ్మణస్య ప్రతిశ్రుతా।
అనపాకృత్యతాం రాజన్నగ్రహీష్యామి తే జరామ్॥
జరాయాం బహవోదోషాః పానభోజన కారితాః,
తస్మాజ్జరా54న తే రాజన్ గ్రహీతు మహముత్సహే॥
సంతితే బహవః పుత్రా మత్తః ప్రియ తరా నృప।
ప్రతిగ్రహీతుం ధర్మజ్ఞ పుత్రమన్యం వృణీష్వవై॥
స ఏవముక్తో యదునా రాజా కోప సమన్వితః।
ఉవాచ వదతాం శ్రేష్ఠో యయాతిర్గర్హయన్సుతమ్॥

క ఆశ్రయస్తవా న్యోఽస్తి
కోవా ధర్మో విధీయతే।
మామనాదృత్య దుర్బుద్ధే
యదహం తవదేశికః॥

54. హరి. హరి. ప. అ. 30. 24. 31.

ఏవముక్త్వాయదుంతాతః శశాపైనం సమన్యుమాన్
అరాజ్యాత్తేప్రజామూఢ భవిత్రీతి నరాధమ
సతుర్వసుం చద్రుహ్యుం చాప్యనుం చ భరతర్షభ।
ఏవమే వాబ్రవీద్రాజా ప్రత్యాఖ్యాతశ్చతైరపి।
శశాపతానతిక్రుద్ధో యయాతిరపరాజితః।
యథాతేకథితం పూర్వం మయారాజర్షి సత్తమ.

అని యదుపు మున్నగువారు సమాధానములు చెప్పనట్లున్న భాగము యథాతథముగ ననువదింపక సంక్షేపించి యెఱ్ఱన

''తనముదిమిఁ బుచ్చికొని యౌ
వన మిండని వేఱువేఱ వారల నర్థిం
చిన నెవ్వరు నీరైరా
జనపతి నలువురకు నిచ్చె శాపములోలిన్-

హరి. పూ. భా. అ. 3 5

అని యొక్కపద్యము మాత్రము వ్రాసి కథను సాగించినాఁడు ఎఱ్ఱన యనౌచిత్యమును బరిహరించుటకుఁ జూపినశ్రద్ధ యమేయమైనది. ఉదాహరణమునకు మూలహరివంశమున ఫేనుని కుమారుడైన సుతపుని పుత్రుండగు బలినిగూర్చి చెప్పుచు నాతఁడు మహాయోగి యనియు నాతఁడు వంశకర్తయై అంగ, వంగ, కళింగ, పుండ్రకులను క్షత్రియకుమారులనేకాక బాలేయులని పేరొందిన బ్రాహ్మణవంశోద్ధారకులగు కుమారులనుగూడఁ బొందినాఁ డని వర్ణించుటేకాక యీకుమారులందఱు బ్రహ్మవరమును బొందిన బలికి క్షేత్రజులని చెప్పఁబడియున్నది. వీరందఱు బలిరాజభార్యయైన సుదేష్ణయందు దీర్ఘతపసుఁడను మునిపుంగవునివలన జన్మించి నట్లున్నది[55]. ఈభాగములు ననువదించునపు డెఱ్ఱన " ఆతఁడు బ్రహ్మవలన మహాయోగీశ్వరత్వంబును గల్ప ప్రమాణంబైన యాయుపు ననేకవంశకర్తృత్వంబును వరంబుగాఁ బడసి యంగవంగసుహ్మపుండ్రకళింగు లను పుత్త్రులం గాంచె ''[56] నని మాత్రమే వర్ణించినాఁడు.

---

55. హరి. హరి. వ. అ. 3-33-39.
56. హరి. పూ, భా. అ. 3. వ. 95.

ఇట్లే సంస్కృతహరివంశమున 9వ అధ్యాయమున సంజ్ఞాదేవి చరిత్ర మును జెప్పునపు డాసంజ్ఞాదేవి మార్తాండుని వేడిమిని భరింపలేక యాతని బాసి బాడబరూపమున దపోవృత్తిమై నరణ్యములఁ జరించుచుండ నావృత్తాంతమెఱిఁ గిన యాదిత్యుఁడు దానశ్వరూపమును ధరించి వెళ్ళినసందర్భమున

> "సోఽశ్వరూపేణ భగవాంస్తాం ముఖే సమభావయత్
> మైథునాయవిచేష్టన్తీ పరపుంసోప శంకయా.
> సాన్నిరవమచ్ఛుక్రం నాసికాయాం వివస్వతః॥

అని కానవచ్చు శ్లోకములందు వ్యక్తమగు అనౌచిత్యము నెఱిఁగిదానిని బరిహరించుట కాశ్లోకముల ననుపదింపక సారాంశ మపగతమగునట్లుగ "తానును దురంగ మూర్తియై యచ్చటి కరిగి కదియుటయు నమ్మగువ యన్య పురుషుండను తలంపునఁబిరుదు డాఁచి యడఁగుటయు నిరుపుర నాసాపుటంబులు మోచిన నాసత్యులుపుట్టిరి" అని మార్పుగావించి వ్రాసియాసందర్భ మౌచిత్య శోభిత మొనరించినాఁడెఱ్ఱన. సాధారణముగ నెఱ్ఱన కావ్యములం దచ్చటచ్చటఁ దనకు మాతృకయైన గ్రంథభాగములకన్న వేఱైన భావములనేని కథావృత్తాంత ములనేనిఁ బ్రవేశపెట్టుచుండును. పాఠకున కాభాగములు సర్వతంత్రస్వతంత్ర ములై రానవచ్చుచుండును. కాని బహుపురాణకథేతివృత్తకోవిదుఁడైన యెఱ్ఱన వేర్వేఱుగ్రంథములలోని భాగములను గ్రహించి సమయసందర్భముల కనువగున ట్లనువదించి రచించుచుండును. ఉదాహరణమునకుఁ దెనుఁగు హరివంశ పూర్వ భాగమందుఁ గానవచ్చు[57] నీలాసుందరీపరిణయ వృత్తాంతము. ఈ కథ మూల హరివంశమందుఁ గానరాదు. కాని సంస్కృతభాగవతమం దీకథయున్నది.

కోసలాధీపుఁడైన రాజునకు నాగ్నజితి యను కన్యగలదు. ఆమెను వివాహమాడ రాజులంద ఱుద్విళ్ళూరుచుండిరి. కాని యాకన్యను బరిగ్రహింప వలయు నన్న వీరపురుషవానసయే సహింపనొల్లక విజృంభించుచున్న సప్తవృష భముల నిగ్రహింపవలయును. దుస్సాధమైన యాపని చేయలేక రాజులందఱు మిన్నకుండిరి.

ఈవిషయమెఱిఁగి కృష్ణుఁడు గొప్పసైన్యముతో మిథిలఁబ్రవేశించి కోస లాధిపతిచే సత్కృతుఁడై యాతని సౌహృదమునకుఁ జిహ్నముగ గన్యనిమ్మని

57. హరి. హరి. ప. అ. 9. 53-54.

కోరినాడు. నాగ్నజితియు శ్రీకృష్ణుఁబతిగా వలచియేయున్నది. శ్రీకృష్ణుని కోరిక తనకు భాగ్యముగాఁదలంచి ఆయనకుఁ దనకన్య నిచ్చెదనని దలంచియుఁ కన్యావరణమునకై యేర్పఱచుకొనిన సమయమునెఱింగించినాఁడు[58]. అప్పుడు

> "బద్ధ్వాతాన్ దామభిః శౌరిర్భగ్నదర్పాన్ హతౌజసః।
> వ్యకర్షయల్లీలయా బద్ధాన్ బాలో దారుమయాన్ యథా॥
> తతః ప్రీతః సుతాం రాజా దదౌ కృష్ణాయ విస్మితః।
> తాం ప్రత్యగృహ్ణాద్ భగవాన్ విధివత్ సదృశీం ప్రభుః॥
> రాజపత్న్యశ్చ దుహితుః కృష్ణం లబ్ధ్వాప్రియం పతిమ్।
> లేభిరే పరమానందం జాతశ్చ పరమోత్సవః॥

ఈ విధముగ కృష్ణుఁడు నడుము బిగించి తనమూర్తుల నేడుగ భాసింపఁ జేసి దుర్ధర్షములైన యావృషభముల నీ లీలగా బంధించినాఁడు. సంతుష్టుఁడైన కోసలాధిపతి వివాహమునందుఁ గృష్ణునకుఁ గన్య నొసఁగినాఁడు. ఆ సందర్భమునం దెన్నియో వేడుకలు జరిగినవి. కోసలాధిపతి కూతున కెంతయో ఆరణమిచ్చి రథమునందు దాసదాసీజనముతోఁ బంపినాఁడు" అని భాగవతమందున్న దీకథ. ఈకథ యన్నివిధముల నెఱ్ఱన నీలాసుందరి పరిణయకథకు మూలమనక తప్పదు. ఎఱ్ఱన నీలాదేవి భాగవతకథయందలి నాగ్నజితీసత్యకు మాఱుగఁ బ్రవేశపెట్టఁబడినది. భాగవతమందు నాగ్నజితీ సత్య కోసలాధీశుని కూఁతురుకాగ నిచట నీనీల యశోదానుజుఁడగు కుంభకుని కూతురైనది. ఈ విధముగఁ బేర్లయందు మఱియు వారిప్రభుత్వమునందు భేదమున్నదికాని తక్కిన భాగమంతయు నొకటియై యున్నది. తెలుఁగుహరి వంశమందలి కథలో నీల తండ్రియైన కుంభకుఁడు యశోదకు అన్న. వారు గోపాలకులు గావున నౌచిత్యమును బాటించి సహజత్వ ముట్టిపడునట్లుగా నీసందర్భమున రచన గావించినాఁడు.

ఇట్లే రుక్మిణీవివాహ కథనమునుగూడ ఎఱ్ఱన సంస్కృత హరివంశము ననుసరించి చేయలేదు. హరివంశమందుఁగాని, విష్ణుపురాణమందుఁగాని యీ కథ యింతవిపులముగా లేదు. కాని భాగవతమం దీకథ విపులమై

---

58. భాగ. స్క. 10. అ. 58. 30-52.

రుక్మిణీదేవిని సాక్షాత్తు లక్ష్మియవతారముగ స్వీకరించి, యష్టవిధములైన భక్తి విధానముల నామెయందుఁ బొందుపఱచి రచన గావింపఁబడినది. అన్యోన్య మనురక్తులను విషయమెఱిఁగియు శ్రీకృష్ణునియందుఁగల విభేదబుద్ధిచేత నామె యన్నయగు రుక్మి తనచెల్లెలిని కృష్ణునకొసఁగనిచ్చగింపక శిశుపాలునకొసఁగ నిశ్చయించినాఁడు. అప్పుడు రుక్మిణీదేవి

"తదవేత్యాసితాపాంగీ వైదర్భీదుర్మనాభృశమ్
విచింత్యాప్తం ద్విజం కంచిత్ కృష్ణాయ ప్రాహిణోద్దు్రితమ్
ద్వారకాం ససమ్యతభ్యే ప్రతీహారైః ప్రవేశితః
ఆపశ్యదాద్యం పురుష మాసీనం కాంచనాసనే॥

బ్రాహ్మణు నొకని ద్వారకకు శ్రీకృష్ణునొద్దకు పంపఁగా నాబ్రాహ్మణుని ప్రతీహారి ప్రవేశపెట్టఁగ కాంచనాసనమునం దుపవిష్టుఁడైనపురుషునిజూచినాఁడు. ద్యుఁడైన ఆశ్రీకృష్ణునకు రుక్మిణీదేవి తన్ను గొనియేగవలసిన విధానము నాడ చెప్పిపంపినది.

ఈ విధముగానున్న భాగవతకథను గ్రహించి యెఱ్ఱనయత్యద్భుతముగా హరివంశమందు రుక్మిణీకల్యాణఘట్టమును దీర్చిదిద్దినాఁడు. హరివంశములో సంస్కృతభాగవతమందలి బ్రాహ్మణునకు మాఱుగా నారదుఁడే సందేశహరుఁ నాఁడు. కాని యీ నారదమహర్షిని రుక్మిణీదేవి తానై ద్వారకకుఁ పలేదు. విషయమునెఱిఁగిన నారదుఁడు శ్రీకృష్ణునొద్దకు వెళ్ళి రుక్మిణీదేవి సౌందర్యమహిమ్మను వర్ణించి యామె కృష్ణార్థయైన విషయమును చెప్పి యెటు న కాపాడుమని త్వరపెట్టినాఁడు. మఱియు నిట్లే యనేక సందర్భములలో ఎఱ్ఱాప్రెగడ తన హరివంశమందు విష్ణుపురాణ భాగవత కథల ననుసంధించిన నాసము గానవచ్చుచున్నది.

## నృసింహ పురాణము

ఎఱ్ఱాప్రెగడ కృతములైన గ్రంథములలో నిది నాల్గవది. కవికాలమును ఱియు నాకవియుగ సామాన్యధర్మమును బురస్కరించుకొని యీ నృసింహ రాణమునయిత మొక సంస్కృతమూలగ్రంథమునకుఁ దెనుఁగుసేఁత యని ంచుట సహజమైనది. కాని గ్రంథమును బరిశీలింపఁగా నీ భావమునకుఁ ంత వ్యత్యయ మేర్పడుచున్నది. ఏలయన సంస్కృతమునందుఁ గాన

వచ్చు పదునెనిమిది మహాపురాణములలో నీనృసింహపురాణము పేర్కొనం యుండలేదు. ఇక నెఱ్ఱనయు నీగ్రంథమును నృసింహపురాణమని వ్యవహరి నటులు గానరాదు. అయ్యు నీగ్రంథమునకు నృసింహపురాణమనియే ప హారసిద్ధి యేర్పడినది. ఎఱ్ఱన నృసింహపురాణమునకు మాతృకయెయ్యది? యీగ్రంథమున కుంచిన పేరెయ్యది. యని నిర్ణయించుటకుఁ బూర్వ మాగ్రం వతారికను పరిశీలింపవలయును. ఈ గ్రంథావతారికయం దెఱ్ఱనతాతగా ఎఱపోతసూరి యీతనిఁగాంచి —

> శ్రీమదహోబలేశ నరసింహుఁడు నా ప్రియదైవతంబు మ
> త్స్వామి తదీయతీర్థవిభవంబును దన్మహితావతారమున్
> నీ మధురోక్తి గుంభన మనీషులు మెచ్చఁగ బ్రస్తుతింపు నీ
> కేమెయి సంభవించు నఖిలేప్సిత పుణ్యఫలోదయోన్నతుల్.

నృ. పు. ఆ. 1. :

అని కోరఁగా సద్భుతానందములు ముప్పిరిగొన్న మనంబుతో నావాక నీశ్వరానుశాసనంబుగఁ దలంచి నృసింహావతారసంస్తవసరణి నొకప్రబంధ నొనరింతునని తలంచినాఁడు. తరువాత "ఈ నిశ్చయం బిట్టిదికావున బ్రహ డాది పురాణోక్తంబయిన శ్రీనరసింహావతారం బను పురాణంబుఁ దెనుంగున ప్రకటింపవలయు" అని పేర్కొనినాఁడు. కథాప్రారంభమునందు "ఏను వి వంబు సేయంగల లక్ష్మీనరసింహావతారం బను పురాణకథకుఁ బ్రారంభం దనిన" అనియే పేర్కొనినాఁడు. ఇఁక "ఇది శంకరస్వామి సంయమీశ చరణ సరోరుహధ్యానానంద సౌందర్యధుర్య శ్రీ సూర్యసుకవిమిత్ర సం శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ ప్రణీతంబైన లక్ష్మీనరసింహా రంబను పురాణకథయందు" అని యాశ్వాసాంతగద్యను ముగించినాఁ పైని పేర్కొనిన భాగములం దెచ్చటను గవి యీ గ్రంథమును బురస్కరిం కొని నృసింహపురాణ మని పేర్కొనలేదు- కాని లక్ష్మీనరసింహావతారం పురాణకథ యని కంఠోక్తిగఁ జెప్పినాఁడు. కావున నీగ్రంథనామము 'లక్ష్మీ సింహావతార కథ' యని మనము గ్రహింపవచ్చును.

ఎఱ్ఱాప్రెగడ జ్ఞాతిమండలియం దొకరుఁ డగు చదలువాడ మల్లన య నాతఁడు 'విప్రనారాయణ చరిత్రము'లో

రసింహుని పురాణ మొనర్చె హరి మెచ్చ
నెన్నఁడు చూచినాఁడ వనఁగ''

•క్యములను బురస్కరించుకొని చూడ నీ గ్రంథమునకు
ేరున్నట్లు దెలియుచున్నది. అయ్యు నీపేరు గ్రంథ
ప్రసిద్ధమై యుండ మల్లన యట్లుపేర్కొనెనో లేక
కే యీ పేరాగ్రంథమునకు రూఢియై స్థిరపడెనో తెలి
లక్ష్మీనరసింహావతార కథకు మల్లన కాలమునుండియే
రు ప్రఖ్యాతమైనది.

రసింహావతార కథకు మాతృకను గూర్చి యాలోచింప
ములను బురస్కరించుకొని చూడఁగా నీతనితాత తనకు
ంహుఁడు ప్రియదైవతము గావునఁ దదీయ తీర్థవిభ
రమును బ్రస్తుతింపు మనికోరిన ట్లైన్నది. అనఁగా
మాహాత్మ్యము నుగ్గడింపవలసిన దని కోరినట్లైనది. కాని
నముగ క్షేత్రవిభవమునెకాక యా వైభవమునకుఁ
మహిమావతారమును వర్ణనసేయు మని యొక్క ధ్వని
పచేతనే ఎఱ్ఱాప్రెగడయు నిందు తీర్థక్షేత్రమాహాత్మ్యాదు
నొక క్షేత్రమాహాత్మ్యమువలె తీర్చిదిద్దక యాక్షేత్ర
నరసింహదేవునకే ప్రాధాన్యమునిచ్చి యాస్వామి యవ
రముగ హిరణ్యకశిపుదౌష్ట్యములను ప్రహ్లాదుని భక్తిప్ర
కావుననే తాతకోరికను విని యెఱ్ఱన

ను నిత్యదయార్ద్రహృదయుఁ
ంధి నోలాడుఁ గాత
సాపవిత్రమైన
ంధసామగ్రివలన ''

ంవ్యకథావస్తువు నతి చమత్కారముగా సూచించినాఁడు.
సామగ్రి విష్ణుధర్మప్రశంసాపవిత్రమైన దనినాఁడేకాని
రమును బేర్కొనలేదు.

## తెనుఁగు నృసింహపురాణమందలి కథాప్రారంభము :-

"ఏను విన్నపంబు సేయంగల లక్ష్మీనరసింహావతారంబను పుర కథకు ప్రారంభం బెట్టెదనిన" అని ప్రారంభించి లక్ష్మీనరసింహావతార యొక్క ప్రాచీనతను చాటినాఁడు. ఎఱ్ఱన యీకథను పురాణకథయని చె నాఁడెకాని పురాణమని చెప్పలేదు. కావున పురాణగ్రంథమునఁ బోరానిచ ములవలె వచ్చు సర్గప్రతిసర్గాది పంచలక్షణము లిందులేవు.

నిఖిల భువనపావనంబైన నైమిశారణ్యంబునఁ బుణ్యాత్ములగు మహర్ష రోమహర్షణుఁ డను పౌరాణికునివలన నఖిల పురాణేతిహాసంబులు పరిపా వినుచూడి బ్రహ్మాండపురాణంబునఁ దీర్థభాగశ్రవణంబు సేయుసమయంబ నతి కుతూహలోన్మీలితమానసులై 'ఏ తీర్థమున సర్వేశుఁడు శ్రీవిభుఁ ప్రేమస్థేమమ్మెఁదానునజ్ఞాతావాసయు నిత్యవాస రుచిమైనుందురనియు నే తీర్థం పురాణయోగి విదితంబనియు నే తీర్థము సమస్తతీర్థతిలకంబిష్టార్థసిద్ధిప్రదఁ నియు ప్రార్థింపఁగా నాతఁడు వ్యాసమహర్షిని దలంచి "విష్ణుమాహాత్మ్య కథ విస్తరింతు" ననుచుఁ గాలవునివృత్తాంతము చెప్పినాఁడు. తొల్లి గాలవుఁ సకలతీర్థములు సేవించి యహోబలమునకు వచ్చి యచట దేవశ్రవుండ మునిపుంగవుం గనుంగొని —

"ఇచ్చటఁ దొల్లి జనార్దనుఁ
డచ్చుపు వాలారుగోళ్ళ నసురవరేణ్యున్
వ్రచ్చెననసతనినూముని
మెచ్చెనవఁగ నేనువిందు మితకథనములన్

అఖిలలోకేశ్వరుండగు రమాధిపుతోడ
విడువనివైరంబు దొడరునట్టి
మోఁటకమేటికో మొలచె దైత్యుని బుద్ధి
నెబ్బంగి నిష్ఠదైత్యేంద్ర సుతుఁడు
శ్రీవత్సవక్షుమెచ్చించె శ్రీనరసింహ
మూర్తియేకారణమున జనించె
విభుఁ డహోబలనాథ విఖ్యాతి నెట్లయ్యె
నీ తీర్థవరమున కిందుఁగలుగు

పుణ్యతీర్థంబు లెయ్యవి భూరిపుణ్య
యింతయు సవిస్తరంబుగా నింపుమిగుల
నానతిచ్చి కృతార్థుఁ జేయంగ వలయు
నన్ను నిమ్మునులెల్ల నానందమొంద.

నృ. పు. ఆ. 1.19-20

అని ప్రార్థింపఁగా నామునులకోరికఁ దీర్ప నిరుపమవిద్యాఘనుఁడైన దేవశ్రవుఁడు గాలవునిఁ గనుఁగొని—

కం. నీ వడిగినయర్థము ముని
సేవితము సమగ్రబోధసిద్ధిప్రద మి
ష్టావాప్తి కరము శ్రుతిసం
భావితము ప్రశస్త నిత్య పాండిత్యనిధీ !

కం. ఏనును బెద్దలచే మును
వీనులలరఁ దరతరంబవిన్న విధంబున్
మానసమున నున్న తెఱఁగుఁ
గానుపునం గన్న క్రమముఁ గథన మొనర్తున్.

నృ. పు. ఆ. 1.23, 24

అని శ్రీనృసిం హావతారకథా కథనముఁ గావించినాఁడు. ఈ పై విషయములను బురస్కరించుకొని చూడఁగా నిందు రెండువిషయములు ప్రధానములై గోచరించుచున్నవి. ఒకటి యీ కథకు బ్రహ్మాండపురాణముతోఁ గల సంబంధము. రెండవది, కవియే స్వయముగ దేవశ్రవుని వ్యపదేశముచేతఁ దాఁ జెప్పఁబోవుకథ కేవల మొక్కపురాణమందలి విషయముకాక తానుస్వయముగాఁ జూచినదియు విన్నదియు మఱియుఁ దనమనంబున నున్నదియు నగు విశేషమని చాటుట. ఈవిషయము లాధారముగా నీగ్రంథము దాదాపు సంకల్పితము, కూర్పు అనియేభావింపవలనుపడుచున్నది. మఱొక్కవిషయము; కావ్యోపక్రమ సందర్భమునందెత్తిన "బ్రహ్మాండాదిపురాణోక్తంబైన శ్రీనరసింహావతారంబను పురాణం" బనిచెప్పి పాఠకులకు మఱొక్కచిక్కును గలిగించినాఁడు. ఇచ్చట బ్రహ్మాండాది పురాణమనఁగా బ్రహ్మాండపురాణము, మఱియు ఆదిపురాణమని గ్రహింపవలెనా? లేక బ్రహ్మాండము మొదలగు పురాణములని గ్రహింపవలెనా? మహాపురాణము

## తెనుఁగు నృసింహపురాణమందలి కథాప్రారంభము :-

" ఏను విన్నపంబు సేయంగల లక్ష్మీనరసింహావతారంబను పురాణ కథకు ప్రారంభం బెట్టిదనిన " అని ప్రారంభించి లక్ష్మీనరసింహావతారకథ యొక్క ప్రాచీనతను చాటినాఁడు. ఎఱ్ఱన యీకథను పురాణకథయని చెప్పి నాఁడేకాని పురాణమని చెప్పలేదు. కావున పురాణగ్రంథమునఁ బోరానిచుట్ట ములవలె వచ్చు సర్గప్రతిసర్గాది పంచలక్షణము లిందులేవు.

నిఖిల భువనపావనంబైన నైమిశారణ్యంబునఁ బుణ్యాత్ములగు మహర్షులు రోమహర్షణుఁ డను పౌరాణికునివలన నఖిల పురాణేతిహాసంబులు పరిపాటి వినుచూడి బ్రహ్మాండపురాణంబునఁ దీర్థభాగశ్రవణంబు సేయుసమయంబున నతి కుతూహలోన్మీలితమానసులై ' ఏ తీర్థమున సర్వేశుఁడు శ్రీ విభుఁడు ప్రేమస్థేమమైఁదానునజ్ఞాతావాసయు నిత్యవాస రుచిమైనుందురనియు నే తీర్థంబు పురాణయోగి విదితంబనియు నే తీర్థము సమస్తతీర్థతిలకంబిష్టార్థసిద్ధిప్రదంబ నియు ప్రార్థింపఁగా నాతఁడు వ్యాసమహర్షిని దలంచి "విష్ణుమాహాత్మ్య కథలెల్ల విస్తరింతు " ననుచుఁ గాలవునివృత్తాంతము చెప్పినాఁడు. తొల్లి గాలవుఁడు సకలతీర్థములు సేవించి యహోబలమునకు వచ్చి యచట దేవశ్రవుండను మునిపుంగవుం గనుంగాని —

" ఇచ్చటఁ దొల్లి జనార్దనుఁ
డచ్చపు వాలారుగోళ్ళ నసురవరేణ్యున్
వ్రచ్చెననవతనినూని
మెచ్చెననఁగ నేనువిందు మితకథనములన్

అఖిలలోకేశ్వరుండగు రమాధిపుతోడ
విడువనివైరంబు దొడరునట్టి
మోఱకమేటికో మొలచె దైత్యుని బుద్ధి
నెబ్బంగి నిష్ఠదైత్యేంద్ర సుతుఁడు
శ్రీవత్సవక్షుమెచ్చించె శ్రీనరసింహ
మూర్తి యేకారణమున జనించె
విభుఁ డహోబలనాథ విఖ్యాతి నెట్లయ్యె
నీ తీర్థవరమున కిందుఁగలుగు

పుణ్యతీర్థంబు లెయ్యవి భూరిపుణ్య
యింతయు సవిస్తరంబుగా నింపుమిగుల
నానతిచ్చి కృతార్థుఁ జేయంగ వలయు
నన్ను నిమ్మునులెల్ల నానందమొంద.

నృ. పు. ఆ. 1.19-20

అని ప్రార్థింపఁగా నామునులకోరికఁ దీర్ప నిరుపమవిద్యాఘనుఁడైన దేవశ్రవుఁడు గాలవునిఁ గనుఁగొని—

కం. నీ వడిగినయర్థము ముని
సేవితము సమగ్రబోధసిద్ధిప్రద మి
ష్టావాప్తి కరము శ్రుతిసం
భావితము ప్రశస్త నిత్య పాండిత్యనిధీ !

కం. ఏనును బెద్దలచే మును
వీనులలరఁ దరతరంబవిన్న విధంబున్
మానసమున నున్న తెఱఁగుఁ
గానుపునం గన్న క్రమముఁ గథన మొనర్తున్.

నృ. పు. ఆ. 1.23, 24

అని శ్రీనృసింహావతారకథా కథనముఁ గావించినాఁడు. ఈ పై విషయములను బురస్కరించుకొని చూడఁగా నిందు రెండువిషయములు ప్రధానములై గోచరించుచున్నవి. ఒకటి యీ కథకు బ్రహ్మాండపురాణముతోఁ గల సంబంధము. రెండవది, కవియే స్వయముగ దేవశ్రవుని వ్యపదేశముచేతఁ దాఁ జెప్పఁబోవుకథ కేవల మొక్కపురాణమందలి విషయముకాక తానుస్వయముగాఁ జూచినదియు విన్నదియు మఱియుఁ దనమనంబున నున్నదియు నగు విశేషమని చాటుట. ఈవిషయము లాధారముగా నీగ్రంథము దాదాపు సంకల్పితము, కూర్పు అనియేభావింపవలనుపడుచున్నది. మఱొక్కవిషయము; కావ్యోపక్రమ సందర్భమునందెట్టిన "బ్రహ్మాండాదిపురాణోక్తంబైన శ్రీనరసింహావతారంబను పురాణం" బనిచెప్పి పాఠకులకు మఱొక్కచిక్కును గలిగించినాఁడు. ఇచ్చట బ్రహ్మాండాది పురాణమనఁగా బ్రహ్మాండపురాణము, మఱియు ఆదిపురాణమని గ్రహింపవలెనా? లేక బ్రహ్మాండము మొదలగు పురాణములని గ్రహింపవలెనా? మహాపురాణము

లుగాఁ బేర్కొనఁబడుచున్న పురాణములం దీయాదిపురాణము లేదు. అయ్యును ఆదిపురాణ మనునదొక ప్రశస్తైకగ్రంథమున్నది. ఇది తెనుఁగునం దనేకులచేత ననువదింపఁబడియున్నది. లాక్షణికులుగూడ నీగ్రంథమును బేర్కొని పద్యముల నుద్ధరించినారు. కన్నడమునందునయిత మీ యాదిపురాణ మనుగ్రంథ మున్నది. కాని యీ గ్రంథములలో నీ నృసింహావతార కథావృత్తాంతము గానరాదు. కావున నెఱ్ఱాప్రెగడ యుపయోగించిన ఆది శబ్దమును ప్రభృత్యర్థముగ గ్రహించి పరిశీలింపవలయును. నిజమున కీ నృసింహావతారకథ విష్ణుపురాణము నందు, భాగవతమునందు, హరివంశమునందు, పద్మపురాణమునందు, కూర్మ పురాణమునందు, బ్రహ్మాండ పురాణమునందును నున్నది. మఱికొన్ని యితర పురాణములం దచ్చ టచ్చట సూచనగను గలదు. అయ్యు నెఱ్ఱాప్రెగడ బ్రహ్మాండపురాణ మనియే కంఠోక్తముగఁ బేర్కొనినాఁడు. పురాణపరిగణనము నందు బ్రహ్మాండపురాణము మొదటిదై యుండగ నట్లు పేర్కొని యుండవచ్చు నని సంతృప్తిపడుటకును వీలులేదు. ఏలయన నృసింహావతారకథను చెప్పు పురాణములలో విష్ణుపురాణమే మొదటిదై యుండవచ్చు. విష్ణుపురాణమే పురాణపరి గణములలో మూఁడవదియై యున్నది. కాని కవి మఱి యేలకో బ్రహ్మాండపురాణ మని పేర్కొని దానికిఁ బ్రాధాన్యము నిచ్చినాఁడు. ఆలోచించి చూడఁగా నీకథ బ్రహ్మాండపురాణమునందు పుట్టలేదు. ఈ కథా కథనమునకు బీజ మీ పురాణసందర్భమునందు నాఁటఁబడినది. కాని నాటినవిత్తు మాత్ర మతి ప్రాచీనమైనది. పృచ్ఛగావించిన గాలవునికి దేవశ్రవుఁడు తానింతవఱకుఁ బెద్దలచే విన్నవిషయమును నివేదించినాఁడు. కావున నీకాలమునాఁటికే యీ కథ ప్రాచీన మైనది. అందునకే కాఁబోలు నెఱ్ఱాప్రెగడ "బ్రహ్మాండాదిపురాణోక్తంబయిన శ్రీ నరసింహావతారం బను పురాణంబుఁ దెనుఁగుబాసఁ బ్రకటింపవలయు" నని నాఁడు. ఇచట శ్రీనరసింహావతారం బను పురాణంబనఁగా పంచలక్షణ సమన్వితమైన పురాణముకాక పురాతనమైన కథ ప్రాచీనమైనగాథ యని మనము గ్రహింపవలయును.

ఇంతేకాక ఉద్ధవాచార్యులచేత సంశోధింపఁబడి, గోపాల నారాయణ కంపెనీవారిచేఁ బ్రచురింపఁబడిన శ్రీ నరసింహపురాణ మను గ్రంథమొకటి ప్రస్తుత ముపలభ్యమగుచున్నది. ఇఁక నీగ్రంథమును బరిశీలించి చూడఁగా నరసింహావతారవృత్తాంత మిందు విస్తృతరూపమున నున్నది. అష్టాదశపురా

ములలో నరసింహపురాణమొక్కటిగఁ బరిగణింపకపోయినను ఉపపురాణము
రో నీ నరసింహపురాణము పేర్కొనఁబడినది. ప్రస్తుత ముపలభ్య మగుచున్న
రసింహపురాణమును బురస్కరించుకొని పరిశీలింపఁగా తొల్లి నానాదేశారణ్య
లగు ఋషులందఱు మాఘమాసమునందు స్నానార్థమై ప్రయాగతీర్థమునకు
చ్చేసినారు. అట్లు చేరిన ఋషులందఱు యథావిధి స్నాన తర్పణ జపాదికృత్య
ల నిర్వర్తించుకొనియున్న భరద్వాజమహర్షిని సందర్శించినారు. భరద్వాజ
హర్షిచే నతిథిసత్కారముల సంతృప్తులై కృష్ణకథామృతమును పానముచేసి
ననముచేసికొనుచుండఁగా నింతలో వ్యాసశిష్యుఁడుపురాణజ్ఞుఁడు రోమహర్షణుఁ
ను సూతఁడువచ్చి చేరినాఁడు. అట్లు వచ్చిన సూతపుత్రున కాసనాదిసత్కార
లనడిపి సుఖాసీనుఁడైన సూతపుత్రునిగూర్చి భరద్వాజుఁడు సృష్టి, స్థితి,
యములను, నదీపర్వత, తీర్థ, క్షేత్రములను, యుగములను, యుగాంతములను
చ్చి ప్రశ్నించుటయేకాక "కథమారాధ్యతే దేవో నరసింహోప్యమానుషైః"
కూడ ప్రశ్నించినాఁడు[59]. ఆ మహర్షిప్రశ్న లన్నింటికి సమాధానముగ
మహర్షణుఁడు "వ్యాసప్రసాదాజ్జానమి పురాణాని తపోధనాః తంపుణమ్య
వక్ష్యామి పురాణం నారసింహకుమ్"[60] అని ప్రారంభించినాఁడు. అన్ని
హాపురాణములవలెనే యీ నరసింహపురాణముకూడ పురాణపంచలక్షణము
ు వర్ణించినదికాని యతిసంక్షేపముగాఁజెప్పి 35 అధ్యాయములలో ముగించి
. తరువాత ననఁగా 36 వ అధ్యాయమునుండి దేవదేవుని అవతారములు
నకైటభవధ, సముద్రమథన కథ, వారాహప్రాదుర్భావము లున్నవి. 40 వ
ధ్యాయమునుండి 44 అధ్యాయములలో హిరణ్యకశిపునితపస్సు, వరలాభము,
హ్లాదజననము, ప్రహ్లాదుని హరిభక్తి, హిరణ్యకశిపుని క్రౌర్యము, నరసింహ
దుర్భావము లన్నియు 367 శ్లోకములలో వర్ణింపఁబడి యున్నవి. కాని
కథయందు మనకు ప్రస్తుతమగు జయవిజయుల శాపములుగాని, వారి
ృవిశేషములుగాని వర్ణింపఁబడియుండిలేదు. అంతేకాక ప్రహ్లాదుఁడు వైష్ణవతేజః
జముగాఁ రూపొందిన కారణము విచిత్రముగా ననుసంధింపఁబడి యున్నది.
రణ్యకశిపుఁడు ఘోరవ్రత మారంభింపఁగా నలజడిపడుచున్న యింద్రా

---

. శ్రీ నరసింహపురాణమ్- అ. 1. 2-22.
(ప్రచురణ : గోపాలనారాయణ కంపెనీ.)

). నర. పు. అ. 1. 24.

గోళ్లచేత మహాబలియైన హిరణ్యకశిపుని భేదించినాఁడు౬౩. (ఇతి శ్రీ బ్రహ్మాండే వాయుపురాణే వాయుప్రోక్తే మధ్యమభాగే తృతీయ ఉపోద్ఘాతే మరుదుత్పత్తి వర్ణనం నామపంచమోఽధ్యాయః.) అని ప్రధానవిషయముల నన్నిటి నతిసూక్ష్మముగా నెఱింగించుచు వర్ణింపఁబడియున్నది.

దీని తరువాత బ్రహ్మాండ పురాణము నందు హిరణ్యకశిపునకు మహాబలసంపన్నులైన కుమారులు గలరని రచింపఁబడియున్నదేకాని హరి భక్తుఁడైన ప్రహ్లాదుని జనన బాల్యాదులు గాని, యాతని భక్త్యాధిక్యమును గాని వర్ణింపఁబడియుండలేదు. ఇంతేకాక హరిభక్తుఁడైన ప్రహ్లాదుని కారణముగనే నరసింహావతారప్రాదుర్భావము మఱియు నాయవతారమూర్తిచే హిరణ్యకశిపుఁడు మరణించుటలు మున్నగు విషయము లెవ్వియు నీబ్రహ్మాండపురాణము పేర్కొన లేదు. కావున నెఱ్ఱాప్రెగడ నృసింహావతార కథాకావ్యమునకు బ్రహ్మాండ పురాణము మాతృకగా నెచటను నుపయోగపడలేదని గట్టిగాఁ జెప్పవచ్చును. ఎఱ్ఱనకావ్యమునకు మాతృక నరయవలయుననిన నీనృసింహావతారకథావృత్తాంతమును మఱియు నీకథ శ్రీవిస్తృతముగాఁ గానవచ్చుచున్న విష్ణుపురాణ, భాగవతగ్రంథ కథాకథనపద్ధతి నరయవలయును.

---

౬౩. "స ఏవ వాయు ర్భూత్వా చ వవౌ జగతి సర్వదా।
స గోపాలోఽవిపాలశ్చ కర్షకశ్చ స ఏవ హ॥
స జ్ఞాతా సర్వలోకేషు మంత్రవ్యాఖ్యాకర స్తథా।
నేతా గోప్తా గోపయితా దీక్షితో యాజకః స తు॥
తస్య దేవాః సురాః సర్వే తదా సన్ సోమపాయినః।
ఏవంప్రభావో దైత్యో సా వతో భూయో నిబోధత॥
త స్మై సర్వే నమస్కారం కుర్వంతీజ్యాః స ఏవ చ।
హిరణ్యకశిపో ర్దైత్యైః శ్లోకో గీతః పురాత్విహ॥
హిరణ్యకశిపూ రాజా యాం యామా శాం నిరైక్షత।
త స్యై త స్యై తదా దేవా నమశ్చక్రుర్మహర్షిభిః॥
తస్యాసీ న్నరసింహాస్తు మృత్యు ర్విష్ణుః పురా కిల।
నరాత్తు యస్మా జ్జన్మా స్య నరమూర్తిశ్చ యత్ప్రభుః॥
తస్మా త్స నరసింహో వై గీయతే వేదవాదిభిః।
సాగరస్య చ వేలాయా ముచ్ఛ్రిత స్తపసో విభుః॥
శరీరం తస్య దేవస్య హ్యాసీ ద్దేవమయం ప్రభో।

## ఎఱ్ఱాప్రెగడ నృసింహపురాణమందు గానవచ్చు విషయములు

ఎఱ్ఱాప్రెగడ నృసింహపురాణ మైదాశ్వాసముల గ్రంథము. ఇందు మొత్తము 604 గద్యపద్యము లున్నవి. ప్రథమాశ్వాసమం దీకథ విధివిధానముల తరువాత క్షీరాబ్ధివర్ణనముతోఁ బ్రారంభింపఁబడినది. ఇందు శ్వేతద్వీప వర్ణనము, వైకుంఠపుర వర్ణనము, హరిమందిర వర్ణనము, హరిమహిమాభివర్ణనము, శరదృతు వర్ణనము, హరి యోగనిద్రనుండి మేల్కాంచుట, సనకసనందనాదులు జయవిజయుల శపించుట, హరి వారల నోదార్చుట, జయవిజయులు దితిసుతులై పుట్టుటలు గలవు. రెండవఆశ్వాసమున హిరణ్యకశిపువర్ణనము, హిరణ్యకశిపుఁడు తపముసేయ నిశ్చయించుట, అతని తపోవర్ణనము, ఇంద్రునికి బృహస్పతి నారాయణమంత్ర ముపదేశించుట, ఇంద్రుఁడు దైత్యునితపము చెఱుప నచ్చరలఁ బంపుట, వారల విభ్రమ వ్యాపారములు, హిరణ్యకశిపుఁడు బ్రహ్మచే వరములఁ బడయుట, అతఁడు పట్టాభిషిక్తుఁడై విజృంభించి ముల్లోకముల బాధించుట, దేవతల కానారాయణ దర్శనం బవశ్యకర్తవ్యంబుగా బృహస్పతిసెప్పుటలున్నవి. మూఁడవ ఆశ్వాసమున దేవతలు శ్వేతద్వీపమున కరిగి నారాయణు దర్శించుట, దేవత లొనరించిన నారాయణస్తోత్రము, వారు తమ దుస్థితి నారాయణునకు నివేదించుట, నిదాఘ సాయం నిశా చంద్రోదయ చంద్రికా మధుపానలీలాది వర్ణనములు, హిరణ్యకశిపుని దేవేరి కల, ఆమెకు శుక్రుఁడు స్వప్నఫలం బెఱిఁగించుట, ప్రహ్లాద జననము, బాల్యములు వర్ణింపఁబడినవి.

నాల్గవ యాశ్వాసమున ప్రహ్లాదుని విద్యాభ్యాసము, దైత్యుఁడు ప్రహ్లాదుని సుభాషిత మొక్కటి చెప్పుమని కోరుట, బాలుఁ డాతనికి విష్ణుమహత్త్వం బెఱిఁగించుట, హిరణ్యకశిపుఁ డాబాలు నలుగులపాలుసేయ ననుచరులం బంచుట, మఱియు నాప్రహ్లాదు బాధింప భుజంగముల, ద్విరదములఁ బంచుట, అగ్నికీలల బడవేయుట, ప్రహ్లాదుఁడు దానవకుమారుల కుపదేశముసేయుట, విష్ణుభజన మానుమని చెప్పిన గురువులకే ప్రహ్లాదుఁడు తత్త్వోపదేశ మొనర్చుట, పురోహితులు కృత్యనుత్పాదించి ప్రహ్లాదునిపైఁ బంచుట, మాయలుగావింప శంబరుని బంచుట, ప్రహ్లాదుఁడు తండ్రికిఁ దత్త్వముపదేశించుట, కుపితుఁడైన దైత్యుఁ డాకుమారు నాగపాశములఁ గట్టి యబ్ధిఁ ద్రోయుఁడని కింకరులఁ బంపుట లున్నవి.

---

నామ్నా సుదర్శనం చైవ విశ్రుతశ్చ మహాబలః॥
తతః స బాహుయుద్ధేన దైత్యేంద్రం తం మహాబలః।
నఖైఃర్విభేద సంక్రుద్ధో బ నార్ద్రాః శుష్కైఃనఖా ఇతి॥

ఇద్దవయాశ్వాసమున హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుని బిలిపించుట, తండ్రి మాట పాటింపుమని బోధించిన శుక్రునికిఁ బ్రహ్లాదుఁడు విష్ణుభక్తి మహిమ నెఱింగించుట, హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదు బాధింప యమునిఁ బంపుట, ప్రహ్లాదుఁడు తండ్రితో విజ్ఞానపరవశుఁడై పల్కుట, హిరణ్యకశిపుఁడు కరాహతిఁ గంబంబు వ్రేయుట, ప్రాదుర్భవించిన నరసింహమూర్తితో దైత్యుఁడు పోరుట, నరసింహమూర్తి హిరణ్యకశిపుని సంహరించుట, ఆమూర్తి తన్ను స్తుతించిన ప్రహ్లాదు నూఱడించుట, నరసింహమూర్తి యహోబల గరుడాద్రి భవనాశనీ నామంబు లొసంగుట, శ్రీదేవి యావిర్భావము, బ్రహ్మాదులును, తీర్థాదులును నరసింహమూర్తిఁ గొలువ వచ్చుట, నరసింహమూర్తి యా తీర్థ క్షేత్రాదుల మహాత్మ్యం బుగ్గడించుట, నరసింహమూరి ప్రహ్లాదు నభిషిక్తుఁ గావించి వరమడుగుమనుట లున్నవి. వరంబు లొసంగుటతో నీయాశ్వాసము మఱియు గ్రంథము సమాప్తమైనది.

## భాగవతమందలి కథాప్రారంభము

భాగవతమహాపురాణ సప్తమస్కంధ ప్రారంభమునం దీకథ కలదు. పరీక్షిన్నరేంద్రుఁడు శుకమహర్షింగాంచి నిర్ద్వందుఁడు, నిష్పాక్షికబుద్ధియు నైన శ్రీహరి దేవేంద్రునిప్రీతికై యెట్లు దితిసంతానమును సంహరించె నను ప్రశ్నకు సమాధానముగఁ దొల్లి యుధిష్ఠిరుఁడు గావించిన ప్రశ్న కుత్తరముగా నారదుఁడు చెప్పిన కథావిధానమునుగూర్చి చెప్పినాఁడు. భాగవతము భక్తిమహిమనుజెప్పుచు నరుఁ డెట్టివాఁడైనను హరియందలి యచంచలభక్తిచేత నాశ్రీహరిపాదకమలములను జేరగల్గును. పగతుఁడైనను నతిమాత్రశత్రుత్వంబున నిరంతరము శ్రీహరిగతహృదయుఁడై యా శ్రీహరిసాయుజ్యమును బడయగలుగు ననుట కుదాహరణముగ హిరణ్యకశిపు వృత్తాంతమును జెప్పినది[64]. మహాతపస్సంప

---

64. యుధిష్ఠర ఉవాచ — భాగ. స్క. 7. అ. 1. 15. 16

"అహో అత్యద్భుతం హేతద్ దుర్లభైకాంతినామపి।
వాసుదేవే పరే తత్త్వే ప్రాప్తిశ్చైద్యస్య విద్విషః॥
ఏతద్ వేదితుమిచ్ఛామః సర్వ ఏవ వయం మునే।

నారదఉవాచ —

తస్మాద్ వైరానుబంధేన నిర్వైరేణ భయేన వా।
స్నేహాత్ కామేన వాయంజ్యాత్ కథం చిన్నేక్షతే పృథక్॥
యథా వైరానుబంధేన మర్త్యస్తన్మయతామియాత్।
న తథా భక్తియోగేన ఇతి మే నిశ్చితా మతిః॥

్యవంతుఁడైన హిరణ్యకశిపుఁడు శ్రీమహావిష్ణువునందును,
ుగఁగొనుటకుఁ గారణ మాదేవుఁడే దైత్యుని తమ్ముఁడైన
రాహరూపియై సంహరించుటయే[65]. మహాబలసంపన్నులు,
న హిరణ్యకశిపుహిరణ్యాక్షు లనుదైత్యులు తొల్లి శ్రీహరి
వారు సనక సనందనాదులచే శప్తులై దితిజులుగ
జయుల వృత్తాంతము సూచించినది భాగవతము.[66]

## ందలి నరసింహావతార కథాప్రారంభము

సర్గకథనము జలప్రళయాదుల వర్ణించి, ఆయా యవసర
ని శ్రీమహావిష్ణు మహిమావతారములు మఱియు
ఆ యావంశములందలి ప్రధానపురుషులఁ గీర్తించుచుఁ
రణ్యకశిపుఁ డను ఘోరదైత్యునకు జితేంద్రియుఁడు,
ుఁ బరిగణించు పరమకరుణాలువు, విష్ణువునం దచంచల
లో త్తముఁడు ప్రహ్లాదుఁడనువాఁ డగ్రనందనుఁ డని చెప్పి
మహిమ్మను నింక నధికముగాఁ బ్రదర్శించుటకై తరు
ందు హిరణ్యకశిపుని తపశ్శక్తి, త్రిలోకమునిర్జించిన
దనను గాదని యన్యశక్తిని స్తుతించిన కుమారునిఁ
ంసాస్వరూపమంతయుఁ గన్నులఁగట్టినట్లు విష్ణుపురాణ మీ

ప రెండు సందర్భములలో నీనరసింహావతారకథ
సందర్భములందును ఘోరదైత్యుని బాధలుపడలేక దేవ

---

నిహతే హరిణా క్రోడమూర్తినా।
రాజన్ పర్యతప్యద్ రుషా శుచా॥
భాగ. స్క. 7. అ. 2. 1.

తేః పుత్రౌ దైత్యదానవవందితౌ।
శ్రేష్ఠో హిరణ్యాక్షోఽనుజస్తతః॥
్కశిపుర్హరిణా సింహరూపిణా।
రోద్ధారే బిభ్రతా సౌకరం వపుః॥
భాగ. స్క. 7. అ. 1. 39 — 41
1. అ. 15. 143 — 147.

తలు శ్రీమన్నారాయణుని శరణుసొచ్చి మొరవెట్టుకొనఁగా వారి కభయప్రదానముగావించి యవతరించిన దేవదేవుని మహాపరాక్రమమున కనువుగా నీకథ వర్ణింపఁబడియున్నది. కావున నీ గ్రంథమునందు నరసింహావతారప్రాదుర్భావమునకుఁ దరువాతియుద్ధము విపులముగా వర్ణింపఁబడియున్నది.

ఎఱ్ఱాప్రెగడ నృసింహపురాణమున ప్రధానముగా భాగవత, విష్ణుపురాణములందుఁ గానవచ్చు కథాసరణిని తన కనువగునట్లు మలఁచుకొని యుపయోగించుకొనినాఁడు. అయ్యు నీతని యనువాదపద్ధతి యొక విచిత్రమైనది. ఆపద్ధతి యెఱిఁగినవారలకుఁ దప్ప తక్కినవారల కీతని గ్రంథములకు మూలమును నిర్ణయించుటలో చిక్కులు గలుగుచుండును. సాధారణముగ నెఱ్ఱన రచనమంతయు మూలమున కనువాదమేయయ్యు నాయాకథాభాగముల నామూలగ్రంథములనుండి కాక మఱి వేఱుగ్రంథములనుండి గ్రహించుటయు, నొకకథ నొకప్రత్యేకభాగమునుండి ప్రారంభించికొనసాగింపక యాకథా సంబంధియైన విషయములను మఱియొక యధ్యాయమునుండి గొనివచ్చి యనువదించుచుండును. ఈ విషయమును దృష్టియం దిడుకొని ముందునకు సాగినచో పరిశోధకున కీతని గ్రంథములకు మాతృకను నిర్ణయించుట సులభతుర మగుచుండును. ఉదాహరణమునకు నృసింహపురాణమందలి జయవిజయోదంతము మఱియు నంతకుఁబూర్వము వర్ణితములైన శ్వేతద్వీప, వైకుంఠపురాదివర్ణనము భాగవతమందుఁగాని, విష్ణుపురాణమందుఁగాని కానరాదు. అయ్యు, నీ భాగమునకు మాతృక భాగవతమే. ఈ యుదంతము నీతఁడు భాగవతమందలి నృసింహావతార కథాభాగమునుండి కాక వామనప్రాదుర్భావమునకుఁ దరువాత చెప్పఁబడిన కథాభాగమునుండి స్వీకరించినాఁడు[68]. ఇందే శ్వేతద్వీపవర్ణనము, స్వామి యోగనిద్రనుండి మేల్కాంచుట, వైకుంఠపుర వర్ణనము, నారాయణమూర్తి శప్తులైన జయవిజయులకు బ్రాహ్మణప్రభావంబుఁ గూర్చి సెప్పుటలు గలవు.

... రాణమునందుఁ గానవచ్చుచున్న బ్రాహ్మణ ప్రభావాది వర్ణన నెఱ్ఱన స్వకపోలకల్పితముగనొనరించెనని తలంచుట కవకాశ ... విషయము భాగవతమునందే కలదు. ఉదాహరణమునకు

జయవిజయుల యుదంతము విని వారల నోదా
వనేకవిధములఁ గొనియాడుచు
...గాత యదర్హాణాంభః

సద్యః పునాతి సహచంద్రలలామలోకాన్॥
యే మే తనూర్ద్విజవరాన్ దుహతీర్మదీయా
భూతాన్యలబ్ధశరణాని చ భేదబుద్ధ్యా॥
ద్రక్షయంత్యఘక్షతదృశో హ్యహిమన్యవస్తాన్
గృధ్రా రుషా మమ కుషంత్యధిదండనేతుః॥
యే బ్రాహ్మణాన్ మయి ధియాంక్షిపతోఽర్చయేం తస్త్వ్యహృద్ధ్రపద్మ
స్మితసుధోక్షిత పద్మవక్త్రాః॥
వాణ్యానురాగకలాఽఽత్మజవద్ గృణంతః
సంబోధయం త్వహమివాహ ముపాహృతస్తైః



అని చెప్పినవాక్యములఁ బేర్కొనవచ్చును.

ఈ వృత్తాంతముతరువాత ఎఱ్ఱన తనకథాభాగమును విష్ణుపురాణము నుండి గ్రహించి యనువదించినాఁడు. ఏలయన భాగవతమునందు హిరణ్యకశిపుని తపమునకుఁ గారణము శ్రీమన్నారాయణమూర్తి యాదివరాహరూపముతోఁ దనతమ్ముఁడైన హిరణ్యాక్షుని జంపిన పగను సాధించుటయే. హిరణ్యకశిపుఁడు, పతి పుత్రుని దుఃఖమునకై వందుచున్నట్టి యత్తకోడండ్రను ఓదార్చునప్పు డెంతయో తత్త్వబోధ మున్నది.69 దీనితరువాత మొదటిసారిగ ప్రహ్లాదుని తండ్రి గారాబముతో బ్రశ్నించి నప్పుడిచ్చిన నారాయణప్రభావ సంబంధియైన సమాధానముతోఁ గినిసి క్రూరదైత్యుల కాబాలు బాధింపుమని యనుజ్ఞనిచ్చినాఁడు. కాని ఎఱ్ఱన వర్ణించిన విపులహింసాస్వరూప మీ గ్రంథమందు లేదు. విష్ణుభక్తిని గురుకులవాసమందు తోడిదైత్యబాలురకు నుపదేశించుచుండ నీవెక్కడ ఈ విద్యనేర్చితివని యడుగగాఁ బ్రహ్లాదుఁడు వారికి లీలావతి గర్భవతియైయుండ ఘోరతపమాచరించుచున్న దైత్యుఁడు మడసియుండు ననితలంచి యింద్రుఁడు దైత్యునినగరిపై దండెత్తి మహాపతివ్రత, ఆపన్నసత్త్వయైన లీలావతిని చెఱఁగొని యేగుచుండ నారదుఁ డడ్డుపడి యామె గర్భమందు పరమ భాగవతోత్తముఁ డున్నాఁడనువిషయ మెఱిగించి విముక్తఁ గావించి నారదుని యాశ్రమమం దుంచుకొని యామె దుఃఖోపశమనమునకై యా నారాయణ మహిమాభివర్ణనము సేయగా వింటినని చెప్పినాఁడు.70 కావున నెఱ్ఱన నృసింహపురాణ కథావృత్తాంతమునకిది మాతృక కాదు. తరువాత ననఁగా హిరణ్య

69. భాగ. స్క. 7. అ. 2. 2 – 57.
70. భాగ. స్క. 7. అ. 8. 2 – 16.

కశిపుఁడు కుమారుఁడైన ప్రహ్లాదుని విష్ణుగతభక్తినుండి మరలింపవలయు నని, తనయాజ్ఞ నుల్లంఘించిన పాపాత్ముని బరిమార్పవలయు నని యనేకవిధముల భయనయములచేఁ జెప్పి చూచినాఁడు. చివరకు విసిగి విషప్రయోగ, దండ ప్రహార, శస్త్రాస్త్ర ప్రయోగములనే కాక పర్వతాగ్రమునుండి పడద్రోయుట, శాంబరీమాయను ప్రయోగించుట, జలధియందు గూలఁద్రోయుట లెన్నింటినో యొనరించినాఁడు.[71]

ఈ భాగమంతయు నెఱ్ఱన విష్ణుపురాణము నుండియే గ్రహించి యనువదించినాఁడు.

దీనితరువాత వర్ణించిన నృసింహపురాణమునందలి కథావిషయమునకు మాతృక భాగవతమేకాని విష్ణుపురాణము కాదు ఏలయన ప్రహ్లాదుఁ డెంతకును హరిభక్తి మానక తండ్రికే బుద్ధుల గఱపుటకై ప్రయత్నింపఁ గ్రోధావేశముతో హిరణ్యకశిపుఁ డాయుధమును ఝళిపించుచు నిన్నేవిష్ణువు కాపాడునో చూచెద నని పైకి రా స్తంభముననుండి నరసింహమూర్తి యావిర్భావము, అట్లావిర్భవించిన మూర్తి హిరణ్యకశిపుని సంహరించుటలు మున్నగునవి భాగవతము వర్ణించినదే[72] కాని విష్ణుపురాణము చెప్పలేదు.

శాంబరీమాయచేత జలధియందు ప్రహ్లాదునిఁ బడఁద్రోయ హరిస్తవము గావించుచుండిన మహాభక్తుని బంధనములు తమంతట తామే విడిపోయినవి. బంధవిముక్తుఁడైన ప్రహ్లాదుఁడు ద్విగుణీకృతోత్సాహముతో హరిని స్తుతింప శ్రీమన్నారాయణుఁడు సాక్షాత్కరించినాఁడు. అట్లు సాక్షాత్కరించిన స్వామిని గూర్చి ప్రహ్లాదుఁడు తనభక్తిని బురస్కరించుకొని విష, వహ్ని, ధూమ, భృగుపతనాదులచేత హింసించుటవలన తండ్రికి గలిగిన పాపమునంతటిని క్షమియింపు మని కోరినాఁడు. భక్తుని ప్రార్థనమును మన్నించి నారాయణుఁడు వల్లె యనినాఁడు. దీని నంతను గాంచుచున్న హిరణ్యకశిపుఁడు పశ్చాత్తప్తుఁడై ప్రీతితోఁ గొడుకు నాలింగన మొనరించుకొనినాఁడు. తండ్రి నడవడియందు పరివర్తనమును గాంచిన ప్రహ్లాదుఁడునయిత మెంతయో వినీతుఁడై తండ్రియెడ భయభక్తులఁ బ్రదర్శించినాఁ డని విష్ణుపురాణము సెప్పుచున్నది[73].

---

71. వి. పు. అం. 1. అ 17 - 18.

72. భాగ. స్క. 7. అ. 8.

73. శ్రీ భగవానువాచ —

"మయి భక్తి స్తవాస్త్యేవభూమియో ప్యేవంభవిష్యతి।

ఎట్లున హిరణ్యకశిపుని దిగ్విజయమును వర్ణించిన విధానము హరివంశ మందలి కాలనేమ్యాదుల దిగ్విజయ వర్ణనవిధానమును దలపింపఁజేయుచున్నది. నృసింహపురాణము. పంచమాశ్వాసము 121 వ పద్యముతో నరసింహావతార కథ పరిసమాప్తమైనది. దీని తరువాత నున్న శ్రీదేవియావిర్భావము, నరసింహమూర్తి క్షేత్రమన కహోబల, గురుడాద్రి, భవనాశనీనామంబు లొసఁగుట, బ్రహ్మాదులు నరసింహమూర్తిని తీర్థాదులను గొల్వవచ్చుట, మఱియు నానరసింహమూర్తియే క్షేత్రతీర్థాదుల మాహాత్మ్య ముగ్గడించుట మున్నగు వివరములు క్షేత్ర మాహాత్మ్యమునకు సంబంధించినవి. ఇవి మున్ను వినుకలిచేతను

---

వరస్తు మత్తః ప్రహ్లాద వ్రియతాం యస్తవేప్సితః॥

ప్రహ్లాదఉవాచ :—

మయి ద్వేషాను బంధోఽభూత్సంస్తుతావుద్యతే తవ।
మత్పితు స్తత్కృతం పాపం దేవ తస్య ప్రణశ్యతు॥
శస్త్రాణి పాతితాన్యంగే క్షిప్తోయచ్చాగ్నిసంహతౌ।
దంశితశ్చోరగైర్దత్తం యద్విషం మమ భోజనే॥
బద్ధ్వా సముద్రే యత్క్షిప్తో యచ్చితోఽస్మి శిలోచ్చయైః।
అన్యాని చాప్యసాధూనియాని పిత్రా కృతాని మే॥
త్వయి భక్తిమతో ద్వేషాదఘం తత్సంభవం చ యత్।
త్వత్ప్రసాదాత్ప్రభో సద్య స్తేన ముచ్యేత మేపితా॥

శ్రీభగవానువాచ :—

ప్రహ్లాద సర్వమేతత్తే మత్ప్రసాదాద్భవిష్యతి।
అన్యచ్చ తే వరం దద్మి వ్రియతామ సురాత్మజ॥

ప్రహ్లాదఉవాచ :—

కృతకృత్యోఽస్మి భగవ న్వరేణానేన యత్త్వయి।
భవిత్రీ త్వత్ప్రసాదేన భక్తిరవ్యభిచారిణీ॥
ధర్మార్థకామైః కిం తస్య ముక్తిస్తస్య కరే స్థితా।
సమస్తజగతాంమూలే యస్య భక్తిః స్థిరా త్వయి॥

శ్రీభగవానువాచ :—

యథా తే నిశ్చలం చేతో మయి భక్తిసమన్వితమ్।
తథా త్వం మత్ప్రసాదేన నిర్వాణ మ్పరమాప్స్యసి॥

మఱియుఁ గవి హృదయమునందుఁ గలఁ భావనావిశేషముచేతను గల్పించి కూర్చినవి యని చెప్పవచ్చును.

## నృసింహపురాణము – అనువాద విధానము

### వైకుంఠపుర వర్ణనము

శ్రీమద్భాగవత తృతీయస్కంధమున జయవిజయోపాఖ్యాన సందర్భమున మైత్రేయమహర్షి తొల్లి పితామహుఁడాకథాసందర్భమున వైకుంఠపురమును వర్ణించుచు–

"వసంతి యత్ర పురుషాః సర్వేవైకుంఠమూర్తయః।
యేఽనిమిత్తనిమిత్తేన ధర్మేణారాధయన్ హరిమ్॥
యత్ర చాద్యః పుమానాస్తే భగవాన్ శబ్దగోచరః।
సత్త్వం విష్టభ్యవిరజం స్వానాం గోమృడయన్ వృషః॥[74]

అను శ్లోకములను చెప్పినాఁడు. ఈ శ్లోకభావమునే విపులీకరించుచు భక్తుల పాలిటి ముంగొంగు బంగారము వైకుంఠపురమని తోపింపఁజేసి యాపురశుచిత్వ పావనత్వముల నధికము గావింపుచు నెఱ్ఱాప్రెగడ –

సీ॥ నారాయణుని దివ్యనామసంకీర్తనం
బనిశంబుఁ జేయు మహాత్ములకును
బద్మాక్షు శ్రీపాద పద్మంబు లత్యంత
భక్తిమైఁ బూజించు ప్రాజ్ఞులకును
లక్ష్మీశ్వరుని సముల్లాసహేతువులగు
వ్రతములు సల్పు సద్వర్తనులకు

---

శ్రీపరాశర ఉవాచ :–

ఇత్యుక్త్వాంతర్దధే విష్ణుస్తస్య మైత్రేయ పశ్యతః।
స చాపి పునరాగమ్య వవందే చరణౌ పితుః॥
తం పితామూర్ధన్యుపాఘ్రాయ పరిష్వజ్య చ పీడితమ్।
జీవసీత్యాహ వత్సేతి బాష్పార్ద్రనయనో ద్విజ॥
ప్రీతిమాంశ్చాభవత్తస్మిన్ననుతాపీ మహాసురః.
గురుపిత్రోశ్చకారైవం శుశ్రూషాం సోఽపి ధర్మవిత్॥

వి. పు. అంశ. అ. 20. (20–31)

14–16.

విశ్వరూపుని మూర్తి విభవంబు నేకాగ్ర
బుద్ధిభావించు సత్పురుషులకును

గీ॥ భవముతీఱిన తుదివచ్చి భవ్యసుఖము
లనుభవింపంగఁదగు నెలవగుటఁ జేసి
యఖిలవస్తు సంపదలకు నాకరంబు
గుణవిధా విభాసురము వైకుంఠపురము.

చ॥ శ్రుతిమత ధర్మయోగములు చోద్యపుమూల్యముల ప్పురంబునం
జతురత బుణ్యవస్తువులు సారవిముక్తి పదమ్ములమ్ము వా
రతులిత విష్ణుశాసన సమాహితులైన మహాత్ములంచితో
ద్ధతిఁ గొనువారు భూరి విహితవ్రత పారగులైన బోధనుల్.

న్ఫృ. పు. ఆ.1. 45, 46.

ఈ పద్యములను రచించినాఁడు. మఱియు నీ సందర్భముననే

''వైమానికాః సలలనాశ్చరితాని యత్రగాయంతి
లోకశమలక్షపణాని భర్తుః।
అంతర్జలేను వికస న్మధుమాధవీనాం గంధేన
ఖండితధియో వ్యనిలం క్షపంతిః॥
పారావతాన్యభృతసారస చక్రవాకదాత్యూహ హంస
శుకతిత్తిరిబర్హిణాం యః।
కోలాహలో విరమతేఽచిరమాత్ర ముచ్చైర్భృంగాధిపే
హరికథామివగాయమానే॥
మందార కుందకురబోత్పల చంపకార్ణపున్నాగ
వకులాంబుజ పారిజాతాః।
గంధే ర్చితే తులసికాభరణేన తస్యయస్మినంస్తపః
సుమనసో బహుమానయంతి॥[75]

అని రానవచ్చుచున్న శ్లోకము లాధారముగా నెట్టిన నృసింహ పురాణమున —

ఆ॥ సకల కాలకుసుమసంపద సొంపారి
నిఖిల సుఖ విహార నిర్మితులకుఁ
గారణంబులై యుదారమందారంబు
లగుచుఁ బురవనంబు లలరు నెపుడు.   న్ఫృ. పు. ఆ. 1–51.

---

75. భాగ. స్క. 3. అ. 15. 17–19.

సీ॥ హరి భూత భావి భవ్యావతారంబుల
గీర్తింపఁ బొనరించుఁ గీరసమితి
సప్తసామములు సుస్వరముగ మునికోటిఁ
జదివించుఁ గోకిలసముదయంబు
శ్రీకాంతు కమనీయ శృంగార లావణ్య
కథలు పేర్కొను శారికాగణంబు
ప్రణవ మంత్రోస్వాద పరిపాకమింపార
నభ్యాస మొనరించు నలికులంబు

తే॥ ఘోర సంసార తాప నివారణంబుఁ
జేయునున్నత భూరుహచ్ఛాయ చయము
సరస నిర్వాణ గంధంబుఁ జల్లు పుష్ప
జాతియప్పురి యుపవన స్థలులయందు

అను పద్యములను రచించినాఁడు.

ఆవిధముగనే ఎఱ్ఱనకృతములగు

"అనుటయు నాదిదేవుఁ బరమాత్ముఁ గనుంగొను నెమ్మనంబులన్
మొనయు కుతూహలాంకురము మోడ్పడఁ గోపము చిచ్చు తాఁకునన్
ఘనతరబోధ పల్లవము గందఁగనైరట యన్మహావ్రతం
బునకు విఘాత మొంద మునిపుంగవు లొక్కఁట నుగ్రమూర్తులై

అఖిల లోకగమ్యుఁ డగు పరమేశ్వరుఁ
జూడఁ గొల్వవచ్చు సుకృతమునకు
నంతరాయమైతి రట్టి యిద్దురితంబు
ఫలము ననుభవింపవలయు మీరు" — నృ. పు. ఆ. 1- 37, 38.

పద్యములకు మూలముగా భాగవతమునందుఁ గానవచ్చు

"తాభ్యాం మిషత్స్వనిమిషేషు నిషిధ్యమానాః స్వర్హత్తమా
హ్యపి హరేః ప్రతిహారపాభ్యామ్.
ఊచుః సుహృత్తమదిదృక్షితభంగ ఈషత్ కామానుజేన
సహసా త ఉపప్లుతాక్షాః॥

శ్లోకములను చూపవచ్చును.

ఎఱ్ఱాప్రెగడ నృసింహపురాణమున ' హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుని సుభాషిత మొక్కఁటి చెప్పుమను సందర్భమును వర్ణించుచు

వ॥ "ఇట్లు రావించినం జనుదెంచి మదిరాపానగోష్ఠి సమయంబున ననేక విలాసినీ పరివృతుండై యున్న జనకునింగని నమస్కరించి యుపాధ్యాయ సహితంబుగా నంతంత నాసీనుండై యున్న పుత్రునకు నసురేశ్వరుండిట్లనియె –

నృ. పు. ఆ. 4. 4.

ఈభాగమునకు మూలము విష్ణుపురాణ ప్రథమాంశలో హిరణ్యకశిపు వృత్తాంతమును వర్ణించునప్పుఁడు

" తత్రప్రవృత్తాప్సరసి స్ఫాటికాభ్రమ యేఽసురః।
పపౌపానం ముదాయుక్తః ప్రాసాదే సుమనోహరే॥
తస్యపుత్రో మహా భాగః ప్రహ్లాదో నామ నామతః।
పపాఠ బాలపాఠ్యాని గురుగేహంగతోఽర్భకః॥
ఏకదాతు సధర్మాత్మా జగామ గురుణాసహ।
పానాసక్తస్య పురతః పితుర్దైత్యపతేస్తదా॥
పాదప్రణా మావనతం తముత్థాప్య పితాసుతమ్।
హిరణ్యకశిపుః ప్రాహ ప్రహ్లాద మమితౌజసమ్॥

వి. పు. అం. 1. ఆ. 17- 9- 17.

అని యున్న శ్లోకములను యథాతథములుగ ననువదించినాఁ డెఱ్ఱన. మఱియు నిట్లే విష్ణుపురాణమునందు హిరణ్యకశిపు ప్రహ్లాదుల సంవాదమును వర్ణించుచు

" పఠ్యతాం భవతా వత్ససారభూతం సుభాషితమ్।
కాలేనైతావతాయత్తే సదోద్యుక్తేన శిక్షితమ్

ప్రహ్లాద ఉవాచ –

" అనాది మధ్యాంతమజమవృద్ధిక్షయ మచ్యుతమ్
ప్రణతోఽస్మ్యంత సంతానం సర్వకారణ కారణమ్।

శ్రీ పరాశర ఉవాచ –

ఏతన్నిశమ్య దైత్యేంద్రః సకోపోరక్తలోచనః
విలోక్యతద్గురుం ప్రాహ స్ఫురితాధర పల్లవః॥

హిరణ్యకశిపురువాచ —

బ్రహ్మబంధోకిమేతత్తే విపక్షస్తుతి సంహితమ్।
అసారం గ్రాహితో బాలో మామవజ్ఞాయ దుర్మతే॥

గురు రువాచ — దైత్యేశ్వర నకోపస్య వశమాగంతుమర్హసి।
మమోపదేశజనితం నాయం వదతితేసుతః॥

అని యున్న ఈశ్లోకముల ననువదించునప్పు డెఱ్ఱాప్రెగడ

ఉ॥ పాపడ యింతకాలమును బాయక యొజ్జలయొద్దనుండి నీ
వేపగిదిన్ బఠించితదియేర్పడఁ బ్రస్ఫురితార్థసారమై
తీపులువీనులం గురియ దివ్యసుభాషితరత్న మొక్కటు
ద్దీపితధీవిజృంభణ విధేయత యొప్ప నుపన్యసింపు మా.

అనుటయుఁ బ్రహ్లాదుండు

సీ॥ ఆదియు మధ్యంబు నంతంబు నెవ్వాని
కరయలేదని చెప్పు నాగమములు
పొడముటయును లేక పొదలుటయును లేక
తఱుఁగుటయును లేక తనరు నెవ్వఁ
డెవ్వనివలనన యంతయు సంభవ
స్థాన సమాహార దశలఁ జెందుఁ
గారణంబులకెల్లఁ గారణంబై యెవ్వఁ
డపగతకారణుండై వెలుంగు

గీ॥ నమ్మహానుభావు నచ్యుతు నవికారు
నమితతేజు విష్ణు నాదిదేవు
నాశ్రయించినాఁడ నధిప యింతయు కాక
యితరమైన యర్థ మెఱుఁగనేను.

చ॥ అనవిని గుబ్బునం బొడమునిల్కకు నెచ్చెలులై కనుంగవం
గనలెడు దంట కెంపును మొగంబునఁ బొడ్మెడు ఘర్మజాలకం
బును నిటలంబునం దనరు భ్రూకుటియున్ భయముం దనర్ప ని
ట్లను నతఁడొజ్జఁగన్గొని నిరంతర విస్ఫురితాధరోష్ఠుఁడై.

ఉ॥ అక్కట బ్రహ్మబంధువ దురాత్మక నాపగవానికీర్తనం
బెక్కడనుండి యీశిశువు నెప్పగిదిం జదివించి తిజ్జగం

బెక్కుటినేలునా మహిమ యేమియుఁ గైకొని కివ్విధంబునం
దక్కవపా టొనర్చితి వృథాపరిజల్పన కల్పనంబునన్.

వ॥ అనిన సురేశ్వరునకు నుపాధ్యాయుఁ డిట్లనియె.

చ॥ కినియకు దైత్యనాథ యొకకీడును వాదెనలేదు చెప్ప నీ
తనయుఁడు వక్రశీలుఁడు నితాంతనయోక్తుల నేను జెప్పఁగా
వినక నిజేచ్ఛమైఁ గడఁగి వేమఱు నిట్టుల యుగ్గడించు నీ
యనుపున నిట్టికోరదపుటాలరి శిక్షల కేల చేవడున్.

అను పద్యముల రచించినాఁడు. ఇచట నెఱ్ఱాప్రెగ్గడ విష్ణుపురాణమందలి శ్లోకభావములను దప్పక యనువదించియుఁ దానాభావమును విపులీకరించుచు మెఱుఁగులుదిద్ది, కొన్ని జాతీయములను అలంకారములను గూర్చియు సహజ సుందరములుగా సందర్భౌచిత్యమును గాపాడుచు రచించినాఁడు. ఇది యెఱ్ఱన మూలమును విపులీకరించుచుఁ గావించు అనువాద విధానమై యున్నది. అంతేకాక

ఉ॥ నామన మొక్కఁడేలదితినందన సర్వము నావహించి తే
జోమహిమన్ వెలుంగు హరిచోద్యపు భూతమతండు లీలమై
వేమఱు నిన్ను నన్నుఁ బెఱవిశ్వచరాచర భూత జాతమున్
భ్రామకుఁడై నిజోచిత విభావిత చేష్టలఁ గూర్చునెప్పుడున్.

నృ. పు. ఆ. 4 – 21.

తే॥ నాకకాదు లోకములకు నీకుఁ బ్రభుఁడు
వినుము పరమేశ్వరుండగు విష్ణుఁడొకఁ డ
ధాతయును విధాతయును నతండయిందు
నలుకవిడుము శాంతుఁడవగుమయ్య తండ్రి – నృ. పు. ఆ. 4. 18.

అను నీపద్యములకు మూలము –

" నకేవలం తాతమమ ప్రజానామ్
సబ్రహ్మ భూతో భవతశ్చ విష్ణుః।
ధాతా విధాతా పరమేశ్వరశ్చ
ప్రసీదకోపం కురుషేకిమర్థమ్।
న కేవలం మద్హృదయం సవిష్ణు –
రాక్రమ్య లోకా నఖిలా నవస్థితః।

స మాం త్వదాదీంశ్చ పితస్సమస్తా
న్సమస్త చేష్టాసుయునక్తి సర్వగః॥[76]

విష్ణుపురాణమందలి శ్లోకము లనిపేర్కొనవచ్చును. ఎఱ్ఱన నృసింహ పురాణమునందు "ప్రహ్లాదుఁడు దానవ కుమారులకుఁ గావించిన యుపదేశము" నకు మూలము భాగవతము —

"యథాహి పురుషస్యేహవిష్ణోః పాదోపసర్పణమ్।
యదేష సర్వభూతానాం ప్రియ ఆత్మేశ్వరః సుహృత్॥
సుఖమైంద్రియం దైత్యాదేహయోగేన దేహినామ్।
సర్వత్ర లభ్యతే దైవాద్ యథా దుఃఖమయత్నతః॥
తత్ప్రయాసోనకర్తవ్యో యత ఆయుర్వ్యయః పరమ్।
సర్వత్ర లభ్యతేక్షేమం ముకుంద చరణాంబుజమ్॥
తతోయతేతకుశలః క్షేమాయ భయమాశ్రితః।
శరీరం పౌరుషం యావన్నవిపద్యేత పుష్కలమ్॥[77] "

అనుచు నెంతో తత్త్వబోధను గావించు ప్రహ్లాదుఁడు దైత్య బాలుర కుపదేశించినట్లు విపులముగా వర్ణించుచు 28 శ్లోకములున్నవి. ఈశ్లోకము లాధారముగా నెఱ్ఱన

ఆ॥ పుట్టుపెరుగుఁ బ్రాయములఁ జాలఁ జెన్నొందు
ముదిమినేతఁ జిక్కుఁ బిదపఁ జచ్చుఁ
బురుషుఁ డట్టిదెసలఁ బొందు టదృష్టంబ
యిందు లేదు గాదె సందియంబు — నృ. పు. 4. 61— 85.

అని ప్రారంభించి 24 పద్యముల రచించినాఁడు.

ఎఱ్ఱాప్రెగడ నృసింహపురాణమునందుఁ గానవచ్చు "హిరణ్యకశిపుఁడు పహ్లాదునకు విషము పెట్టించుట" అను భాగమునకు మూలము విష్ణుపురాణము. ఉదాహరణమునకు

హిరణ్యకశిపు రువాచ:

"హేసూదా మమ పుత్రోఽసావన్యేషామతి దుర్మతిః।
కుమార్గ దేశికో దుష్టో హన్యతామ విలంబితమ్॥

76. విష్ణు. పు. అం. 1. 24–26.
77. భాగ. స్క. 7. అ. 6. 1-28.

హాలాహలం విషం తస్య సర్వభక్షేషు దీయతామ్॥
అవిజ్ఞాతమసౌపాపో హన్యతాం మావిచార్యతామ్॥

శ్రీపరాశర ఉవాచ :—

తే తథైవ తతశ్చక్రుః ప్రహ్లాదాయ మహాత్మనే।
విషదానం యథాజ్ఞప్తం పిత్రాతస్య మహాత్మనః॥
హాలాహలం విషం ఘోరమనంతోచ్చారణేన సః।
అభిమంత్ర్య సహాన్నేన మైత్రేయ బుభుజేతదా॥
అవికారం సతద్భుక్త్వా ప్రహ్లాదః స్వస్థమానసః।
అనంత ఖ్యాతినిర్వీర్యం జరయామాన తద్విషమ్॥
తతః సూదాభయత్రస్తాజీర్ణం దృష్ట్వా మహద్విషమ్॥
దైత్యేశ్వర ముపాగమ్య ప్రణిపత్యేద మబ్రువన్।

సూదా ఊచుః —

దైత్యరాజవిషం దత్తమస్మాభిరతి భీషణమ్।
జీర్ణం తేనసహాన్నేన ప్రహ్లాదేన సుతేనతే॥

హిరణ్యకశిపురువాచ :-

త్వర్యతాం త్వర్యతాం హే హేసద్యో దైత్యపురోహితాః।
కృత్యాం తస్యవినాశాయ ఉపాదయతమాచిరమ్॥

ఈ శ్లోకములను యథాతథములుగ ననువదించుచు నెఱ్ఱాప్రెగడ

" తాను చెడుట గాక తక్కినవారిని
జెఱుపఁ జూచె నౌర గొఱకు పడుచు
వీని నెట్లయెన విసువక పొలియింప
వలయు నేమివెరవు గలదొ యింక

వ. అని తలంచి వంటలవారిం బిలిచి దుర్మార్గ దర్శనుండును దురాత్ముండును నగు ప్రహ్లాదుండు మత్పుత్రుండని యనుమానింపక మీరు రహస్య యత్నంబున వీనికి భక్ష్యభోజ్యాదులయందు హాలాహలాభిధానంబగు మహావిషంబుఁ బ్రయోగింపుఁడని పనిచినం జని వారును బ్రభుశాసనంబునఁ జేసిన

చ॥ అమృతుననంతు నచ్యుతుని నాత్మఁదిరంబుగ నున్చి నిత్యబో
ధమునఁ గరంగు నప్పరమధార్మికుఁ డింపుగ నారగించు న
య్యమిత హలాహలాద్భుత విషానల సంచయ భక్షణంబునం
దమృతముకంటెఁ బ్రీతికరమయ్యెఁ దదంతర బాహ్యచేష్టలన్.

క॥ విషమచరితుండు బాలుఁడు
విషానుహరణమునఁ జాల వెలుఁగొందె మహా
విషనిధి జనిత విశృంఖల
విషానలము మ్రింగి పొంగు విషమాక్షుక్రియన్.

వ॥ ఇట్లు విషాన్నంబుఁ బ్రయోగించి నిర్వికారుండై యున్న యక్కుమారునిం జూచి సూపకారులు లోకాపకారి యగు దివిజవైరిపాలికిం బోయి తమ చేసిన పనియు వమ్మగుటయుఁ జెప్పిన యప్పుడమ్మొరకుండు పురోహితులం బిలిపించి మీరు మునుపు ప్రతిజ్ఞచేసినవారు కారె? ఈప్రహ్లాదుండను దురాత్మ్రుం బొరిగొను కృత్తినుత్పాదించునది యనిన నియ్యకొనిపోయి వారు ప్రహ్లాదునకుఁ దొలుత నామపూర్వకంబుగా నిట్లనిరి''[78] అను గద్యములను రచించినాఁడు.

ఈవిధముగా గానవచ్చుచున్న యెఱ్ఱన నృసింహపురాణమును బురస్కరించుకొని చూడఁగా నాతఁడు భాగవతశ్లోకములను సంక్షేపించి నట్లును, విష్ణుపురాణశ్లోకములను యథాతథములుగ ననుపదించినట్లును, మఱియు కావ్యకళావైభవమును బ్రదర్శింపగాఁ గొన్నిచోట్ల దానింతవఱకు రచించిన హరివంశ పద్యముల రచించియు కొన్నిచోట్ల నాభావమును విపులీకరించియు, మూలమందలి సూచన నాధారముగాఁగొని విస్తృతమొనరించి నాచనసోమనాథుని ననుకరించి నట్లును గానవచ్చును.

## ఎఱ్ఱన అనువాదపద్ధతి :

సాధారణముగా స్వతంత్రమైన కావ్యరచనమునందు కన్న అనువాద గ్రంథమునందుఁ గ్లేశమెక్కువ. ఒకవేళ నామూలగ్రంథము ఋషిప్రోక్తమై పురాణగ్రంథమువంటిదియైనచో నాక్లేశమింకను నధికముగా నుండును. ఏలయన నొకభాషనుండి మఱియొకభాషలోని కొకనుండవలసిన్నిపేశ మునుగాని, సునిశితభావమునుగాని పరివర్తన మొనరింపవలయు నన్న మూలకారుని జాతీయమునకు, భావములకు, భాషకు మఱియు ననువాదకుఁడైన కవియొక్క స్వభాషా భావప్రకటన విధానమునకుఁ బొత్తుకుదురక యాయా సందర్భములు కవిశక్తులఁ బ్రశ్నించుచుండును. అట్టియెడఁ గేవలము విషయ నివేదనము ధర్మోపదేశములే ప్రధానాశయముగాఁ గలిగిన ఆర్షగ్రంథము నను వదించి రసావిర్భావమును గలిగింపవలయు నన్నచో నాకవి యొకసామాన్యుఁడు

78. నృ. పు. ఆ. 4. 86-90.

కాక మహానుభావుఁడై యుభయభాషాకోవిదుఁడై యుండవలయును. అప్పుడే యాకవి యెట్లెట్లో యారెండుభాషల సమస్యయందలి తనకుఁగల యధికారము చే మూలకారుని భావవైశిత్యమును గ్రహించి తక్కిన నిరోధములను నడ లించుకొని రసరామణీయకము చేతను, కూర్పుబింకము చేతను కథాసంవిధానము నకు భంగముగలిగింపక ముందునకు సాగిపోవుచుండును నేఁటిచరిత్ర కంది నంతవఱకు తెలుఁగుభాషయందు తొలికావ్య మనువాదగ్రంథమైనది. అదృష్ట వశమున నాకవి వాగనుశాసనుఁ డనఁదగిన దఘుఁడు, ఇఁక నాతని తరువాతి కవి, కవిబ్రహ్మగాఁ గీర్తింపఁబడిన తిక్కయజ్వ. కావున నెఱ్ఱాప్రెగడకాలము వఱకు తెలుఁగుభాష యనువాదవిధానమునం దొకరాచమార్గము నేర్పఱచుకొని నది. అంతేకాక రాజపోషణ మొకపెట్టని కోటయై రక్షణగల్పింప నాంధ్రభాష యొకస్థిరరూపమును దాల్చినది. కావున నెఱ్ఱయ తనకాద్యులైన మహాకవుల మార్గము నవలంబించి యనువాదసందర్భమునందు ఆంధ్రభాషయొక్క సొంపు లను పెంపులను మిక్కిలిగాఁ గూర్చి కావ్యరచన గావించినాఁడు.

సాధారణముగా నాద్యులైన నన్నయతిక్కనాదులు మూలము ననువ దించునపుడు తుచ తప్పక యనువదించుటయే ప్రధానముగా నిడుకొనక కావ్యకళాదృష్టి ననుసరించి యౌచిత్యాదిరసపోషణముల నతి జాగరూకతతో నిర్వహించుచు రచన గావించినారు. అందుకే వారి యనువాదమందు 1. మూలము నకు విపులీకరణ, 2. సంక్షేపము 3. విషయపరిహరణము 4. వ్యత్యయము అను నాలుగువిషయములు ప్రధానములై గోచరించుచుండును. ఈకారణముల చేత నాంధ్రమహాభారతమును జదువునప్పుడు పాఠకున కాగ్రంథము అనువాద గ్రంథ మను భావమేనియుఁ గలుగకుండును.

ఇఁక సాముదాయికముగాఁ బరిశీలింప తిక్కన నన్నయాదులవలె ఎఱ్ఱాప్రెగడ సయితము మూలగ్రంథము ననువదించినట్లు గానవచ్చుచుండును. ఒక్కొక్కప్పుడు నన్నయ తిక్కనాదులకన్న నెఱ్ఱయయనువాదము మూలాను సారియై గోచరించుచుండును. కాని ఎఱ్ఱాప్రెగడగ్రంథములను మూలగ్రంథ ముతో సరిపోల్చుచుఁ బరిశీలించినప్పు డొక్కవిశేషము గోచరించుచున్నది. ఉదాహరణమునకు ఎఱ్ఱన ఒకగ్రంథము ననువదించుటకుఁ బూనుకొనినప్పు డాగ్రంథభాగములనుమాత్రమే కొని కావ్యకళాదృష్టి ననుసరించి మార్పులనో చేర్పులనో కావించుచు రచింపవలయు నను నియమమును పాటించినట్లు గాని పింపదు. ప్రారంభించిన గ్రంథమునం దొకసందర్భమును విపరింపవలసివచ్చి

నప్పుడు కేవల మూలగ్రంథమునుండియే కాక యాకథాసంబంధియైన యితర యములను మఱి వేఱుగ్రంథములనుండి గ్రహించి చేర్చుచుండును. పాత్ర కావిషయములు మూలాతిరిక్తములైన స్వతంత్రభావములట్లు గానవచ్చుచుండు ఒక్కొక్కప్పు డెఱ్ఱాప్రెగడ గ్రంథమునందు ప్రస్తుత కథాసంబంధియైన విష ముల, విశేషముల నితరగ్రంథములనుండి గ్రహించి యనువదించుటయేకాక లకు కథలనే యితరగ్రంథములనుండి యేర్చికూర్చుచుండును. ఒక్కొక్కప్పు కథాపాత్రలపేర్లనుమార్చి మూలగ్రంథనామములకనువగునట్లుతుపుచుండుట గానవచ్చును. ఉదాహరణమునకు ఎఱ్ఱనహరివంశమందుఁ గానవచ్చు రుక్మిణీకల్యా ణము, నీలాసుందరీ పరిణయము, శ్రీకృష్ణునిబాలక్రీడాభివర్ణనము, బాలకృష్ణ దుండగములగోపికలుయశోదతోఁజెప్పికొనుటఅనువానినిబేర్కొనవచ్చును. ఎ ప్రెగడ కృత హరివంశ, నృసింహపురాణములకు కేవల మొక్కసంస్కృతప వంశ, బ్రహ్మాండ విష్ణుపురాణములు మాత్రమేకాక హరివంశ, భాగవత, వి పురాణములుకూడ మూలములని సోదాహరణముగా నిరూపింపవచ్చును. కాష నెఱ్ఱాప్రెగడగ్రంథములందు మూలాతిరిక్తములై, సర్వతంత్ర స్వతంత్రము కానవచ్చు విపర్యయములు, విశేషములు అన్నియు కథాసంవిధానమునకై ఎఱ్ఱ స్వయముగా నిరంకుశుఁడై కావించిన మార్పులుకాక యితర గ్రంథాధారము నూతగాఁగొని ప్రదర్శించిన నేర్పులని నిర్ణయింపవచ్చును. అనేక సందర్భ లం దనేకవిధములైన యితరగ్రంథములఁ గానవచ్చు శ్లోకభావముల నన దించి తనగ్రంథములఁ జేర్చుకొనుట యను విశేషరచనావిధానమందు శ్రీనా నకు బహుశః ఎఱ్ఱయయే మార్గదర్శకుఁడై యుండనోపు.

ఇఁక అనువాదసందర్భమునం దెఱ్ఱన తనకు పూర్వపు మహాకవ పద్ధతినే యనుసరించి కథావస్తువునం దైక్యము ప్రసాదించుటకొఱకు పౌరాణిక పద్ధతిని బునరుక్తములైన విషయములఁ బరిహరించుచుండును. నీరసఘట్టము మనోహరము గావించుటకొఱకు మూలాతిరిక్తములయ్యు రసగుళికలవం పద్యములరచించి యావస్తువును జీవకళతో సుట్టిపడఁజేయుచుండును. ఒకొ కచో మూలగ్రంథమందుఁ గానవచ్చు వ్యక్తి, వస్తు, క్షేత్రాది బాహ్యవర్ణనః మాత్రముచేతనే తృప్తిఁబొందక మనోవృత్తులను, భావవైఖరులను విపులీకరిం పాఠకులకాసక్తి జనింపఁజేయుటకై సంభాషణలఁ జొప్పించుచుండును. మఱియ గొన్నితావులందు మూలగ్రంథమున గహనములైన తత్త్వరహస్యముల నానారాజులయొక్కయు, స్థలములయొక్కయు పేర్లపట్టికలుండి కథాగమనము

కడ్డుగల్పించుచుండఁగా నీతఁ డావిషయముల సంక్షేపించి కేవల మాయారాజ వంశమందలి ప్రధానపురుషులనుమాత్రము పేర్కొనుచుండును. ఈ విధముగా నెఱ్ఱాప్రెగడ కావ్యకళాదృష్టిఁ బురస్కరించుకొని కవిహృదయమునకు ఘాత యేర్పడకుండునట్లును తనవ్యక్తిత్వము బయలుపడునట్లును రచించుచుండును.

ప్రస్తుత ముపలభ్యములగుచున్న యెఱ్ఱాప్రెగడ గ్రంథములను బురస్కరించుకొని యాతని యనువాద విధానమును గూర్చి చెప్పవలయు నన్నచో భారతారణ్యపర్వశేషము నందలి యనువాదమందు మూలానుసరణమును హరివంశమందుఁ గొంత స్వేచ్ఛను బాటించి యితర గ్రంథములనుండి యాయాకథావృత్తాంతములఁ గొని యతుకుటయు నిఁక నృసింహపురాణమునం దేగ్రంథమందలి కథాక్రమమును బాటింపక తన యిచ్చవచ్చినట్లు కథాసూత్రము ననుసంధించుకొని రచించుటయుఁ గానవచ్చును. కథాసంవిధానచక్రవర్తియైన నాచనసోమనాథుఁడు దా ననువదింపఁ బోవుచున్న మూలగ్రంథమునందలి విషయముల నేరికూర్చి, నీరసములను మఱియుఁ దన మహాలక్ష్యమున కను కూలములుగాని భాగములను బరిహరించి మూలగ్రంథమందున్న యొక భావము నేని, సూచననేని గ్రహించి తాను స్వయముగాఁ బెంచి స్వతంత్రరచన మొన రించుచుండును. కావున నీతని యనువాదము మూలాతిరిక్తమైన స్వేచ్ఛానువాద మనిచెప్పఁ జెల్లుచున్నది. ఎఱ్ఱాప్రెగడ యనువాదవిధాన మిట్లుగాదు. అతఁడు మూలాధారములేక యేవిషయమును గూర్చినట్లు కానరాదు. ఒక ఆలంబనమును బురస్కరించుకొని దానిని మెఱుఁగులుదిద్ది తనదిగావించుకొనుట యెఱ్ఱన యను వాదవిధానము. ఈతనిదృష్టి యెప్పుడును ఒకరి ననుకరించి యనుసరించియు వారలనుమించి రచన చేయఁగల దక్షత తనకుఁగలదని లోకమునకుఁ జాటుటయే.

నిజమున కనేకపురాణాదులతో పరిచయముగలిగి యాయాసందర్భము లందలి రచనావిశేషముల నెఱిఁగిన పాఠకులు ఎఱ్ఱన కథాసందర్భములను జదువునప్పుడు సులభముగా గ్రహింపఁగల్గుదురు. కావున మహానుభావుఁడు, మహాపండితుఁడునైన యాతని యనువాదపద్ధతి మూలాతిరిక్తమయ్యు మూలాను సారి యనియే చెప్పవలయును.

## ఎఱ్ఱాప్రెగడ కవిత్వము :

పూర్వజన్మసుకృత విశేషముచేతఁ బేరుప్రతిష్ఠ లనాయాసముగా సిద్ధిం చిన యదృష్టవంతుఁ డెఱ్ఱన. ఇట్లనుటచేత నీతనియందు ప్రతిభాపాండిత్యములు

కొలవడినట్లుకాదు. పురుషప్రయత్నమునకు విధినిరోధ మొనరింపక సహకరించి నట్లుగ సకలభాషాకవిత్వవేది, బహుపురాణకథాసకలసంవేది యైన యితనిని లోకము గవిత్రయమం దొకనిగాఁ జేర్చినది. ఆకారణముననే భారతగ్రంథ మున్నంతకాలము ఎఱ్ఱనయు నన్నయ తిక్కనలతో సహ అజరామరుఁడై వెలుగొందుచునేయుండును.

రాజపోషణము వలనను, లిఖితగ్రంథప్రాచుర్యము వలనను భాష ప్రబలగా దానికింకను నింపుసొంపులుగూర్చినాఁ డీతఁడు. తనకుఁ బూర్వము వలయెత్తి పరిపూర్ణులై శిష్యవర్గమును సంపాదించుకొని ధ్వజములనెత్తిన చాళుక్య, కాకతీయ శైలీసమన్వయ మీతనియందుఁ గాననగును. ఈతని కీరెండు మార్గము లనఁగా నన్నయ తిక్కనకీతు లొజ్జబంతులుకాఁగా బహుళసాధనచేత వారిరువురిని బోలి రచింపఁగల రచనాపాటవము నలవర్చుకొనినాఁడు అంతే కాక కథాసంవిధానము నందును విచిత్రపదప్రయోగవైచిత్ర్యము నందును, శబ్దార్థముల మేలుకలయిక యందును నాచనసోముని దలపింపఁజేయు రచనా విధానము నయితము గానవచ్చుచుండును. ఈతని ప్రకృతి విచిత్రమైనది. ఈతఁ డత్యంత సమర్థుఁడయ్యు నాసామర్థ్యమునంతను దనకుఁబూర్వము ప్రథితయశస్కులైనట్టియు లేదా సమకాలిక మహాకవులయొక్కయు రచనలను బోలిన రచనను జేయఁగల సమర్థుఁడనని లోకమునకుఁ జూపినట్లుగా రచించుటయందే వినియోగించినాఁడు. కాని యీతని సహజసుందరమైన శైలీ రమ్యత స్వభావోక్తిని బోషించుమ నకృత్రిమమునైన వస్తువ్యక్తిస్వభావవిశేషములు వర్ణించునప్పుడు వ్యక్తమగుచుండును. పాశ్చాత్య సాహిత్యవేత్తలు 'personality is what is unique in man' అని చెప్పినారు. అదియే వ్యక్తిని వ్యక్తినుండి వేఱుగావించి ప్రత్యేకించునది. అవిషముగనే సాధుజన సమ్మతుఁడు, వినయోదయభరితుఁడునైన యెఱ్ఱాప్రెగడ సహజసుందరశైలి హరివంశమందు చిన్నికృష్ణుని వర్ణనాసందర్భమునందు జాలువారినది. ఉదాహరణమునకు –

1. నోరంజేతులు రెండు గ్రుక్కికొనుచు న్మోమెల్ల బాష్పాంజన –

   హరి. పూ. ఆ. 5. 171.

2. ఫొలుపారఁగా బోరగిలి పాన్పు నాల్గుమూ

   లలకునువచ్చును మెలఁగిమెలఁగి

   హరి. పూ. ఆ. 5. 193.

3. చిఱుతకూఁకట్లు దూలాడఁ జేతి చల్ది హరి. పూ. ఆ. 5. 255.

4. వెన్న బెట్టెద మానుమాయన్న యన్న — హరి. పూ. ఆ. 5. 194. మున్నగు పద్యములఁ బేర్కొనవచ్చును.

కవిసార్వభౌముఁడైన శ్రీనాథుఁడు "పరిఢవింతుఁ బ్రబంధపరమేశ్వరుని తేవసూక్తి వైచిత్రి నొక్కొక్కమాటు" అని యెఱ్ఱన నతిగా సంభావించినాఁడు. ఇఁక నీసూక్తివైచిత్ర్య మన నెయ్యదియో పరిశీలింపవలయును.

రాజశేఖరుఁడు కర్పూరమంజరిలో —

"అర్థవిశేషాస్త ఏవ శబ్దాస్త ఏవ పరిణమంతోఽపి
ఉక్తివిశేషః కావ్యం భాషాయాభవతు సాభవతు"

అని చెప్పినాఁడు. ఈవాక్యమును బురస్కరించుకొని చూడఁగా భావమును పదజాలమందుఁ బొదుగుటీతియే 'ఉక్తి' విశేషమని తెలియుచున్నది. మఱియు నితఁడే కావ్యమీమాంసలో "యాశబ్దగ్రామం, అర్థసార్థం, అలంకారతంత్రం ఉక్తిమార్గమ్" అని చెప్పినాఁడు. భోజుఁడు 'ఉక్తిని' గుణముగను, అలంకారముగను గ్రహించినాఁడు. ఇతఁడు ఉక్తిగుణమును శబ్దార్థ భేదములను బురస్కరించుకొని రెండు విధములుగా విభజించినాఁడు.[79]

దండి యీఉక్తిని స్వభావోక్తి యనియు వక్రోక్తి యనియును రెండు విధములుగా విభాగించినాఁడు.[80]

బహురూపమిశ్రుఁ డనునతఁడు దశరూపకమునకు వ్యాఖ్యవ్రాయుచు నీపైవివరింపఁబడిన 'ఉక్తిని' 'సూక్తి' యని వ్యవహరించినాఁడు. ఉదాహరణమునకు :— "కేచిత్ శోభాకారత్వ అవిశేషాత్ రసగుణయో రలంకారత్వం మన్యంతే. తన్మతే త్రివిధాసూక్తిః" అని చెప్పి యాత్రివిధములనుగూర్చి "స్వభావోక్తిః, వక్రోక్తిః, రసోక్తిరితి, తత్రగుణప్రాధాన్యే స్వభావోక్తిః, ఉపమారూపకా ద్యలంకారప్రాధాన్యే వక్రోక్తిః, విభానుభావ వ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తౌ రసోక్తిః" అని నిర్వచించినాఁడు. ఈనిర్వచనముల నన్నిటిని బురస్కరించుకొని చూడఁగా నీత్రివిధములైన ఉక్తివిశేషముల కలయికయే సూక్తియనియు, దానినే శ్రీనాథుఁ డెఱ్ఱనకవిత్వమునందుఁ గాంచి ప్రశంసించినాఁడనియుఁ జెప్ప వీలగుచున్నది.

ఎఱ్ఱాప్రెగడ స్వభావోక్త్యలంకారము నతివిస్తారముగా నుపయోగించియు రసానందమున కెక్కడను భంగము వాటిల్లనీయఁడు. ఈతని రచనమునందు

79. S. K. A. 1. P. 73.
80. హరి. పూ. ఆ. 5–256.

'జాతి' 'వార్త'దులన్నియు నీరసత్వమును విడిచి యలంకారములై కావ్యమునకు సొబగును గూర్చినవి.

" వృకములఁదోలి యార్చుచును వేడుకఁబాడుచుఁ......
ప్రకట మహీరుహాగ్రములు ప్రాఁకుచు జున్నులురేఁచి తేనె గో
పకులకుఁ బోయుచున్ మధురభుక్తము సేకళు లారగించుచున్
సకలమనోజ్ఞ శీలనరసంబున దేలిరి బాలయాదవుల్. "

శ్రీకృష్ణుఁడు యశోదకుఁ గొడుకై వ్రేపల్లెయందు శిశుతాస్ఫూర్తిం జెలంగుచు నందఱ నానందమగ్నులఁ గావించిన విధానమునుగూర్చి

" తన మాయజాలంబుల
మునిఁగి సకలలోకములును ముగ్ధంబులుగాఁ
దనరెడు ప్రౌఢుఁడు లోకము
తన మౌగ్ధ్యంబునకుఁ బ్రముదితం బగుచుండఁన్. "

అని వర్ణించినాఁడు. ఇచట రూపక శ్లేషాలంకారములకు సంయోగమును గల్పించి యెఱ్ఱన తన సూక్తివైచిత్ర్యమును బ్రదర్శించినాఁడు. మఱొక్కచోట వర్షర్తువును వర్ణించుచు

" ఘనరసోపయోగంబునఁ గ్రమ్ముఅంగఁ
బడసెఁ బ్రాయంబుఁ దగదె యిభ్భంగి యనఁగ
హరితతృణలతారుణకోమలాంగి యగుచుఁ
బృథ్వియంతయుఁ గ్రొత్తయొప్పిదమునొందె. "

— హరి. పూ. భా. ఆ. 6. — 111.

అని రచించిన పద్యమందు ఉత్ప్రేక్షారూపకాలంకారములు శ్లేషతోఁ బరస్పరము సుసంగతములై యొప్పుచు భావమున కెంతయో సొగసును గూర్చినవి.

ఇంకొకచోట శ్రీకృష్ణుఁడు గోవర్ధనపర్వతము నెత్తి పుష్కలావర్త మేఘముల నాఁగి గోవులను గోపాలురను గాపాడి యొక యున్నతసానువుపై నుండఁగాఁ జూడవచ్చిన యింద్రుఁడు

" లోచనము లెల్ల విచ్చివి
రోచను నెదురుకొను పంకరుహముల భంగిన్
రోచిష్ణువులుగ వేడ్కం
జూచె ననిమిషత్వమపుడు సుకృతార్థముగన్. "

హరి. పూ. ఆ. 7. 191.

అని రచించిన పద్యమునందెట్టన యుపమాలంకార సంకలితశ్లేషను జొప్పించి యభిలషితార్థమును సాధించినాఁడు. వేఱొక్కచోట, శ్రీకృష్ణుఁడు కాళియమడుపునం దుఱుకగనే కాళియభుజంగ మాతని చుట్టినది. కాళియనాగ ముచేఁ జుట్టఁబడిన శ్రీకృష్ణుని స్థితిని వర్ణించుచు నెఱ్ఱాప్రెగడ—

"సింధుపతిలోనఁ బెనుబాపసెజ్జఁ బెనఁగి
సుప్తిఁగడునొప్పుతీ పాత్మసోఁకి యిట్టిఁ
డయ్యెఁగాక యెక్కడిపీడ హరికనంగఁ
బన్నగాంగ సంగమమూర్ఛ ప్రభున కొప్పె."

హరి. పూ. భా. ఆ. 7. 25.

అని వర్ణించినాఁడు. ఈపద్య మెంతహృద్యమైనదో భావ మంత పరిశుద్ధమైనది. ఇందుఁ బోషింపఁబడిన యపహ్నుత్యలంకారవిధాన మతిసుందరమైయున్నది.

ఎఱ్ఱాప్రెగడ పోషించిన రసోక్తి విధాన మాహ్లాదదాయకమై యొప్పు చున్నది. ఈతఁ డాయారసములను బోషించునప్పు డలంకారములను సయితము తోడుఁ గొనుచుండును. అద్భుతరసమును సందేహాలంకారముతోఁ బోషించుట యసనితనికి మక్కువ మిక్కిలియై కానవచ్చుచున్నది.
ఉదాహరణమునకు శ్వేతద్వీపమును వర్ణించుచు నృసింహపురాణమున—

"క్షీరాబ్ధితరఁగల పేరణిఁ గూడిన
ఫేనసంహతి చిక్కఁబేరె నొక్కొ—

నృ. పు. ఆ. 1—40.

హరివంశమున గ్రీష్మర్తు వర్ణన సందర్భమున—
"వనధు లెల్లను గ్రోలి తనియక పెనుపొంది
బడబాగ్ని యంతటఁ బ్రబ్బె నొక్కొ—

హరి. పూ. భా. ఆ. 6. 35.

అను పద్యములను జేర్కొనవచ్చును.

ఈ విధముగనే వేర్వేఱలంకార భావము సంయోజనముచేత రసపుష్టిని గలిగించు విధానమునకు నృసింహపురాణమునందు, మదనవికారకారణంబులగు విభ్రమవ్యాపారముల సరకుగొనక నిస్తరంగంబగు నంబురాశిపోలె నున్న హిరణ్యకశిపుని వర్ణించుచు—

మ॥ పురుషాకారముతోడనున్న సిరియో పుంస్త్వంబులేదో యచే
తరువో పుత్తడి రూపొ చిత్రమును చైతన్యంబు సంస్థంబొకో

విరసత్వంబుల ప్రోవొ నిశ్చల కళావిజ్ఞాన సర్వస్వమో
యరు దీచంద మనంగ నిల్చె ధృతియం దస్పంద మందస్థితిన్. ''
అని రచించిన పద్యము నుదాహరింపవచ్చును.

ఇట్లే హరివంశమందుఁ గానవచ్చుచున్న —
1. '' రౌద్రరస స్వభావోద్రేక మంతయు
సాకారమై తనరారె ననఁగ
2. '' కాల కూటమునకుఁ గరచరణాద్యవ
యవములు ప్రభవించి యలరె ననఁగఁ ''
అను పద్యములను బేర్కొనవచ్చును.

ఏ శైలియందైనను సునాయాసముగాఁ బద్యమును నడిపింపఁగల దక్షుఁడైన యెఱ్ఱన పద్యపునడకయందో, ఎత్తుగడయందో, పాదాంతమునందో, ఏదో యొకచోట నొక మెలకువను బ్రదర్శించి రచన మొనరించుచుండును. ఉదాహరణమునకు —

బలరామకృష్ణులు వేణ్యానదీసమీపమునఁ జూచిన వటవృక్షమును —
సీ॥ అడవియెల్లను దాన యైనది యన నమే
యములగు సంప్రరోహములు గలిగి — హరి. ఉ. అ. భా. ఆ. 1. 33.
అని వర్ణించిన సీసపద్యపు నాల్గుపాదములయందును ' ఎల్లను దానయైనది యన ' అను పదమును బునరుక్తము గావించి, పద్యమున కొక సొగసును గూర్చుటయే కాక యిందు స్వభావోక్తిని ఉత్ప్రేక్షాలంకారముతో మేళవించి యా వటవృక్షము యొక్క వైశాల్యమును బ్రదర్శించినాఁడు.

ఇఁక నిట్లే నృసింహపురాణమునందు రంభాదుల విభ్రమవిలాసముల వర్ణించుచు —
'' మునికాళ్లమోపి నిక్కినఁ బదచ్ఛవి నేల
యును బల్లవించిన యొప్పు మెఱయ —నృ. పు. ఆ. 2. 81.
అని రచించిన పద్యమునందు సయితము స్వభావోక్తి, ఉపమాతిశయోక్తులం గూడి మనోహరముగా నున్నది.

ఇట్లే, '' మేరువుగాంచె సంతత సమాహిత ఖేలనమోదితాప్సరో ''81 అను పద్యమునందు శబ్దాలంకార సంబంధియైన అంత్యాను ప్రాసమును పాదాదియందు [illegible] స్వభావోక్తితోఁగూర్చి రచించిన విధానము

గోచరించుచున్నది. ఈపద్యములో విరుపు పాదాంతమునందుఁగాక పాదాదియందే కల్పించుటచేతఁ బద్యమునకు ద్విప్రాసము సునాయాసముగా సిద్ధించినది.

సీ॥ అమృతంపు సోన పై నడరినట్లే పాట
చెన్ను నమోరళ్ళఁ జివురులొత్తె — నృ. పు. ఆ. 2. 83.

అను సీసపద్యపు నాల్గుపాదములం దొకవిషయమును చెప్పి తిరిగి యావిషయము 'నా' ననుపించుచు సామ్యమును జూపినట్లుగా నెత్తు గీతియందు—

గీ॥ అనినఁ బోలుఁ బొసఁగు నగుఁ దగు ననఁగన
చేతనంబు లెల్లఁ జిత్రరూపు
నట్లు సోగి నిలువ నంగన యొక్కౄతి
పాడెఁ గలమనోజ్ఞ భంగు లలర ॥

అనిరచించి పద్యముతోఁగూడా, భావమును సయితము మనోజ్ఞ మొనరించినాఁడు.

ఒక్కొక్కచోట ఎఱ్ఱనస్వభావసుందరముగా వర్ణన గావించుచు స్వభావోక్తిని మాత్రమే స్వీకరించి యాపద్యమునకు, వస్తువునకునొక వైచిత్ర్యమును గూర్చుటకొఱకు లయానుకూలమైన మహాస్రగ్ధరాదివృత్తములఁ జేపట్టి శబ్దాలంకారసమన్వితమును, దీర్ఘసమాసయుతమును గావించి రచించినాఁడు.

ఉదాహరణమునకు :—

"కని రాపాతాళమూలక్షతశిఖరిశిఖాకల్పితోత్తుంగ తీర —
హరి. ఉ. భా. ఆ. 1. 32.

అను పద్యమును జేర్కొనవచ్చును.

ఆ విధముగనే స్వభావోక్త్యలంకారమును ఆదియమకముతోఁగూర్చి పద్యమున కొక వింతచెలువమును గూర్చుచుండును. ఉదాహరణమునకు—

" అదె యిదె లోలనేత్రాంశులు పర్వంగ,
సధికాదరస్నిగ్ధుఁడగుచుఁ జూచె
హరి. పూ. భా. ఆ. 8. 181.

అను సీసపద్యమందు నాల్గుపాదములలో''అదె యిదె''యను పదములను బునరుక్తములుగావించినాఁడు. ఈవిధముగాఁ జేయుటచేతఁ బద్యములో నాలుగుపాదములలో ప్రాస మనాయాసముగా సిద్ధించి శ్రుతిసుభగత్వముచే కూరినది.

ఈ విధముగా నీతఁడు స్వభావోక్త్యలంకారమును, ఉపమా, ఉత్ప్రేక్షాదు లగు అర్థాలంకారములతో మేళవించుటయేకాక శబ్ద-ఉక్తినిగల్పించుచు, అనుప్రాస,

అంత్యానుప్రాస, యమకాదులతో గూర్చి రచనగావించి పద్యమునకు సొగసులు దిద్ది తీర్చినాఁడు.

## రసపోషణమ్మ్ — రుక్మిణీకల్యాణము

The philosophy of the Srimad Bhagavata అను గ్రంథములో దాస్యభక్తినిగూర్చి వ్రాయుచు, "Indeed Dasya is an excellent at the stage of the surrender of action. But now as a result of six fold action (devotion) that has proceeded it, one feels that one belongs to god. Once this sense dawns upon the votary, the rest of devotion follows. Once Dasya is secured the other stages of devotion are bound to appear." అని శ్రీ సిద్ధేశ్వరభట్టాచార్యులవారు పేర్కొనినారు.

శ్రవణ, కీర్తన, స్మరణ, పాదసేవ, అర్చన, వందన దాస్య, సఖ్య, ఆత్మ నివేదనములను నవవిధములగు భాగవతధర్మములలో మొదటి యారు అవస్థల తరువాత దాస్యమును నుత్తమమార్గ మవలంబింపఁగోరు భక్తురాలివలె రుక్మిణీదేవిని యెఱ్ఱన చిత్రించినాఁడు. ఉదాహరణమునకు — వివాహమంగళాలంకృతయైన రుక్మిణీదేవి శ్రీకృష్ణునిగాంచి —

"ఈతని పాదపద్మముల కే ననిశంబును భక్తియుం బ్రియ<br>
త్వాతిశయంబు నొప్పఁగ సమంచిత సేవ యొనర్తు నంబుద<br>
స్ఫీతమనోజ్ఞమూర్తి కనపేతదయావిభవైకవర్తి కు<br>
ద్యోతిత కీర్తి కీతనికి నుత్తమదాస్యనిరూఢిఁ జెక్కొఁటిన్

హరి. ఉ. భా. ఆ. 3. 85.

అని భావించినది. ఇచ్చట శృంగారమును సముతము భక్తిభావవిస్ఫుమొనరించి దానినొకయుదాత్తవిధానమున దీర్చినాఁడు. ఈభాగము నీతఁడు భాగవతము నుండి [illegible]నాఁడు. కావున నాగ్రంథము ననుసరించి యే పాత్రపోషణ [illegible]రదునిమాటలు వినికుండినగరమునకుఁ గృష్ణుఁ డేతెంచిన

గోవిందు డెందములోన నానందధన్య నగుదు<br>
గోవర్ధనునకుఁ జాల వలతినగుదుఁ<br>
పఁ జెక్కి శ్రీవత్సునకుఁ బ్రియశిష్య నగుదు<br>
ఒనొంది హరియం దభేదభావాత్మ నగుదు

నా ప్రియంబును భక్తియు నాతలంపు
వలపుఁ గంసారి యెఱిఁగెడు కొలఁది యెఱిఁగి
యఖిల జగములు నేన యత్యంత సుభగ
తా నిరూఢితో నేలెడుదాన నగుదు" – హరి. ఉ. భా. ఆ. 3. 56.

అని తలంచినది. ఈవిధాన మత్యంత రమ్యమైనది. ఇందు భావము లత్యుదాత్త ములై యామెయాభిజాత్యమునకుఁ దగినట్లుగానున్నవి. శ్రీకృష్ణుఁ డాదిదేవుఁడు. అస్వామి నన్నివిధములఁ జేరఁగోరినది రుక్మిణిదేవి. అట్టి పుణ్యశీలయైన రుక్మిణిదేవికాంక్షయ. దెఱ్ఱన భక్తిశృంగారములు రెంటికిని చక్కని సమ న్వయముఁగావించుచు రచించినవిధాన మతిరామణీయకమైనది. ఇందు రుక్మిణిదేవి గోవిందునకుఁ బ్రియశిష్య, ప్రియసఖి, భక్తాగ్రణియునై యాతని సౌమనస్యము సంపాదింపఁ దివిరినవిధాన మెంతయో యౌచిత్యపోషకమై యున్నది.

తరువాత, రుక్మిణిదేవి, 'తను మును వినియున్న యప్పొడవుఁ దత్పరయై యనిశంబాత్మలో గనుగొనునట్టి కృష్ణుఁడు ముందటనిలువ నామెకు విస్మయము, కంపము, హర్షము, మున్నగు సాత్త్వికభావములు గలుగగా నామె –

అఖిల సౌందర్యనిధి యైనయాదిపురుషుఁ
జెందు చూడ్కితో మదిలోనఁ జిక్కుటయును
బరమయోగ నిరూఢాత్మువగిదిఁ దన్ను
మఱచెఁ జెలువ చెలులు చూచి వెఱఁగు వడఁగ.

హరి. ఉ. భా. ఆ. 3. 79.

అని వర్ణించినాఁడు.

ఈ సందర్భమునందు యోగవిద్యయం దధికారముగల యెఱ్ఱన రుక్మిణీ దేవికి శ్రీకృష్ణుఁజూచుట వలనఁ గలగిన యనుభావమును యోగపరముగా నను సంధించి యాశృంగారమును దైవరతికముగావించి శుచిమంత మొనరించినాఁడు. ఒకళులు దన్నుఁదా మఱచుట యనునది శృంగారరస పరమావధియందును, యోగనిరూఢియందునుసంభవించునట్టిది. ఈరెండిటియందును ప్రవేశము కలిగిన వాఁ డెఱ్ఱాప్రెగడ కావున నీవిస్మృతి నిట్లు శ్రీకృష్ణుఁడు దప్పనన్యమెఱుఁగని రుక్మిణీదేవిపట్ల చెప్పి విచిత్రముగా నారసపోషణ మొనరించుట యే కాక యామె పాత్రకొక యుదాత్తతను సంక్రమింపఁజేసినాఁడు.

ఈకథయం దెఱ్ఱన శ్రీకృష్ణ విరహార్తయై రుక్మిణీదేవి విలపించినట్లు రచింపలేదుకాని చెలులప్రసంగములచేతనే యావిషయము ధ్వనింపఁజేసినాఁడు.

అంత్యానుప్రాస, యమకాదులతో గూర్చి రచనగావించి పద్యమునకు సొగసులు దిద్ది తీర్చినాఁడు.

### రసపోషణమ్ము — రుక్మిణీకల్యాణము

The philosophy of the Srimad Bhagavata అను గ్రంథములో దాస్యభక్తినిగూర్చి వ్రాయుచు, "Indeed Dasya is an excellent at the stage of the surrender of action. But now as a result of six fold action (devotion) that has proceeded it, one feels that one belongs to god. Once this sense dawns upon the votary, the rest of devotion follows. Once Dasya is secured the other stages of devotion are bound to appear." అని శ్రీ సిద్ధేశ్వరభట్టాచార్యులవారు పేర్కొనినారు.

శ్రవణ, కీర్తన, స్మరణ, పాదసేవ, అర్చన, వందన దాస్య, సఖ్య, ఆత్మ నివేదనములను నవవిధములగు భాగవతధర్మములలో మొదటి యారు అవస్థల తరువాత దాస్యమను నుత్తమమార్గ మవలంబింపఁగోరు భక్తురాలివలె రుక్మిణీదేవిని యెఱ్ఱన చిత్రించినాఁడు. ఉదాహరణమునకు — వివాహమంగళాలంకృతయైన రుక్మిణీదేవి శ్రీకృష్ణునిగాంచి —

> "ఈతని పాదపద్మముల కే ననిశంబును భక్తియుం బ్రియ
> త్వాతిశయంబు నొప్పఁగ సమంచిత సేవ యొనర్తు నంబుద
> స్ఫీతమనోజ్ఞమూర్తి కనపేతదయావిభవైకవర్తి కు
> ద్యోతిత కీర్తి కీతనికి నుత్తమదాస్యనిరూఢిఁ జిక్కితిన్
>
> హరి. ఉ. భా. ఆ. 3. 85.

అని భావించినది. ఇచ్చట శృంగారమును సముతము భక్తిభావవినమ్రమొనరించి దానినొకయుదాత్తవిధానమున దీర్చినాఁడు. ఈభాగము నీతఁడు భాగవతము నుండి స్వీకరించినాఁడు. కావున నాగ్రంథము ననుసరించి యే పాత్రపోషణ మొనరించినాఁడు. నారదునిమాటలు వినికుండిననగరమునకుఁ గృష్ణుఁ డేతెంచిన వార్తవిని రుక్మిణీదేవి —

> చూడ్కులు ననుఁజెందఁ జొచ్చి గోవిందు దెందములోన నానందధన్య నగుదు
> బలుకులజాడఁ దీపులు గ్రోలి సోలి గోవర్ధనునకుఁ జాల వలతినగుదుఁ
> గ్రియలకుఁ బూఁచుకోర్చికి నెల్ల దెసఁ జిక్కి శ్రీవత్సునకుఁ బ్రియశిష్య నగుదు
> నేర్పులు ప్రసరింప నెఱయుపాకమునొంది హరియందభేదభావాత్మ నగుదు

నా ప్రియంబును భక్తియు నాతలంపు
వలపుఁ గంసారి యెఱిఁగెడు కొలఁది యెఱిఁగి
యఖిల జగములు నేన యత్యంత సుభగ
తా నిరూఢితో నేలెడుదాన నగుదు '' — హరి. ఉ. భా. ఆ. 3. 56.

అని తలంచినది. ఈవిధాన మత్యంత రమ్యమైనది. ఇందు భావము లత్యుదాత్తములై యామెయాభిజాత్యమునకుఁ దగినట్లుగానున్నవి. శ్రీకృష్ణుఁ డాదిదేవుఁడు. ఆస్వామి నన్నివిధములఁ జేరఁగోరినది రుక్మిణిదేవి. అట్టి పుణ్యశీలయైన రుక్మిణిదేవికాంక్షయ. దెట్టిన భక్తిశృంగారములు రెంటికిని చక్కని సమన్వయముఁగావించుచు రచించినవిధాన మతిరామణీయకమైనది. ఇందు రుక్మిణిదేవి గోవిందునకుఁ బ్రియశిష్య, ప్రియసఖి, భక్తాగ్రిగణియునై యాతని సౌమనస్యము సంపాదింపఁ దివిరినవిధాన మెంతయో యౌచిత్యపోషకమై యున్నది.

తరువాత, రుక్మిణిదేవి, 'తను మును వినియున్న యప్పొడవుఁ దత్పరయై యనిశంబాత్మలో గనుగొనునట్టి కృష్ణుఁడు ముందటనిలువ నామెకు విస్మయము, కంపము, హర్షము, మున్నగు సాత్త్వికభావములు గలుగగా నామె –

అఖిల సౌందర్యనిధి యైనయాదిపురుషుఁ
జెందు చూడ్కితో మదిలోనఁ జిక్కుటయును
బరమయోగ నిరూఢాత్మపగిదిఁ దన్ను
మఱచెఁ జెలువ చెలులు చూచి వెఱఁగు వడఁగ.
హరి. ఉ. భా. ఆ. 3. 79.

అని వర్ణించినాఁడు.

ఈ సందర్భమునందు యోగవిద్యయం దధికారముగల యెట్టిన రుక్మిణీదేవికి శ్రీకృష్ణుఁజూచుట వలనఁ గలగిన యనుభావమును యోగపరముగా ననుసంధించి యాశృంగారమును దైవరతికముగావించి శుచిమంత మొనరించినాఁడు. ఒకళులు దన్నుఁదా మఱచుట యనునది శృంగారరస పరమావధియందును, యోగనిరూఢియందునుసంభవించునట్టిది. ఈరెండిటియందును బ్రవేశము కలిగినవాఁ డెట్టాప్రెగడ కావున నీవిస్మృతి నిట్లు శ్రీకృష్ణుఁడు దప్పనన్యమెఱుఁగని రుక్మిణీదేవిపట్ల చెప్పి విచిత్రముగా నారసపోషణ మొనరించుట యే కాక యామె పాత్రకొక యుదాత్తతను సంక్రమింపఁజేసినాఁడు.

ఈకథయం దెట్టిన శ్రీకృష్ణ విరహార్తయై రుక్మిణీదేవి విలపించినట్లు రచింపలేదుకాని చెలులప్రసంగములచేతనే యావిషయము ధ్వనింపఁజేసినాఁడు.

అంతేకాక నారదుఁ డాదినుండియు నామె విరహమునం దొక భక్తిభావమును సమ్మిళిత మొనర్చి శ్రీకృష్ణునకు వర్ణించి చెప్పి చివరకు " కనికరమునఁ గరఁగు నైసర్గికాత్యంత కరుణ మతివి నీవు ముద్దియ ప్రాణము గావు మనుచుఁ" బలికిన నారదుఁ డందఱు సందేశహరులకన్న మిన్నయై యామెవిరహోత్కటత్వ మునుదోపింపఁ జేసినాఁడు. ఇంతశుచిత్వమును బ్రదర్శించిన యెఱ్ఱనవివాహానంతరము రుక్మిణీకృష్ణుల విహారములను పరిపూర్ణముగా వర్ణించినాఁడు.[82] " రాగ పల్లవముల రమ్యములై యితరేతరాలోకల తలు పై నలమికొనఁగ" ననుపద్యము నందాయాయనుభావాదులచేత శృంగారరసమును క్రమపరీపాక మొందింపఁజేసినాఁడు. కాని పూర్వరాగసందర్భమున దివ్యశృంగారముగాఁ దీర్చిన యెఱ్ఱన లక్షణసంపన్నతకైఁ గాఁబోలు, తిరిగియిట్టిపద్యములను రచించినాఁడు. ఇంతేకాక శృంగారరసమునకుఁ బుష్టినిగూర్చుట కొఱకు రుక్మిణి విరహవర్ణనావసరమున వహించిన నిగ్రహము శ్రీకృష్ణుని సందర్భమున సడలించి లక్షణము తప్పక వర్ణనము గావించినాఁడు. ఆవిధముగనే సంభోగశృంగారమునంతయుఁ జూడవలయునన్న 'ఉషానిరుద్ధుల' చరిత్రమును జదువవలయును.[83] ఈఘట్టమునం దెఱ్ఱన కేవలము బాణపుత్రియైన ఉషాదేవి యామె కనురూపవరుఁడైన యనిరుద్ధుఁ డాసక్తిమై మెలఁగిన విధానమునేకాక లోకమునకు మాతాపితరుల వంటివారైన యాదిమదంపతుల శోణితనగరవిహారం బురస్కరించుకొని —

" కంతకాళిమ దనకంఠంబునకు నూత్న
కస్తూరికా లిప్తి విస్తరింప — హరి. ఉ. భా. ఆ 7. 70.

" క్షాళిత కస్తూరికము లగుకుచముల
క్రేవల నఖపదశ్రీలు మెఱయ —హరి.ఉ.భా.ఆ. 7.34

యున్నగు పద్యముల రచించినాఁడు. కావున నీపద్యములను బురస్కరించుకొని, యెఱ్ఱాప్రెగడ శృంగారరసపోషణమును గూర్చి చెప్పవలయు ననిన సాత్త్విక రజోగుణ ప్రవృత్తులనికాక లక్షణవంతుఁడైన మహాకవి యారసస్వరూపము నెఱిఁగి యాయావిభావాను భావసాత్త్విక వ్యభిచారాదులచేత నారసమునకుఁ బరిపుష్టిని గూర్చినాఁడని యే చెప్పవలనుపడుచున్నది.

---

**82. హరి. ఉ. భా. ఆ, 3. 171.**

**83. హరి. ఉ. భా. ఆ. 7. 190.**

" ఏవి దినంబులో రజను లెవ్వియో విను నిద్రయెట్టిదో —
వల దంత సంతాప మొలయుం బెల్లాసచలిమిరి తోడ్తోడ శమనమొంద "

## హాస్యరస పోషణము

ఎఱ్ఱాప్రెగడ రుక్మిణీకల్యాణ సందర్భమున శిశుపాలుని బురస్కరించు కొని యొక సున్నితమైన హాస్యమును బ్రవేశపెట్టినాఁడు.

ఉదాహరణమునకు — రుక్మిణినిబెండ్లియాడుదు నని వివాహమంగళో చితాలంకారములతోఁ గైసేసి శిశుపాలుఁ డుత్సాహముననుండఁ గృష్ణుఁడామె నపహరించినవార్త వచ్చినది. అప్పుడు రుక్మి మున్నగువారు లందఱు సంభ్ర మించి యుద్ధసన్నద్ధులగుచునుండ శిశుపాలుఁడు, ఒక ఘనపరిఘము కేలఁదాల్చి గ్రక్కున జననాథుని యెదురనిల్చి—

> " పెండ్లియాడుదు నని కడుఁ బేర్మితోడ
> నిట్లు గైసేసి తుది నింత యెడరునొంది
> యున్న నాక కాకీయొచ్చ మొలలకేమి
> గారణము నిల్వుఁ డెవ్వాఁడు గదలవలఁదు "—
>
> హరి. ఉ. భా. ఆ. 3. 99.

అని వారల వారించుచుఁ బలికినట్లు రచించినాఁడు.

ఈ పద్యమున శిశుపాలుని శౌర్యము, అవమానముసహింపనొల్లని యభి మానము, మఱియు నొకవిధమైన యుత్సాహము, ప్రతీకారేచ్ఛ మున్నగునవి యన్నియుఁ గలసి వీరరసాంగములైనవి. కాని యీ వీరరసస్ఫురణ మంతయు శిశుపాలుని చేష్టలవలన మాటలవలన నపనయింపఁ బడినది. చివఱ కీపద్యమందు వీరమాభాసమై హాస్యమే స్థిరపడినది ఏలయన సర్వసైన్య పరి వృతుఁడైన శ్రీకృష్ణుఁడు కన్యనపహరించి రథముపై నిడుకొని వెడలుచుండగా నేసన్నాహములేని పెండ్లికుమారుఁడు తోటిరాజుల సాహాయ్యమునుగూడ గాదని యొక్క పరిఘను మాత్రమే చేతఁగొని బీరములు వలుకుచు వెడలుట పరిహాసా స్పదమై హాస్యము నుత్పాదించినది. భరతముని హాస్యమునుగూర్చి —

> "అథహాసో నామ హాసస్థాయిభావాత్మకః స చ
> వికృతపరవేషాలంకారధార్ష్ట్య లౌల్య కుహకా సత్ప్రలాప
> వ్యంగ్య దర్శన దోషోదాహరణాదిభి ర్విభావైరుత్పద్యతే —
> .........అత్రానువంశే ఆర్యే భవతః—
> " విపరీతాలంకారై ర్వికృతాచారాభిధానవేషశ్చ।
> వికృతై రంగవికారైః హస తీతి రసః స్మృతోహాసః॥

అని నిర్వచించినాఁడు. ఈ నిర్వచనమును బురస్కరించుకొని విపరీతాకారము విపరీతచేష్టయుఁ గలిగివర్ణించిన శిశుపాలదర్శనము హాస్యరసపోషణ మొనరించి నదిట్లే నృసింహపురాణమునందు వరదర్పితుఁడైన హిరణ్యకశిపుఁడు ప్రౌఢ్వి తపసుల బాధించినాఁడు. అప్పు డెఱ్ఱన—

"తపములఁ గ్రుస్సిన తపసులఁ బట్టి తె
ప్పించి యచ్చరలతోఁ బెండ్లిసేయు

నృ. పు. ఆ. 2. 127.

అను పద్యమును రచించినాఁడు. నిజమునకుఁ దపముల గ్రుస్సిన తపసులఁబట్టి తెప్పించి పెండ్లిసేయుట, అశ్వముఖులఁ లాయంబులఁ గట్టి బొక్కనియలఁ గవణమెత్తుట, భుజగేశ్వరుల శిరంబున నున్న మణులూడ్చి వట్రువగుండు లెత్తుట లనునవి విపరీతాచారణములు. మహానుభావుల యెడ నూహింపఁగూడని దోషా చరణములు. అయ్యును దురహంకారహారియైన దైత్యుని విపరీతాచరణమును బ్రదర్శించుటకు నై సోమనాథునివలెనే యితఁడును నీవిధముగా వర్ణించి ఆశ్రయ భేదముచేతఁ జూచువారలకు నవ్వును బుట్టించుచు హాస్యరసపోషణ మొనరించి నాఁడు.

ఈ విధముగనే దేవకీదేవి యష్టమశిశువును బ్రసవించినప్పుడు గంసుఁ డాబిడ్డను దెగవ్రేయనుంకింప నామె—

"అన్నా యలుగకుమీ నా
కన్నది యిదె యాడుబిడ్డ గావుము దీనిన్
న్నిన్నొకటి సేయఁగలదే
కన్నియ యతిలోకపురుషకార సమగ్రున్" — హరి. పూ. ఆ. 5. 124.

అని పలికినది. ఈ పలుకులందు దైన్యముట్టిపడఁజేయుచు కరుణావృత్తిని గలిగించియు 'అతి లోకపురుషకార సమగ్రునను" పదప్రయోగముచేత నొక్క యుపాలంభనమును ధ్వనింపఁజేయుచు ఉక్తివైచిత్ర్యమును బోషించినాఁడు. ఈ విధముగనే హరివంశమందు భయార్తిచేఁ గంపించుచున్న స్నుష యను రాజకన్యను గూర్చి —

" కాటుక కన్నీరు కస్తూరికాపత్ర
కాంతకపోలంపుఁ గాంతిఁ బెనుప

హరి. పూ. భా. ఆ. 3. 129.

అని వర్ణించిన పద్యమందు శృంగార భయానకములు రెండును మేళవింపఁ జేసినాఁడు. కన్నీరొలుకుట, పెన్నెఱిపీడుట, నెమ్మేనుగరుపారుట లనునవి శృంగార భయానకము లగు రెండురసములకును నంగములే. కస్తూరికాపత్రకాంతి, కమ్మవిరులు ఉద్దీపనములు. పయ్యెదతూలుటలు సాత్వికములు. ఇట్లు పరస్పర విరుద్ధములై భ్రాంతిగొలుపుచుండఁ గవియే స్వయముగ "వెఱపు చేయు చేతలు తన్ను వితతభద్రలక్షణంబులై యిట్టు లలంకరింప" ననిచెప్పి సందర్భౌచిత్యముతో రసపోషణ మొనరించినాఁడు. ఇట్లే యీతఁడు సంభాషణముల ద్వారమునను, పదప్రయోగమందలి వ్యంగ్యవైభవముచేతను వీరరసపోషణ మొనరించినాఁడు –

ఉదాహరణమునకు :—

1. ఇదె కంటె సురనాథ నాభుజమం దేపారెడున్ ఘోరమై
హరి. పూ. భా. ఆ. 4. 145.

2. మెచ్చక యెదురైన మృత్యువు మెడద్రొక్కి క్రొవ్వాడికోఁఱలు ద్రెవ్వరాచి[84]
హరి. పూ. భా. ఆ. 154.

3. లీలమైఁ బాతాళమూలంబుదాకను
సలిలధిసలిలంబుఁ గలఁచిసొచ్చి — నృ. పు. ఆ. 2. 121.

ఎఱ్ఱాప్రెగడ సకలకళారహస్యముల నెఱిఁగిన మహాకవి యే కాక, సంగీత సాహిత్యపోషణుఁడైన ప్రోలయవేముని యాస్థానమం దుండుటచేత నా యా సమయములం దాయానట నటీగాయకులచేతఁ బ్రదర్శింపఁబడిన విశేషముల నన్నింటిని స్వయముగాఁజూచి యాకళలందుఁ బ్రత్యేకాభినివేశమును గలిగించుకొనినాఁడు. కావుననే యీతని గ్రంథములం దనేకసందర్భములందు గానకళాప్రసంగము గానవచ్చుచుండును. ఉదాహరణమునకు నృసింహపురాణమందు అప్సరసల విభ్రమవ్యాపారములఁ జెప్పుచు—

"ఓర్తు కరతాళ మొనరింప నోర్తు సమద
గతి పచరింప సరి తాళగింప నోర్తు
మధుర మదిరారసోల్లాసమత్త యగుచు
నాడె నొక్కతె లలితాంగి హారగతుల — నృ. పు. ఆ. 2. 82.

అని రచించినాఁడు. మఱొక్కచోట

"వీణావేణు మృదంగసంగతవిన్యాసమున్ బంధుర
శ్రోణీరమ్యఘనస్తనీనటన చారుప్రేక్షయున్ సంతత

---

84. నృ. పు. ఆ. 2.119.

ప్రాణప్రీణనగంధబంధ విలస త్కాదంబరీకేలియున్
ప్రాణంబు ల్దనకొం డెఱుంగఁ డతఁ డెబ్భంగిన్ సమస్తక్రియన్
నృ. పు. ఆ. 3. 64.

అని రచించిన పద్యమందు నానావాద్యసంగీతమును, నాట్యమును, కాదంబరీ (పాన) కేళియును బేర్కొనినాఁడు.

మఱియు నిట్లే " కేళాదిరాయ వితరణ "

" లలితగగనరంగంబున " హరివంశము.

" లయ కాలకేళ తాండవ "

" సురుచిర తారకా కుసుమ శోభి నభోంగణ భూమిగ్రాల "

యను నృసింహపురాణమందలి పద్యములందును తెరలు, పుష్పాంజలులు, రంగస్థలములు మున్నగువానిని బేర్కొని యాకాలమందు రంగస్థలముపై తెరలనుంచి సలక్షణముగా నాటకప్రదర్శనములు జరుగుచుండెడివి యని చెప్పుట కవకాశమును గల్పించినాఁడు.

ఇట్లే యీతఁ డానాఁడు నాగరికు లొనరించు, వెన్నెల విహారములను, వసంతయాత్రా, వనజలకేళులను, పానకేళి మున్నగు విహారములన్నియును వర్ణించినాఁడు.

ఎఱ్ఱాప్రెగడ రాసక్రీడను చెప్పుచు —
"ఒకత నొక్కత మెడపెట్టి యొకఁడొకఁడు
దానసై మండలాకృతిగా నమర్చి
నడుమ నొకమూర్తితో వేణునాద లీల
నందఱను దేల్చు నందగోపాత్మజుండు.
హరి. పూ. భా. ఆ. 8. 28.

అని రచించినాఁడు. విష్ణుపురాణమున రాసోత్సవమునుగూర్చి చెప్పుచు
"యోగేశ్వరేణ కృష్ణేన తాసాంమధ్యే ద్వయో ర్ద్వయోః ప్రవిష్టేన ఇతి"[85]
అను శ్లోకము గానవచ్చుచున్నది.

**భాగవతమందు :—**

" రాసోత్సవః సంప్రవృత్తో గోపీమండలమండితః
యోగీశ్వరేణ కృష్ణేన తాసాం మధ్యేద్వయోర్ద్వయోః
ప్రవిష్టేన గృహీతానాం కంఠే స్వనికటం స్త్రియః॥

---

**85. వి. పు. అంశ. V.**

అని వర్ణింపఁబడియున్నది. ఈశ్లోకములే యెఱ్ఱనకు మూలములుకాగా నాతఁడు హరివంశమందు రాసక్రీడ నభివర్ణించినాఁడు. బహుశాస్త్రపండితుఁడైన యెఱ్ఱాప్రెగడ నృసిహపురాణమం దాయాసందర్భముల కర్మయోగ' త్రైవిద్య, శైవ, వైష్ణవ, పాంచరాత్ర, మాంత్రిక, ఔపనిషదములగు ననేక విధానముల నెఱిఁగి[86] రచించుట యే కాక దానినాతఁడు విజ్ఞానసర్వస్వము వలె తీర్చినాఁడు అంతేకాక యీతఁడు దీనిని విజ్ఞానాత్మక వాఙ్మయమనియే భావించినాఁడు. ఈతఁ డనేకచోట్ల విజ్ఞానమను శబ్దమును వాడుచుండును. ఎఱ్ఱాప్రెగడ విజ్ఞానశబ్దముకు విశేషజ్ఞాన మనునట్లుగ స్వీకరింపవలయు నని పెద్దలు భావించినారు. విజ్ఞాన మనఁగా పరతత్త్వవిద్య. బ్రహ్మజ్ఞానము, ఆత్మజ్ఞానము, అను నర్థములందు స్వీకరించి యెఱ్ఱన యుపయోగించినట్లు గానవచ్చుచున్నది. ఆ యీసందర్భములం దెఱ్ఱన యెంతటి నిగూఢమైన సాంఖ్య, వేదాంత తత్త్వ విశేషముల బ్రదర్శించి నప్పటికిని కావ్యములందు బ్రధానముగా భక్తితత్వమునకే యగ్రతాంబూల మొసఁగి సర్వజనోపయోగ మొనరించినాఁడు. నిజమున కీభక్తిప్రాధాన్యము నాంధ్రభాషయందుఁ బ్రవేశపెట్టి యావిధానము జీవులసద్గతికి మూలమని బోధించిన ప్రథమాంధ్రకవి యీతఁడే యైయుండనోపు. ఈతనిచేఁ బ్రారంభింపఁ బడిన యీవిధానమే పోతన భాగవతమునందు నిండారి పండి ఫలించినది. అంతేకాక యీతఁడు దైవరతికమైన దివ్యశృంగారమును బ్రవేశపెట్టి మధురభక్తి విధానమునకు దారితీసినవాఁ డనియుఁ బేర్కొనవచ్చును. ఉదాహరణమునకు గోపికల విరహమును వర్ణించుచు —

> " కలువరించియుఁ గృష్ణాఖ్య తెలిసియున్న
> యపుడుఁ గృష్ణాఖ్య యేమఱినట్టివేళ
> యందుఁ గృష్ణాఖ్యదక్క నయ్యంగనలకు
> రాదు వేఱొక వాక్యంబు రసన తుదకు.'' హరి. పూ. భా. ఆ. 9 — 20.

అని రచించిన పద్యములో గోపికల విరహమును పరమ పవిత్రమైన భక్తిఁగాఁ బరిణమింపఁజేసినాఁడు, శ్రీహరి దక్క అన్య మెఱుఁగని గోపికలు శ్రీహరి సాయుజ్యమును బడయుటలో వింత లేదుకదా!

నృసింహపురాణ మందు భక్తిప్రాధాన్యము నుదాహరణపూర్వక నిదర్శనములతోఁ జూసినట్లు ప్రహ్లాదచరిత్రను రచించినాఁడు అట్లు మహాభక్తుని చరిత్రమును జెప్పుటయేకాక "వినజాలు భవన్మహత్త్వము, "తమతమ పూర్వ

86. నృ. పు. ఆ. 3. 24. 25. 29. 31.

వాసనల, హరిభక్తితేపగా, హరిగోవిందుఁ డనంతుఁడు, నారాయణుని దివ్యనామ సంకీర్తనం బను పద్యములలో నాశ్రీహరి మహిమను కంఠోక్తిగాఁజెప్పినాఁడు.[87] భక్తునకు ప్రత్యక్షమైన స్వామి సగుణ నిర్గుణ రూపములను వర్ణించి యాదేవుఁడు విజ్ఞానులకు సామాన్యులకును సులభుఁ డని సూచించినాఁడు.

ఎఱ్ఱనకు యోగమనిన నభిమానము మెండు. అతఁడు శృంగారిని నయితము మహాయోగిగా భాసింపఁజేసినాఁడు. అంతేకాక యతఁడు పరాత్పరుఁడైన శ్రీమన్నారాయణుని " యోగులుగను చిత్సుఖానుభవగర్వము సర్వమని యును, అక్షయయోగముక్తులు సంయమ క్షమా శిక్షితులు నైన మహాత్ము లచ్యుతుని భజించుచుందు రని చెప్పి నారాయణు భజనమునకు మఱియు యోగమున కవినాభావ సంబంధమును గల్పించినాఁడు. నృసింహపురాణమున దేవతలొనరించిన నారాయణస్తోత్రమునందు —

1. " దాస్యమొకండునుం బరమధర్మముగాఁ గొని యన్యధర్మమా "
అనుపద్యమున పాంచరాత్రవిధానమును నృ. పు. ఆ. 3 — 27.

2. " ద్వైతభ్రాంతివికల్పితం బఖిలమున్ స్వప్నేంద్రజాలోపనుం "
ఆ. 3. - 28.

అను పద్యమున అద్వైతవిధానమును నిరూపించినాఁడు. ఈసందర్భమునందు శ్రీహరిని " అపరోక్షాభేదచిత్సౌఖ్యవిఖ్యాతుఁ డనియు, కళ్యాణ నారాయణుఁ డనియుఁ బేర్కొనుట గమనింపదగినది.

ఎఱ్ఱన తనగ్రంథములందు నానాశాస్త్ర పరిజ్ఞాన పాండిత్య శౌండీర్యములనే కాక నాఁటి సాంఘిక పరిస్థితులను గూడ ప్రతిబింబింపఁజేయుచు రచనము గావించినాఁడు. ఉదాహరణమునకు ప్రయాణసన్నాహములు—

సీ॥ బండ్లమెట్టింపుపై బరువులెక్కింపుమీ — హరి. పూ. ఆ. 6. 22.

అను పద్యమున విలువైన వస్తువులను ప్రయాణావసరములందు జాగ్రత్తచేయు మార్గములు సెప్పఁబడినవి. అంతియకాక లావుమానసులు కదుపులఁ గొని ముందుపోవ, వెఱుందబండ్లజాడను దక్కిన ప్రజయును దరుణీజనంబును నడుచుచుండఁగ వంగ్వంధ జరఠప్రముఖులు గ్రుస్సి యోలాకుపద నెడనెడం దగువారు గావలియై నడచుచుండెడి యాచారమున్నట్లు రచించినాఁడు. ఇవి సామాన్యులకు, ప్రభువులకు పల్యంకికలు, రథములు, చతురంతయానములు, తురంగములు, భద్రేభముట గలవు.

---

87. నృ. పు. ఆ. 3. 20. 22.

## నమ్మకములు — ఆచారములు

దైవజ్ఞులు రాజవ్యపాయంబునకు గణించు నిమిత్తంబులు, దేవతాప్రతిమలు చలించుటలు, నుల్కానిర్ఘాతంబులు పడుటయు, సూర్యచంద్రమండలంబులు క్రూరరాసుల వక్రించుటలు — హరి. పూ. భా. ఆ. 8. — 28.

**రోగశాంతి :**— మంత్రంబులు, నౌషధంబులు నగ్నిశర్మాదులు రోగోపశమన ప్రకారంబు లగుటయేకాక తామున్న స్థలమునుండి యొకక్రోశము దూరమునందు ఆవాసము నిర్మింపవలయునట — హరి. పూ. భా. ఆ. 6. 5.

శివములు, భూతావేశములు, మున్నగునవి పేర్కొనఁబడినవి. ఎఱ్ఱాప్రెగడ జనపదంబుల ప్రకృతిశోభనుమాత్రమే కాక యాపశుజీవనవిధానమును, రోగములను, ఆరోగవిధానములను సయితమెఱిఁగి రచించినాఁడని చెప్పుట కుదాహరణముగా హరివంశము పూర్వభాగము ఆశ్వాసము 6 లో 44 — 46 పద్యములఁ బేర్కొనవచ్చును. ఆవిధముగనే యీగ్రంథమునం దాబోతుల దమించువిధానము చెప్పఁబడినది.[88]

**రాజధర్మములు :**— మధ్యాంధ్రదేశమును ధర్మోత్తరముగాఁ బాలించిన ప్రోలయ వేముని యాస్థానమం దుండుటచే నతఁ డుత్తమరాజధర్మముల నెన్నిందినో తనకావ్యములఁ బ్రవేశ పెట్టినాఁడు. ఉదాహరణమునకు —

" సౌమ్యనకోడయలు మీరా
జ్యమ్మునకుం గర్తలీరయంచిత కల్యా
ణమ్ములకుఁ బ్రవర్తకులరు
మిమ్మలరించుటయె యెల్లమేలును నాకున్ " —

హరి. పూ. భా. ఆ. 4. — 42.

అను పద్యమందు నేఁటి Democracy కన్న నుత్తమలక్షణములఁ జొప్పించి ప్రజారంజనమే ప్రభువు ప్రథమధర్మమ్మనునట్లుగాఁ జూసినాఁడు. మఱియు నృసింహపురాణమున—

" విజయాభిమాన తృప్తబ
హుజనద్విషుఁ గామసంవృతోన్మాదు వినో
దజితునివెనఁ దొడరంగా
విజయంబగు ననిరి నీతి విస్తరవేదుల్ — ఆ. 2.— 142.

---

88 హరి. పూ. భా. ఆ. 6. 13.

అను పద్యమునందు రాజనీతిని "స్థానంబును వృద్ధియు" అను పద్యములో త్రివర్గతత్త్వమును, 116 వ పద్యమున శత్రుభేదనోపాయములను, మఱి వేఱు పద్యములందు సప్తాంగములను సాకల్యముగా వర్ణించినాఁడు. అట్లే హరివంశమున ఉ.— 94 వ రాజసేవయు, 95 వ పద్యమున కార్యసాధనా విధానములను బొందుపఱచి రచించినాఁడు.

**స్త్రీలకుఁ గల స్థానము :—** హరివంశమున సంజ్ఞాదేవి తండ్రి గినిసి బలికె నను మిషతో స్త్రీయెట్టిస్థితియందును భర్త యిలు విడిచిరాక యుండవలయు ననియు, వారికి భర్తదప్ప మఱి వేఱు శరణములేదనియుఁ దెల్లమొనరించినాఁడు[89] ఇట్లే గోపికలు శ్రీకృష్ణుని యాగడముల నాతని తల్లికి నివేదించుచు "మగడింక నన్ను సైఁచునె, దిగవిడుచుం జంపుఁగాక[90] యని పలికిన మాటలందు తప్పిద మొనర్చిన భార్యల భర్తలు నాఁడు విడుచుటయో లేక క్రూరముగా శిక్షించుటయో జరుగుచుండెడి దని తెలియఁబఱచినాఁడు.

**ఛందోవిశేషములు :-** ఈతఁడు సాధారణములైన ఉత్పల, చంపకమాలాదులే కాక మత్తకోకిల, క్రౌంచపదము, మందాక్రాంత, మాలిని, స్రగ్విణి, పృథ్వి, వనమయూరము, తోదకము, భుజంగప్రయాతము, తరువోజముతరళ, అంబురుహ, స్రగ్ధర, మహాస్రగ్ధర మొ॥ వృత్తములనుగూడ నుపయోగించినాఁడు. ఉదాత్తవస్తు వర్ణనావసరములందు స్రగ్ధరా, మహాస్రగ్ధరల నుపయోగించినాఁడు.

నృసింహపురాణమున రౌద్రరసమును వర్ణించుటకు మహాస్రగ్ధరా స్రగ్ధరలను వాడఁగా హరివంశమం దెల్లెడలను మత్తేభ వృత్తమునే వాడినాఁడు. ఇఁక నధికులై ప్రభుత్వము నెఱపువారిని, ధీరోదాత్తులైన నాయకులను వర్ణించుటకును శ్రీకృష్ణలీలలను వర్ణించుటకును శార్దూలవిక్రీడితముఁజేపట్టినాఁడు. మఱియు భటులను, స్త్రీలను, సభికులను, బలవంతులయ్యు దైవోపహతులైన వారిని, వారి సంభాషణాదులను వర్ణించునప్పుడు చంపకమాలావృత్తమును స్వీకరించినాఁడు.

నిత్యసత్యములు, నీతిబోధకము లగు వాక్యములు, ధర్మోపన్యాసములు చెప్పుటకు కందముల నుపయోగించినాఁడు. ఈతఁడు సీసము తరువాత నాట వెలదులనే వాడినాఁడు. మఱియు నీతఁడు ప్రయాణత్వరను జూపుటకు మత్తకోకిలావృత్తమును, నరసింహదేవుని స్తుతించు సందర్భమున దండకమును

89. 1 - 177.
90. 225.

ప్రవేశపెట్టినాఁడు. శార్దూలవృత్తము నుపయోగించి యావృత్తముయొక్క మూఁడు పాదములందును శార్దూలశబ్దము పాదారంభమునందు వచ్చునట్లు రచించినాఁడు. హరి. ఉ. భా. ఆ. 10—23 ఇట్లే మత్తేభవృత్తమును గ్రహించి, వనమాతంగ విహారము నుపమించుచు శ్రీకృష్ణకృతగోవర్ధనోద్ధరణమును వర్ణించినాఁడు. హరి. పూ. భా. ఆ. 7.176. ఇట్లే నక్షత్రమాలాస్తవము 27 పద్యములలోఁ జెప్పి నక్షత్రసంఖ్యతో సంవదించినాఁడు. ఇట్లీతఁడు కావ్యములలో దండకములను, శ్లోకములనే కాక శ్లేషాద్యలంకారయుతమైన దీర్ఘవచనములను మఱియు స్తంభోద్భవవచనమను నొక్క వచనవిశేషమును నృసింహపురాణమందుఁ బ్రవేశపెట్టినాఁడు.

ప్రాసవిశేషములు :— ఎఱ్ఱన ల—శ ప్రాసను, శ—స ప్రాసను వాడినాఁడు. (హరి. పూ. భా. ఆ. 9. 77, హరి. ఉ. భా. ఆ. 10. 27.; హరి. పూ. భా. ఆ. 9. 87.) నృసింహపురాణమున ద—ధప్రాసము, ఖండాఖండబిందుప్రాసములును గానవచ్చుచున్నవి. ఎఱ్ఱాప్రెగడ అఖండయతిని వాడినట్లు శ్రీ దివాకర్ల వేంకటావధానిగా రింతవఱకే పేర్కొనినారు.

వ్యాకరణ విశేషములు :- నన్నయవలె ఎఱ్ఱనయుఁ గారక ప్రక్రియయం దొక విశేషముఁ గనఁబఱచినాఁడు.

(1) నేరుపుగలననుచు, తనమున్ను విన్నయట్టి, మనచూచినమేరలు.

(2) అతని యిచ్చినపణ్యంబు; నాచెప్పెడు మతము, దీనివిన్నయవ్విను కలి, నావచ్చునందాక, అతని యొనరించు వినయము మొదలగునవి.

భావార్థకటకారము :— భావార్థకమైన టకారమున కచ్చువరమైనవు డా శబ్దము డకార విశిష్ట మొనర్చి రచించినాఁడు.

ఉదా :— వధియించు డొప్పు — హరి. పూ. భా. ఆ. 2. 185.
పోరుడొప్పు — హరి. పూ. భా. ఆ. 2. 175.

పదమధ్యస్వరలోపములు :- గతులిడ్డుంబూని. హరి. పూ. భా. ఆ. 8. 63. మీర్గడు — పూ. భా. ఆ. 9. 25. కన్నడ్డ — పూ. భా. ఆ. 8. 151.

బహువచనముపై బహువచనము :— 1. వండ్లులు గొఱుకుచు, 2. కాళ్ళులు రెండు, 3. త్రాళ్ళులు మొదలగునవి.

ఇకారసంధులు :— నిఖిలవేది వుపేక్షింప నీకుఁదగునె, వెండివెల్లినుకవెల్లె, పరగిరెవ్వారు, కలిమున్నతి మున్నగునవి. ఇట్లే నిలిపితేని, చేసితేని వంటి ప్రయోగములు గానవచ్చుచున్నవి. క్రియాజన్యవిశేషముల తరువాత 'కంటె' అను

అను పద్యమునందు రాజనీతిని "స్థానంబును వృద్ధియు" అను పద్యములో త్రివర్గతత్త్వమును, 116 వ పద్యమున శత్రుభేదనోపాయములను, మఱి వేఱు పద్యములందు సప్తాంగములను సాకల్యముగా వర్ణించినాఁడు. అట్లే హరివంశమున ఆ.— 94 న రాజసేవయు, 95 వ పద్యమున కార్యసాధనా విధానములను బొందుపఱచి రచించినాఁడు.

స్త్రీలకుఁ గల స్థానము :— హరివంశమున సంజ్ఞాదేవి తండ్రి గినిసి బలికెనను మిషతో స్త్రీయెట్టిస్థితియందును భర్తయిలు విడిచిరాక యుండవలయు ననియు, వారికి భర్తదప్ప మఱి వేఱు శరణములేదనియుఁ దెల్లమొనరించినాఁడు[89] ఇట్లే గోపికలు శ్రీకృష్ణుని యాగడముల నాతని తల్లికి నివేదించుచు "మగడింక నన్ను సైఁచునె, దిగవిడుచుం జంపుఁగాక[90] యని పలికిన మాటలందు తప్పిద మొనర్చిన భార్యల భర్తలు నాఁడు విడుచుటయో లేక క్రూరముగా శిక్షించుటయో జరుగుచుండెడి దని తెలియఁబఱచినాఁడు.

ఛందోవిశేషములు :- ఈతఁడు సాధారణములైన ఉత్పల, చంపకమాలాదులే కాక మత్తకోకిల, క్రౌంచపదము, మందాక్రాంత, మాలిని, స్రగ్విణి, పృథ్వి, వనమయూరము, తోదకము, భుజంగప్రయాతము, తరువోజముతరళ, అంబురుహ, స్రగ్ధర, మహాస్రగ్ధర మొ॥ వృత్తములనుగూడ నుపయోగించినాఁడు. ఉదాత్తవస్తు వర్ణనావసరములందు స్రగ్ధరా, మహాస్రగ్ధరల నుపయోగించినాఁడు.

నృసింహపురాణమున రౌద్రరసమును వర్ణించుటకు మహాస్రగ్ధరా స్రగ్ధరలను వాడఁగా హరివంశమం దెల్లెడలను మత్తేభ వృత్తమునే వాడినాఁడు. ఇఁక అధికులై ప్రభుత్వము నెఱపువారిని, ధీరోదాత్తులైన నాయకులను వర్ణించుటకును, శ్రీకృష్ణలీలలను వర్ణించుటకును శార్దూలవిక్రీడితముఁజేపట్టినాఁడు. మఱియు భటులను, స్త్రీలను, సధికులను, బలవంతులయ్యు దైవోపహతులైన వారిని, వారి సంభాషణాదులను వర్ణించునప్పుడు చంపకమాలావృత్తమును స్వీకరించినాఁడు.

నిత్యసత్యములు, నీతిబోధకము లగు వాక్యములు, ధర్మోపన్యాసములు చెప్పుటకు కందముల నుపయోగించినాఁడు. ఈతఁడు సీసము తరువాత నాటవెలదులనే వాడినాఁడు. మఱియు నీతఁడు ప్రయాణత్వరను జూపుటకు మత్తకోకిలావృత్తమును, నరసింహదేవుని స్తుతించు సందర్భమున దండకమును

89. హరి. పూ. భా. ఆ. 1 - 177.
90. హరి. పూ. భా. ఆ. 5. 225.

ప్రత్యయము "నిరమ్మెయుఁగా నసూస నంటు పుక్కిలి పోనీనే" అనుచోట ప్రయోగించినాఁడు. ఇది తనయము నలుఁగొనుటకు మయట్ ప్రత్యయము చేర్చి, "ప్రౌఢులమయము" అని పాండురంగమాహాత్మ్యమున, 'తనయయము' అని నృసింహపురాణమందును ప్రయోగించినారు.

## పదప్రయోగ విశేషములు

ఎఱ్ఱాప్రెగడకవితయందు అలంకార, రససంబంధమగు సూక్తివైచిత్ర్యమేకాక పదప్రయోగసంబంధమగునట్టి దొకటి కానవచ్చుచున్నది. సాధారణముగా గ్రామీణ వ్యవహారసిద్ధములైన పదములను గ్రహించి హరివంశమం దుపయోగించుటలో నీవిశేషము గోచరించుచున్నది. ఇతఁ డొక్కొక్కప్పుడు జానపద వ్యవహారసిద్ధములైన పదములనుగాని యాపదములను మఱియొక యుపపదముతోఁ గూర్చికాని లేక యాప్రయోగసందర్భమును బురస్కరించుకొనికాని యాపదములకొక విచిత్రార్థము గల్పించుచు రచించినట్లు గానవచ్చుచున్నది. ఇట్లుప్రయోగించిన పదబంధములు విశేషార్థమును సంతరించుకొనియు దేశీయచ్ఛాయను విడువక చమత్కారజనకములుగాఁ గానవచ్చుచున్నవి

**ఉదాహరణమునకు :-**

ఎద్దుపట్టెఁపు గాడుఁదుట, ఉప్పుగొట్టు, మోపువెలితి సేయుట, మోపుటఱకనే పాయుట, పెసలపడుపు, ముఱుగుఁబోటులు, అక్కటాండు, పడసుడుగు, ఎదమడుపు, తనుపసాలించుట, పెనుమడుపు, మూఁటఁబోవుట, పండు పోవుట, ప్రాణములకుఁ దెగుట, పురికొనుట, బాతిని, మూఁడు జాలతరి, సదకట్లు, బడిసిపైచుట, బమ్మరపోవుట, జారిగదచుట, తోడునులు, ఇంట్ర పడకుండుట, అచ్చుకట్టుట, శరములగుట, కత్తిరికలయుట, గొదలువడుట, కడపలగుట — మున్నగు పదములను, పదప్రయోగవిశేషములను జూపవచ్చును.

ఈ పదములన్నిటికి శబ్దరత్నాకరాదులం దర్థములు గానరావు. ఒకవేళ అర్థములొసఁగఁబడినను నయ్యవి యట్టిప్రయోగవిశేషములకు సందర్భౌచిత్యముతోఁ బొసఁగవు. ఏలయన నివ్వి యన్నియు గ్రామీణుల పలుకుబడులు, మఱియు నాయావృత్తి పదవిశేషములతో సమ్మిళితములు, గాన నాయాసంప్రదాయముల నెఱుఁగకయే యర్థము సుగమమై కనవచ్చునవి కావు. ఈ విధముగా ననేక విచిత్రమార్గముల నవలంబించి యెఱ్ఱనసూక్తివైచిత్ర్యమును గావించుచు రచన గావించి కవిత్రయము నందొక్కరుఁడై నిలిచినాఁడు.

—:o:—

## ఉపసంహారము

ఈవిధముగా నెఱ్ఱన సకలభాషాకవిత్వవిశారదుఁడై, ప్రబంధపరమేశ్వరుఁడై, శ్రీకంఠచరణసేవకుఁడుగ శంభుదాసుఁడై, వైకుంఠగుణావధానవర్ణననిపుణుఁడై శ్రీమహావిష్ణు, అంశావతార, మహిమావతారాదుల నభివర్ణించుట యందుఁ బ్రధానములైన రామాయణ, హరివంశ, నృసింహపురాణాదుల రచించి యాంధ్రసాహిత్యమున కెనలేని సేవచేసిన మహానుభావుఁడు.

ఈమహాకవి కృషివలననే యాంధ్రభారతి యంతయు నొక్కచోఁ జేరి యష్టాదశపర్వసంభృతమైన యాంధ్రమహాభారతరూపమున సమగ్రమై యాంధ్రావళికి మోదమును గూర్చినది. ఇంతవఱకొకరు ప్రారంభించిన గ్రంథమును మఱొకకవి పూరించుట యన్న యాచారము లేదు. అట్టి ఒరవడి నీతఁడు ప్రారంభించుటయేకాక పూరించిన గ్రంథము నాతొలికవి పేరనే పూర్తిగావించిన యుదారుఁడు.

ఇంతేకాక నృసింహపురాణము నొకవిధముగాఁ జూచిన క్షేత్రమాహాత్మ్య మనవచ్చును. కావున నృసింహపురాణమును రచించి యాంధ్రసాహిత్యమందు రసవత్తరమైన క్షేత్ర మాహాత్మ్య ప్రక్రియావిధానమునకు శ్రీకారమునుజుట్టిన ప్రముఖ్యుఁ డీతఁ డనవచ్చు. ఈతనితరువాతనే శ్రీనాథ, తెనాలిరామకృష్ణాదులు క్షేత్రమాహాత్మ్యముల రచించి యాప్రక్రియావిధానమున కొక గౌరవము నాపాదించినారు.

నిజముచెప్పవలయు ననిన పదునాల్గవ శతాబ్దమునందు వెలసిన యిద్దరు మహాకవుల యహమహమికయే యాంధ్రసాహిత్యలక్ష్మిని సర్వాంగసుందర మొనరించినది. అంతేకాక యెందఱెందఱో మహాకవుల కుత్సాహశక్తియై నడిపించినది. మహాకవులు, మహాపండితులు, మహానుభావులునైన నాచనసోమనాథ, ఎఱ్ఱాప్రెగడలవలననే తరువాతి యాంధ్రసాహిత్యమంతయు నొక్క క్రొత్త మురిపెమునుగూర్చుకొని యలంకారముల నంతరించుకొనినది! మహాకవి, మహామనీషియైన తిక్కన సోమయాజి భారతగ్రంథమునందు సూక్ష్మరూపమునఁ బొందుపఱిచిన విశేషాంశములను వెలికిఁదీసి రూపురేఖలఁదీర్చిదిద్ది బహుళ ప్రచారమును పొందింపఁజేసినవా రీమహాకవులే. ఉదాహరణమునకు, ప్రాచీనర్షి సమ్మతమైనదియు, వేదవ్యాసముని ప్రతిపాదితమైనదియు, ఐహికాముష్మికఫల దాయియైనదియు నగు హరిహరాభేదతత్త్వమును లోకోపకారబుద్ధియై తిక్క

యజ్వ భారతగ్రంథమునందు సంభావించఁగా నాతనితరువాతివాఁడు, సర్వజ్ఞుఁడు కవిశేఖరుఁడునైన నాచనసోమనాథుఁ డాతత్త్వమును గ్రహించి ... ప్రచారము గావించినాఁడు. అట్లే యెఱ్ఱనయు తిక్కన పాదుగొల్పిన భక్తిభావబీజముల నేరి తనగ్రంథములందు నారుపోసి నీరుకట్టి ప్రరోహమును బొందింపఁగా, సహజ కవితాభిరాముఁడు భక్తాగ్రగణియునైన పోతనామాత్యుఁ డాభక్తి నొకప్రధాన తత్త్వముగా స్వీకరించి భాగవతగ్రంథమునందు పరిపూర్ణత ...ంచినాఁడు. శ్రీకృష్ణజన్మలీలావిరాయోధనముల వర్ణించుపట్టున భాగవతమునందుఁ గానుపించు శ్రుతిసుభగములు శబ్దాలంకారయుతములునైన పోతనామాత్యుని పద్యములందు, నాచనసోమన, ఎఱ్ఱాప్రెగడల సమన్వయరూపమును గాంచవచ్చును

స్వభావోక్తి నలంకారప్రతిపత్తిని గూర్చి సంభావనీయ ... యాతఁ డెఱ్ఱాప్రెగడ యని చెప్పవచ్చును.

అనువాద సందర్భమునందు నన్నయ, తిక్కన, నాచనసోమనాథుల కన్న కొంత భిన్నమును, విశిష్టము నైన యెఱ్ఱన యనువాదవిధాన ... ప్రభావితుఁడైనవాఁడు శ్రీనాథకవిసార్వభౌముఁడు కావుననె యాతని కాశీఖం... లరదు మయూరకృత సూర్యశతకాదులందలి శ్లోకానువాదములు గానవ... చున్నవని భావింప వీలగుచున్నది. ఇంతేకాక కవిసార్వభౌముఁడైన శ్రీనాథుని యంతటికవిచేత ప్రశంసల నందుకొనినట్టి యెఱ్ఱాప్రెగడసూక్తివైచిత్ర్యవ... నన్నయధారాశుద్ధి, తిక్కనతెలుఁగుతీయందనము తన సహజపరిశీలనావ్యష్టి... మేళవించి యొకనూతనవికాసముతోఁ బద్యములల్లినవాఁ డెఱ్ఱన.

ఈవిధముగా నెఱ్ఱన మహాకవియై, కవిత్రయమునం దొకరుఁడై తరువాతి కవుల కాదర్శప్రాయుఁడై యుద్గ్రంథముల రచించి యజరామరుఁడైనాఁడు.



Printed at WRITER'S ANVIL, Hydrabad - 4.